

శ్రీహయగ్రీవాయ నమః





# శ్రీమదాంధ్ర మహాభారతము



వే[illegible] - వెంకటకృష్ణమసెట్టి అండ్ సన్సుచే
ప్రకటింపఁబడుచుండినది.

తదుపరి

ఎ. కన్నన్ సెట్టి అండ్ కంపెనీవారిచే
ప్రకటితమైనది.



ప్రకాశకులు:

[illegible]

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు,

గుంటూరు — రాజమండ్రి — భీమవరం.

1946

# విషయసూచిక

## ఆంధ్రమహాభారతము.

### కర్ణపర్వము - ప్రథమాశ్వాసము.



### కర్ణపర్వము - ద్వితీయాశ్వాసము

## శల్యపర్వము – ద్వితీయాశ్వాసము.



## సౌప్తికపర్వము – ప్రథమాశ్వాసము.

## సౌప్తికపర్వము – ద్వితీయాశ్వాసము.



## స్త్రీపర్వము – ప్రథమాశ్వాసము.



## స్త్రీపర్వము – ద్వితీయాశ్వాసము.







హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## కర్ణపర్వము, ప్రథమాశ్వాసము.



పరిణామమసితిని
ద్వాపారీణత్వకారిక్రతానిరతాపాం
గా పరమస్మిత ప్రీకత్వ
వ్యాపారప[1]రానుషక్త హరిహరనాథా. 1

సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని తెగుటం జెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు మహాప్రాజ్ఞుం డగు సంజయుండు దండువనుండి హస్తిపురంబునకు నరుగుదెంచి ధృతరాష్ట్రుమందిరంబు ప్రవేశించి యంతఃపురంబున నున్నయన్నరనాథుం గనుంగొని కృతప్రణాముం డగుటయు నతం డాదరించిన నాసీనుం డై. 2

క. బలవిక్రమములు వినుతింపఁ, బలుగా మన మొనలుఁ బాండుపుత్త్రానీకం
బులు రెండునాళ్లు పోరుటఁ, దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. 3

వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి. 4

చ. సరకుగొనండు పాండుసుతసైన్యనికాయము నించుకేనియుం
గరులు రథంబులుం హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకుమాలియు నల్గడఁ బాఱియుం వియ
చ్చరులకు వేడ్క సేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. 5

వ. చూపి యక్కౌంతేయులం గలంచి యాడి పడంపడి. 6

తే. తనకు [2]బిమ్మిటి యైనయర్జునుని బాహు,లీల నెమ్మిఁ ద్రోవంగ రేక తెగియె
నధిప యాఁబోతు బెబ్బులి కగ్గ మైన, వగిది[3] యై పాండవులకును బగయడంగ.

వ. అనుచు శోకోపహతుం డై సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి డగ్గుత్తిక పట్టి యిట్లనియె. 8

చ. అది యొకఁ డేల కౌరవచయంబు జయాశ యడంగిపోవ నె
ట్టిదుఁ డగు భీమసేనుఁడు గడిందిమగంటిమి దుస్ససేనుడు

1. క. రానురక్త. 2. గ. ఁబిమ్మట యైన. ఙ. మిక్కుట మైన. 3. ఙ. యాఁబోతు బాంధవులకుఁ బగ.

ర్మద మడఁగించి పేరురము వ్రచ్చి మహోగ్రతఁ ద్రావె నెత్తు[1]ర
య్యాదిదుఁ డింత వృత్తమని యాప్తజనంబులు మున్న చెప్పరే. 9

తే. కొడుకు లంత రాజ్యంబునకుఁ గొనఁగఁ జిక్కు, లనుచు రాజను వారలకయి వినయములు
నీ వుపేక్షింతు మానునే యావిరుద్ధ, కర్మమున ఫల మొందక కౌరవేంద్ర. 10

వ. అనిన విని యాంబికేయుండు దుర్యోధనుండును డెగియెనకాఁ దలంచి విహ్వలించి మూర్ఛిల్లినం దల్లడిల్లి యార్తనాదంబులతో వివశంబు లయి వనితాజనంబులు గన్నీరు గ్రమ్మ వసుంధర నొఱగిన నంతకు మున్న వచ్చి యున్న విదురుండును నాసూతనందనుండును జేరి చేసేత శీతలజలసేచనమృదువ్యజనవీజనంబుల నన్నరనాథుని నారీసముదయంబును సేదదేర్చిన నాసీనుండై యతండు దీర్ఘనిశ్వాసంబు లడరం జింతిల్లి యంతర్గతంబున దైవంబు గర్హించి పాండవుల నగ్గించి తనబుద్ధియు శకునివెరవును నిందించి తన్నుం దాన యుపశమించుకొని ధైర్యంబు సిక్కంబట్టి.

క. తెలియ విన నీవు సెప్పిన, పలుకులు దుర్యోధనుండు పడఁడు గదా వై
రులవిక్రమమున సంజయ, కలరూ పెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్. 12

చ. అనుటయు నాతఁ డిట్లనియె నమ్మనుజేంద్రున కాజిఁ గర్ణుఁడుం
దనయులుఁ దమ్ములుం బడిరి దారుణవిక్రమకేలి సల్పి నె
ట్టన బలుఁ బారఁ బట్టి వికటంబుగ వక్షము వ్రచ్చి మున్ననే
నునిరుధిరంబు మారుతతనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్. 13

క. అనిన విని [2]యంతకేమియు, ననకూరక యుండు సంజయా నీమాటల్
విన నేరదు విభ్రాంతిని, మునిఁగినయది చిత్త మని విషమూర్ఛాత్మకుఁ డై. 14

వ. ధృతరాష్ట్రుండు మ్రానుపడి యుండి కొండొకసేపునకు సేద దేఱి యాసూతనందనునికిట్లనియె. 15

క. నాదుర్ణయమునఁ జేసియు, నాదుర్యోధనునిబుద్ధిహానివలనను
గాదె యిటు లగుట మర్మవి, భేదన మగుశోక మింత పెల్లయి యున్నే. 16

వ. దుఃఖంబు నిస్తరింప నోపుదునొకో యని తలంచుచున్నాఁడ నంశయంబు వాయ నింతకుమున్ను కయ్యంబునం గడచనినమనవారిని వారివారిని నేర్పడం జెప్పుమనిన నతనికి సంజయుం డిట్లను మనయందు భీష్మద్రోణకర్ణవికర్ణవృషసేనదుశ్శాసనలక్ష్మణాదులును వారలలోన విరాటశంఖోత్తరద్రుపదఘటోత్కచాభిమన్యుపాండ్యప్రముఖులును [3]వేరువేర నిట్టిట్టివారిచేత నిట్టిట్టివారు దెగి రని యేర్పడ నెఱింగించిన నమ్మహీపతి కురుసేన నింక నెవ్వరు గల రని యడుగుటయు నతం డశ్వత్థామ కృతవర్మ శల్యశకుని కృపాచార్యులం జేకొని బ్రదికినకురుకుమారులను

---

1. గ. ఓయ్యాధి. 2. ఙ. యంతకేమియు. 3. గ. వేఱువేఱ నిట్టిట్టి.

గర్ణుకొడుకులలో నున్నవారలను మఱియుం గలయోధులను జెప్పి వీరలం గొని
యనికి నుత్సహించి పొనుఁగువడ్డయగ్గిపేఁడిమివోనివాఁడిమితో దుర్యోధనుండు
ధైర్యం బవలంబించి జయార్థి యై యున్నవాఁ డనిన విని కొడుకుకడిమికి వెదవెద
యూఁటుడిల్లినయుల్లంబునం దనవారు పెక్కండ్రు వొలిసినయలమటం మునింగి
యొక్కింతప్రొద్దారకుండి రాధేయుదెగుట దలపోసి యమ్మనుజనాథుండు. 17

తే. అలలోనియూఁబోతునుఁ ‡ బోలె నొప్పఁ, గురుబలంబులో నున్మదస్ఫూర్తిమూర్తి
సింహాసంహననుండు నిస్సీమవిక్రమాభిరాముండు వోయెనే ‡ యక్కటకట.

వ. అని తొడంగి హాహాకారంబు లెనంగ రోదనంబు సేయుచు. 19

క. సంజయ సురభంజనుని ధనంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం
ద్రుం డెనకి యైన గెలుతు న,నుం జచ్చెనె యుట్టివాఁడు ననుం గయ్యమునన్. 20

—— ధృతరాష్ట్రుఁడు కర్ణమరణంబు విని పలవించుట. ——

సీ. పాండుసూనులతోడ ‡ పగ గోర్చె నెవ్వని, యుత్సాహ మూఁది సుయోధనుండు
వై దేహపాండ్రాది ‡ వసుధేశు లెవ్వని, కడిమిసొంపున సరిగాఁపు లైరి
మనముఁక లెవ్వని ‡ పెనుఁబ్రాపు గాంచి గర్వితము లై సంగరక్రీడ సలుపు
నద్భుతం బొనరించు ‡ నమరుల కెవ్వని, యసమానవివిధదివ్యాస్త్రమహిమ

ఆ. అట్టికర్ణుఁ డీల్గె ‡ [1]నట్టె యుం కెక్కడి, బ్రదుకు మనకు నేటి ‡ ఖండనంబు
దీసి వినియు నాదుమానసం బేమియుఁ, గాదు వజ్రమయము ‡ గాఁగ నోపు.

వ. అని [2]విలాపించి మఱియును. 22

క. పౌరి బంధుపుత్రమిత్రుల, పరిభవములు వించు నిట్లు ‡ ప్రాణముతో ని
వ్వారు నుండుదురే యే నొ,క్కరుఁడును దక్కంగ నింత ‡ కష్టంబగునే. 23

వ. అని పలికి మరణోద్యుక్తుం డై జలాగ్నివిషప్రాయోపవేశాదు లుగ్గడించిన విని
సంజయుం డతని కిట్లనియె. 24

చ. కులమును శ్రీయుఁ దేదము నశకుంతితకీర్తియు జూడఁ దొంటిరా
జుల కెన వత్తు నీ విటులు ‡ శోకసమాకులచిత్తవృత్తిమైఁ
గలుఁగుట యొప్పనే శ్రుతము ‡ గౌరవముం బాగ డొందునట్లుగా
నిలువుము ధీరతాతిశయ ‡ నిష్ఠఁ జలింపక యుండ భూవరా. 25

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 26

తే. శోకవారిధిసారంబు ‡ నాకుఁ బొంద, నేల వచ్చుఁ జిత్తంబునఁ ‡ గీలుకొని య
సహ్యమై కర్ణమరణోపజనిత మైన,పరిభవం బనుశల్య మూఁతురతఁ జేయు. 27

క. పౌరుష మేటికి దైవం, బేరూపునఁ జూడ ఫలద ‡ మీ మందము దో
స్సారసితాంతోజ్జ్వలుఁ డగు, నారాధేయుండు సచ్చె ‡ [3]నద్దనుచేతన్. 28

---

1. గ. నంటి విం కెక్కడిఖండనంబు దీనఁ ♦ బరఁగ వినియు. 2. క. పలవించి. 3. జ. నట్టె యర్జునుచేన్.

క. అలఘుతరాయువు నాకుం, గల దది యె ట్లనినఁ గోరఁ గర్ణునిపాటం
దెలియ వినఁగ నాఁడెందము, వలువఁటియలు గాక యున్నభంగి నెటిఁగితిన్. 29

క. మును లోకముచే నత్కృతి, గని నెగడెడువాఁడ నాకుఁ గలవా రెల్లం
జన శోచ్యుఁడ నై దుర్దశ, నునికి మునికి యగునె దీని కోర్వఁగ వశమే. 30

సీ. దుఃఖపరంపరఁ [1]ద్రొక్కనఁ బెట్టె నా, చిత్తంబు ననిమిషసింధుతనయుఁ
బడుటయు ద్రోణుండు పరలోకమున కేఁగుటయు సూతజుని తెగుటయును వినియు
నందుఁ గర్ణుఁడు లేమి యత్యంతదుఃఖంబు, సేసె దుర్యోధను స్నాన మాని
నతఁ డేడుగడయును నై యుండు నతనికి, నెవ్వరు గలరు దిక్కింకఁ జెపుమ
ఆ. మనబలంబుచేవయును వైరిసైన్యంబు, భయముఁ జెడఁగ రాధపట్టి గొంతి
పట్టిచేత నడుసి పడి యున్నవాఁడె వా,సవునికడిమిఁ బడినజంభునట్లు. 31

క. విను [2]పిచ్చుకకుం బతిరయ,మునఁ గోకకుఁ బడుట పేదయుడుకఁ వేశ్యా
జనముం గోరుట దుర్యోధనుఁ డింక జయంబు గొనఁగఁ దలఁచుట యరయన్.

క. మనలోఁ గయ్యం బేటికి, నని ధర్మసుతుండు సెప్పె నది యీపతి గై
కొనఁ డయ్యె రోగి పథ్యా,శనమునకుం జొరనిభంగి సంజయ యెట్లున్. 33

సీ. శరతల్పమున నుండి శాంతనవుండు బీ,భత్సుదివ్యాస్త్రవైభవము దెలుపఁ
దివిరి జలం బట్లు దెప్పించుకొని యప్పు, పాండుసూనులతోడి బాంధవంబు
నడపుము సిరి పంచికొనుచు మేలింతి,తోఁ గయ్య ముడిగి శాంతుఁడవు గమ్ము
బ్రదుకుము నీ వన్నపనుపు సేయఁడు సుయోధనుఁ డిప్పుడో కాబ్ధియునుఁ గకున్నె
ఆ. పడుచు లీక లూఁడ్చి పట్టి యాడెడునట్టి, పులుగుచంద మయ్యెఁ దలఁప నాయ
వస్థ యెందుఁ జొచ్చువాఁడ నీయలమట, దీర్ప నెవ్వ రింక దిక్కు గలరు.

వ. అని పెక్కుభంగుల నివ్వటిలు నెవ్వగలు బయలుపడం బలుమాట లాడి రాధేయు
తెగిన తెఱంగు తెలియ వినం దలంచి యి ట్లనియె. 35

మ. విజయుం దాఁకి పెనంగుచో నతనిదోర్వీర్యంబు సైరించెనో
భుజదర్పోద్ధతిఁ జూప నోపెనో చలంబుం జేవయుఁ సైన్యయు
గ్రజనంబుల్ వినుతింపఁ బేర్చెనో తొలంగం బాఱెనో పోరు న
క్కజపుంబెంపును వేటిఁడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్. 36

క. తత్కటిసైనికు లని న,య్యుత్కటుని దిగవిడిచి పాఱిరో లావుం బే
రుక్కును మెఱయఁగఁ దోడ్పడి, పెక్కండ్రు పడిరొ బెరసు బీనుంగులు గాన్.

వ. అని మఱియును. 38

క. ముందర శిఖండి నిడి సం,క్రందననందనుఁడు సేరి గంగాతనయుం
బ్రందించెఁ గపటమున నా,చందమ యొకటి కర్ణునందుఁ జర్పించిరొకో. 39

క. సామజము పడిన నశ్వ,త్థామ పడియె ననఁడె ధర్మతనయుఁడు గురునిం

---

1. క. త్రొక్కనఁ బెట్టు. గ. త్రొక్కుడువెట్టు. 2. గ. పిచ్చుగుంటి యతిరయ. 3. గ. లాతుని, సోకుని.

దా మడియించుటకై య, ట్టేమేని నొనర్చిరో కౌరవులు తేఁడు వడుటకున్. 40

క. మాయోపాయంబుల గాం, గేయుం గురుఁడు ననిఁ దెగిరి కాక రణ
న్యాయంబు దప్ప కుండఁగ, నాయిరువుర నోర్వ నెవరి కైనను వశమే. 41

సీ. పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్రహ్మాస్త్రంబు సర్వశస్త్రాస్త్ర మలఁతిఁ
బోవునె దివ్యాస్త్రములు పెక్కు మఱియును, గలవు రాధేయున కలవు మెఱసి
యభిమన్యువిల్ దునుమాడఁడె నాగాయుతప్రాణు ననిలనందనుని బాహు
దలఁ బట్టి సహదేవుఁ జులుకన మర్దించి, మందల విడువఁడే మాయలాని
తే. మేటిమగని ఘటోత్కచు గీటడఁచఁడె, యట్టిజెట్టికి బోరఁ జా వెట్టిభంగి
నయ్యెఁ దేరికిసూతునకుంచితాస్త్రములకు దైవోపహతిఁ జేటుమూఁడెనొకొ.

క. రథ మవితథమైనను సారథిపని నెఱసిన మహాస్త్రరాజి విధికృతిఁ
వృథ గాకున్నను గర్ణునిఁ, బ్రథనంబున గెల్వ దేవపతికి వశమే. 43

ఉ. సారథి యెవ్వఁ డాతనికి శల్యుఁడు ద్రోణతనూభవుండు గాం
ధారవిభుండునుం గృపుఁడు దత్సమయంబున నేమిభంగిఁ దో
డైరి సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మ దర్పము
న్బీరము వచ్చి యుండఁ దగ నెయ్యము చూపెనె యాతఁ డత్తఱిన్. 44

క. వారలఁ గెలఁకుల నడువఁగ, రారాజు పిఱిందఁ గదిసి రా నెబ్భంగిం
గారణము లేదు చావఁగ, నారాధేయునకుఁ జోద్య మయ్యెడుఁ దలఁపన్. 45

ఉ. పాండవకోటి సూతసుతుపై నడతెంచినచంద మెట్టు లా
ఖండలసూతి సర్వముఖకాండము తాఁకున రూపుమాసి పో
కుండుట యెట్లు గల్గె సమరోద్ధతి దక్కటినల్వు రందు నె
ట్లుండె బలద్వయంబు నెటు లోపి పెనంగె దినద్వయంబునన్. 46

వ. అనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లని యిట్టి గయ్యంబు తెఱంగు మొదలు
కొని చెప్పెదనాకర్ణింపుము ద్రోణుండు దెగినవశ్వత్థామ దన యోపినంతసమరంబు
సేసి చాలించి సేనలఁ దివియించి మరలి వచ్చిన దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చి
యుండి యశ్వత్థామ లోనగువారలం గలయం గనుంగొని మనకు నిటమీఁదఁ
జేయుం గలపని యెయ్యది యని యడుగుటయు నగ్గురుసుతుండు. 47

క. విను మాదర ముత్సాహం, బనూనధార్ష్ట్యంబు నీతి యనుసద్గుణముల్
పని సఫలం బగునట్లుగ, జననాథ యొనర్చు దైవసాహాయ్యమునన్. 48

చ. తలఁపఁగ సద్గుణంబులకుఁ దావల మై పెను పొందు నుజ్జ్వలా
త్ములు సని రైన [1]శేఖరము దోఁపఁగ నీ దగు తోంటిశౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ దైవముతోడుపాటునుం

1. క. శేఖరముఁ దోఁపఁగ నీకు దొడంగి కార్యముం.

గలిగెడుఁ గాక యున్న రథికప్రవరుల్ దలపోయ నల్పులే. 49

క. మనము బలశౌర్యఘనుఁ గర్ణుని సేనాముఖము సేసి నూల్కొని యరిమ
ర్దన మొనరింత మితనియుం, డని నానతం బొల్పు సద్గుణావలియు నృపా. 50

క. వైవస్వతుచందంబున, నీపినుఁడు రిపుబలంబు నెల్ల నదల్పం
గా వలఁతి దివ్యశరశ,స్త్రాళిభవ్యనిపుణత్వలీల నరేంద్రా. 51

వ. అని సూతపుత్త్రుం జూపిన ధనపుత్త్రుండు ప్రీతుండయి యతండు పాండవుల జయించు ననునాన యుగ్గలం బైన యాంతరంగంబుతో నయ్యంగపతి కిట్లనియె.

శా. నీవిక్రాంతియు నావయిం గల యతిస్నేహంబుఁ బ్రఖ్యాతముల్
గావే భీష్ముఁడు ద్రోణుఁడుం దగుట నీ కౌరవ్యసైన్యంబులం
గావంగాఁ దగు నీకు వారలయుపేక్షం గాక యున్నార్యులే
లా వైరం బడఁగింప నీ వమర నీకట్టే గెల్వఁ గౌంతేయులన్. 53

వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు విశేషించి నా కెడగడయు నీవ కావున నీకును మదీయహితం బవశ్యకర్తవ్యం బగుం గాక మన మాభీష్మద్రోణుల నవమానింతుము వారలు భండనంబునం బడిన నొదిగి యుండి నేఁడు మే కదంగుము వగఱకు నీకడం గడచి కటికి సూర్యునుదయుం బెట్టి దట్టినయ్యెడుం గాక బృందారకసేన సేనాని నడపిన కైవడిం గౌరవసైన్యంబు నడపి నన్ను గెలిపింపుము నిన్ను నిప సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టెద మ్మనినం బ్రీతుండయి రాధేయుండు గాంధారేయునకుం బ్రహర్షంబుగా భూవల్లభు లెల్ల నాకర్ణింప నిట్లనియె. 54

మ. వినుమీ కిచ్చిన బాస యేమఱితునే వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీభూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్త్రుల మనోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయం బైనసంగ్రామమున్. 55

—•• దుర్యోధనుండు కర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట. ••—

వ. నన్ను సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు మనవుడుఁ బొంగి రారాజు దగు రాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలంబులు దెప్పించి మహనీయ మణికుసుమామధిగంధాక్షతమంత్రకలనం బాచరించి సమున్నతౌదుంబరపీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి పుణ్యాహఘోషంబులుఁ దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి యలంకరించి పట్టంబు గట్టిన నతండు [1]భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దానత్యాగరూపంబున నొసంగుచు వెలింగె నప్పు డుబ్బిన శూరయోధుల జయజయశబ్దంబులును భూపతుల యభినందనవాక్యంబులును గృష్ణసమేతు లగుపాండవుల గెలువు మని దీవన లిచ్చు మాగధుల యెలుంగులును నింగి ముట్టె [2]నవోదితుం

1. గ. భూసురార్యులకు వందిమాగధజనంబులకు. 2. గ. నభోదీధితుఁ.

డై సభానుండునుంబోలె శోభిల్లు నాకర్ణుండు సముద్గుండై యక్కురుపతియాననం బాలోకించి. 56

తే. బంధుమిత్రయుతంబుగఁ బ్రాఁగురూఢ, మూని యేనిన్ను నీకు సామ్రాజ్యలక్ష్మి
ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ బుత్రపౌత్ర, గాఢభోగార్హ మగునట్లుగాఁగ నధిప.

క. విను [1]సత్యధర్మరతుఁ డగు, మనుజునకుం గార్యసిద్ధి మనలక యగుచా
డ్పున శౌర్యబాహువిక్రమ, ఘనుఁ డగునా కాజి జయము గలుగుం బలుకన్.

వ. అని పలికి నిష్ఠైలంగున రాధేయు సర్వసైన్యాధ్యక్షుం జేసి యతనిమందిరంబునకు మహావిభవసమేతంబుగాఁ బుచ్చి సమస్తపరిజనంబులను నిజనివాసంబులకుం బోవం బనిచి సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన నీకొడు కభ్యంతరావాసంబున కరిగె నారాత్రి యేసిటం వచ్చినట్టి వృత్తాంతం బంతయు నీకుం జెప్పి నీ వనుప మగిడి చని సూర్యోదయసమయంబున మనశిబిరంబు ప్రవేశించితి నయ్యవసరంబున. 59

సీ. తళతళ మనియెడు [2]దంతప్రభలతోడ, ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ
హంసవర్ణములైన హయములపటుగతి, నర్కప్రభంబగు నరద మొప్ప
దీప్తకాంచనరశ్మిలిప్తమై చెలువొందు, సజ్యకార్ముకము హస్తమున వెలుఁగ
పీఠికి సమరసన్నాహటోప మొదవ నా,భీలశంఖము దనకెమ్రోల మ్రోయ

తే. రణసముత్సాహలక్ష్మి వక్త్రమున నింత, చెన్ను వెలయింప నాభ్యులసేరి కెంపు
పక్కియలయందు బవరంపుఁబలుకు లెసఁగ, నడవ సాంపారికర్ణుండు వెడలె నధిప.

వ. అతండు పడవాళ్ళం బనిచి వెడల నియమించిన నెల్లదొరలును దురంబునకుఁ వెడలి రిట్లు సకలబలంబులు నడవం దొడంగిన. 61

సీ. తురగరింఖాముఖో[3]ద్ధూతధూళీపటలములు పల్దిక్కు లలంకరించె
మాతంగకటగళన్మదజలబాహుళ్యప్రవాహవిలాసంబు వాని నడఁచె
బహువిధవాదిత్రభైరవారావంబు, పెల్లంబరము పిక్కటిల్లఁ జేసె
శింజినీటంకారసింహనాదంబుల, పెక్కువ యామ్రోఁతఁ [4]బిలుచుకొనియె

ఆ. రథికభూషణములరశ్ములఁ గేతన, చ్ఛత్రచామరోపసక్షమణుల
రుచుల సుభటహేతిరోచులఁ బవలింటిదివియచంద మయ్యె దినకరుండు. 62

వ. అట్టియెడ. 63

క. జనములు భీష్మద్రోణులు, సనినవగలు డిగ్గఁద్రావి సంతోషమునఁ నె
క్కొనియెడు [5]మనములతోఁ గర్ణునిఁ గనుఁగొని రతివికాసరుచిరనయనులై.

కర్ణుని మొదటినాటియుద్ధము.

వ. ఇవ్విధంబున బలంబులకుం బ్రమోదం బెసంగ నడచి రాధేయుండు దుస్సహం

1. గ. మాతిథ్యరతుం డగు. 2. జ. ధవళప్రభల. 3. క. దుతధూళిపటలంబు, కలయఁగ దిక్కులఁ గప్పెను త్తమాతంగ. 4. క. బీల్చెకొనియె. 5. ఖ. మనముతోఁ గన్నుని, గనుఁగొని రతిరుచిరమనవికాసయను లై.

బుగా మకరవ్యూహంబు సమకట్టునెడ నందుఁ దుండంబునఁ దాను నిలిచి నయ
నంబుల శకునియు నులూకుండును శిరంబున నశ్వత్థామయుఁ గంఠంబున దుర్యో
ధనానుజులును నుదరంబున దుర్యోధనుండును ముందట వామపాదంబున నారా
యణగోపాలయుతుండై కృతవర్మయు దక్షిణపాదంబున ద్రిగర్తదాక్షిణాత్య
సంవృతుండై కృపాచార్యుండును వెనుక డాకాల నానాదేశసేనలతో శల్యుం
డును వలకాల ననేకరథకరితురగసమేతుండై సుషేణజననాథుండును బుచ్ఛం
బున మహాసైన్యసమగ్రుండయి చిత్రుండును నతనితమ్ముం డగు చిత్రసేనుండును
నిలుచున ట్లొనర్చి తక్కినవారల [1]నెడ నెడం బన్నించె నట్టియున్న యుధిష్ఠిరుం
డుద్దామసామజాది చతురంగోల్లాసభాసితుం డయి నడతెంచె నట్లు నడతెంచి
యమ్మనుజవిభుండు మన మొనం జూచి సవ్యసాచి కిట్లనియె. 65

చ. కనుఁగొనఁ జుల్కనైనయది । కౌరవసైన్యము గంటె నూతనం
దనుఁ డొకరుండుగా నిలిపి । తాను ముఖంబున నిల్చె నయ్యు మె
ల్లను దనమీఁదఁ బెట్టికొని । లావును బీరముఁ జూపఁ బూని యే
పున నతిమర్త్య భవద్విశిఖ।పుంజములం దెగటార్పు మీతనిన్. 66

క. వనమునఁ బండ్రెండేఁడులు, మన [2]ముక్కటదుఃఖవార్ధి।మగ్నుల మై యి
ట్లునికికిఁ దగ నితని భవ,త్సునిశితబాణాబ్ధి ముంపు । దుర్దమలీలన్. 67

ఉ. [3]వీఁ డొకరుండె యింక బల।విక్రమసంపద గల్గి పోరిలో
వాఁడిమిసొంపు చూపఁ గల।వాఁడు సుయోధనుపాలఁ దేర్చు నీ
వేఁడిమి చూపి రూపడఁపు । వీనిఁ బురందరపుత్త్రి యంతతోఁ
బోఁడిమి మాలు నాతఁడు ప్ర।భూతజయోన్నతి నిల్చు నీకడన్. 68

వ. నీకుం బోలినమొగ్గరంబు గావింపు మనవుడు నర్జునుం డర్ధచంద్రవ్యూహ[4]విధా
నంబున మోహరించి తాను మధ్యప్రదేశస్థుండై వామదక్షిణశృంగంబుల భీమ
ధృష్టద్యుమ్నుల నిలిపి యుధిష్ఠిరనకులసహదేవులం బింగలిగా నొనర్చె నతని
చక్రరక్షకు లగుయుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపువేడుక
మొగంబులం జగు కొత్తఁ బొలిచిరి తక్కినయోధులుం దగినచోట్ల నిలిచి తి
ట్లిరువాఁగును బన్ని యున్నసమయంబున. 69

చ. హరియును బాండునందనులు । నాజి నవశ్యము నేఁడు చూడఁ బో
దురు జము నంచు నాత్మఁ బరి।తోషముఁ బొందె భవత్తనూజుఁడు
దురమునఁ గర్ణయుక్తముగఁ । ద్రుంగు సుయోధనుఁ డంచుఁ దలంపుతోఁ
బరమసముద్యమస్ఫురణఁ । బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా. 70

ఆ. ఒకటికొకటికంటె । నుబ్బుచు వర్తించు, చాడ్పు దోఁప రెండు।సైన్యములును

1. గ. నెడనెడలం బన్నించె_జ, గలయం_బన్నించె నంత నక్కడ ముధి. 2. గ. ముక్కట మాదట 3. గ. వీఁ డొకరుండు దక్క...సుయోధనుపాల లేమి. 4. గ. వాళిధానంబున.

గిరిం దాఁకు తెఱంగున నతనిమాతంగమునకు మార్కొనియె నయ్యిరువురు నొం
డొరులపైఁ దోమరస్తోమంబు లడరించి యార్చుచు నుద్దండపరాక్రమంబులగు
వేదండంబుల ప్రచారంబులు చారుభీషణంబులు గా నొకళ్ళొకళ్ళం జుట్టుకొని
వచ్చుచుం బెనంగి. 77

క. కోదండంబులు గొని బాహాదర్పము మెఱయఁగఁ బోరి యన్యోన్యధను
శ్ఛేదంబులఁ బోరిఁ బోరి నాపాదించిరి [1]రయము జనులు ప్రస్తుతి సేయన్. 78

వ. దానం గోపం బగ్గలించి. 79

తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ, బోరుచో భీమసేనుని పేరురమున
హేమభూషిత సముజ్జ్వలత్తోమరంబు, [2]లేదు న్నాటించె దర్పంబు రూఢి కెక్క.

చ. అనిలతనూభవుండు దవనాంశునిభం బగు తోమరంబు వై
చిన నసమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి వీఁక నా
తనిఁ బటువష్టికాండపరిఘాడితదేహునిఁ జేయ మేటివిల్
గొని యతఁ డక్కులూతపతికుంజరముం వెసఁ గప్పె నమ్ములన్. 81

వ. ఇట్లు భీమసేనుండు గరూశపతి విక్రమంబు నరకుసేయక యతనిదిక్కునుం జూడక
హేమధూత్రిసామజంబును సాయకమయంబుఁ జేసిన నది మొగతిరిగి వఱచినం బో
వనీక యప్పావని వెనుకొనుటయు నక్కులూతపతి ప్రయత్నంబుననమ్మాతంగంబు
మరల్చియు నియంగంబునను దగ్గజంబుశరీరంబునను సిశాతశరపరంపరలు వఱపిన.

చ. ఉఱక సమీరసూనుఁడు దరదుగ్రధనుర్దళనం బొనర్చి యే
త్రెఱఁ గరి నొంప నాతఁడు గదడింది మగంటిమి నొంకవింట ను
న్మెఱుఁగులు [3]గ్రమ్మకోల నెతనిం గడు నొంచి తదీయహస్తి పొ
ల్పఱి మహి మ్రొగ్గ నేసిన ధరాధిప సేబల మార్చె నుబ్బునన్. 83

మ. గద చేతం గొని దంతి డిగ్గి చని యాకాంతేయుఁ డవ్వీరు ను
న్మదమాతంగముఁ గూల నేసినఁ గృపాణస్ఫారదోర్దండుఁ డై
కదియుం వచ్చి యతండు నిష్ఠురగదాఘాతంబునం గూల్చె నే
పు దలిర్పన్ వెస నామరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా. 84

వ. ఇవ్విధంబున నేనుంగుపీనుంగు దన పడిన హేమధూత్రి వజ్రప్రహారంబునం గూలిన
కులశైలంబునమీఁపంబున నిర్ఘాతపాతపతితం బయిన కంఠీరవంబు కరణి నొప్పె
నతనిం గనుంగొని మాన మొన వెఱచఱచినం బాండవబలంబులు వెనుకొనుటయు.

మ. పటుబాణప్రకరంబు లంబరముఁ గప్పం గర్ణుఁ డానేసఁ దాఁ
కుటయున్ సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్న భుజాసంపదు
త్కటగర్వోద్ధురథంగిఁ బాండుసుతులున్ దర్పంబు సొం పేర్పరిం

1. క. రణము. 2. క. లెండు... లెట్టిగాఁగ; ఙ. లేదు... లేదు లెక్క; ట. లేదు... మాడి లెక్క. 3. క. గ్రమ్మకో నరనిశితము నదు.

చటులం బొచ్చినఁ బేర్చి పో రనిమిషస్తోమాద్భుతాపాది యై. 86

వ. అందు. 87

క. సూతతనయనారాచన్యూతము లై వారణంబు లొఱలును సొగయున్
భూతలమునఁ బొరలుఁ దెరలు, వే తూలును జిఱ్ఱఁ దిరుగు విచ్చుం బఱచున్.

వ. అప్పుడు నకులుం డతని మార్కొనియె భీమసేనుం డశ్వత్థామను సాత్యకి
కైకేయులగు విందానువిందులను చిత్రసేనుం డను రాజు శ్రుతకర్మను బ్రతివింధ్యుండు
చిత్రుం డను మనుజనాథుని ధర్మపుత్త్రుండు దుర్యోధనుని ధనంజయుండు సంశప్త
కులను ధృష్టద్యుమ్నుండు కృపాచార్యుని శిఖండి కృతవర్మను శ్రుతకీర్తి శల్యుని
సహదేవుండు దుశ్శాసనునిం దలంపడి తట్టియెడ. 89

సీ. శైనేయుతోడ విందానువిందులు మహాహవము సేయంగ నయ్యాదవోత్త
ముఁడు పేర్చి వారికార్ముకములు రెంటిని, మునిమి యుగంబుల నిని చెఁదూపు
లవ్వీరు లన్యశరాస[1]నోద్ధారు లై, యతనిపైఁ బఱపిరి శితశరంబు
లతఁడును వారు నన్యోన్యచాపచ్ఛిదా,వైచిత్రి నొప్పారి రేఁచి దొడ్డ

తే. విల్లుఁ గొని యతిరయమున భల్లనిహతి, నాతఁ డనువిందుతలఁ ద్రుంపనని ప్రదీప్త
రత్నకుండలశోభాభిరామ పతన,భంగిఁ దదనీకశోకసంపాది యయ్యె. 90

ఉ. కని విందుండు ప్రదీప్తచాపధరుఁడై కాండప్రసారంబులన్
శినివీరుం గుసుమాఢ్యకింశుకసముం జేయంగ నయ్యోధుఁ డా
తనియంగంబులఁ బాచవింశతిశితాస్త్రంబుల్ వడిన్ గ్రుచ్చి నే
వున వా రొండొరు నూఱులం మునిమి నిప్పుల్ రాలుకన్నొముఖోన్. 91

తే. ఒకళు లొకళులహయముల నుర్విఁ గూల్చి
యొండొరులకార్ముకమ్ములు ఖండితములు
చేసి తేరులు డిగ్గి రుద్యద్భాసితాసి
చర్మశోభితహస్తు లై సరభసముగ. 92

వ. ఇట్లు పాదచారు లై మండలప్రచారంబుల మెఱయుచు. 93

క. చేరి బహువిచిత్రగతులం, బోరంగా నొడ్డనములఁ బొలిసెం బలకల్
నేరిమి మై [3]గొళవున శిని,వీరుం డిరువఱియ గాఁగ విందుని వ్రేసెన్. 94

వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి సాత్యకి యుధామన్యుతే రెక్కి యుక్కున వేఱొ
క్క రథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ జిత్రసేనుం
డును నీమనుమం డగుశ్రుతకర్మయుం బెనంగునెడ [4]నాశ్రుతకర్ముఁడు. 95

క. ఆ రాజు నైదువాలికనారసముల నొంప నతఁడు నవశరముల న
క్కౌరవుని నేసి నొంచెను, సారథి నైదింట నధికసంరంభమునన్. 96

1 గ. నోద్వారు లై; జ. నధారు లై. 2. గ. భంగిఁ, బడె మె. దదనీకశోకసంపాది యగుచు.
3. గ. గొసంవున జ. గొళవున. 4. క. నాశ్రుతవర్ముఁడు.

సీ. శ్రుతకర్మ గోపించి । క్రూరనారాచ మ, జ్జననాథుపుత్త్రుదేహమున నాటఁ
బడి మూర్ఛవోయినఁ । బ్రైపము గొంపోయె, నొయ్యఁ దెప్పిరి యతం డడరి మొనఁగ
నుక్కునఁ దునుమాడె । నక్కుమారునిశరా,సన మతఁ డొండొక । చాప మెత్తి
తఱిమి యటమ్ముల సేను । పెటిలఁ బవందఁబు, సేసె రయంబునఁ । జిత్రసేను
తే. నాతఁ డాతనియురమున । శాతశరము
దూఱ నేయ నబ్బాలుండు । దోఁచె వివిధ
బాణజాల మున్నరపతి । శోణితమున
భల్ల మొక్కటఁ దల నేల । డొల్ల నేసె. 97

—•• ప్రతివింధ్యుఁడు చిత్రుఁ డను రాజుం జంపుట. ••—

ఉ. ఏలినవానిపాటుఁ గని । యేడ్తెఱ నచ్చి ముక్కపిట్ట యా
భీలతఁ జుట్టు ముట్టుటయుఁ । బెట్టుగ యుగ్రతఁ దీవ్రసాయక
జ్వాలల నేర్చి యుద్భటభుజావిభవం బెసఁగంగ నల్లనం
దోలె నుదాత్తవిక్రమకుతూహలి సీమకుమారుఁడు భూవరా. 98
సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ । డేడుబాణములఁ జి,త్రుఁ బ్రతిమేను నొంచి తత్తురగవతి
మునఁ గ్రూరశరములు । మూఁడు నాఁటించి యొ,క్కమ్ముగఁ గేతు వ్రక్కల్లార్చి పేర్చి
యతఁడు దన్నుఁ గ్రనవాస్త్ర[1]ంబులఁ జేఁత, చేయు,విలుద్రుంచి వెసఁ బంచవిశిఖనిహతిఁ
గ్రాలించి శక్తి యుగ్రమ్ముగ వైచినఁ, బెలుచ నాలుగుదునియలు గాఁ జేసె
తే. నలిగి యాతండు గద వైచి । యుక్కుమీఱ
ఘోటకంబుల నూతునిఁ । గూల్చె నవుడు
పట్టికొని వైచె మగుడ న । ప్పాండుపౌత్త్రు
చేయి వడి నుచ్చి పోవ న । చ్చిత్రుఁ డడఁగె. 99
ఉ. బాహువు నొచ్చినం గనిసి । భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప నతఁ । డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చి పోవుటయు । ద్రెళ్లె నరేశ్వర యవ్విభుండు వ
జ్రాహతిఁ గూలుపర్వతమునాకృతి నుత్కటవైకృతంబుగన్. 100
వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని మనయోధులు ప్రతివింధ్యుపై నడరి యనేకాస్త్రశస్త్రంబులం బొదివినం బొలివోనికలితనంబున నేల కుఱికి యక్కుమారుండు కోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు పరఁగింపఁ బాండవసైనికులు వెట్టిదంపుటుగవశిం గదిసి యతనికిం దోడ్పడుటయు మనవారలు వెన్నిచ్చి పఱచి రప్పు డశ్వత్థామభీమసేనులసంగ్రామంబు భీమంబయి చెల్లె నందు. 101
క. గురుపుత్త్రుఁడు కొంబెనిశిత,శరములఁ బావనిరథంబు । సంవృతముగఁ జే

1. క: తాడితుఁ జేయు.

ద్రమ్ముగఁ గలంచె నివిజగ,ణమ్ము వినుతి సేయఁగ మొగనెఱుఁగ లినార్యన్. 122

చ. నకులుఁడు సూతపుత్త్రుఁ గని బెట్టనంగ నెదిర్చె నకులుండు సూతపు
త్త్రకునకు నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్నదృ
ష్టికి నను బాత్రభూతుఁగఁ జేయుట గానఁగ వచ్చె నాకు మా
ర్గకి నిను గోచరంబుగ ఘటించిన యీ చతురత్వసంపదన్. 123

క. కౌరవపాండవులకు నీ, వైరము నీవలనఁ గాదె వచ్చెను నిను మ
ద్ఘోరశరనిహతిఁ బడఁగ, న్నారఁగఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్. 124

చ. అనవుడు రాజసూతివి మహాస్త్రవికుంఠవు నైననీకు ని
ట్లనుట దలంప నర్హ మగు నైనను జెన్నఁటివల్కు లేల న
ల్లన భుజశక్తి మాకు నరసంకయుఁ గాంచినఁ బాటకొప్పఁగా
క నిలిచి చూపు నీచలముఁ గ్రియఁ జేతులబల్మియుం దగన్. 125

వ. అని పలికి కర్ణుండు. 126

సీ. ఉబ్బి మాద్రీసుతుఁ డెబ్బదిమూఁడునారసంబులఁ గప్పుటయు నతఁ డలిగి యతని
[1]పై నిశితనిశాతబాణంబు లేసిన, నాసూతనందనుఁ డకుంఠమూఱు
ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది, కాండములఁ జొనిపిన నొండువిల్లు
గొని డెబ్బదింట నాతని నొంచి మూఁడు మార్గణములు సూతునంగకమున్న బఱపి

తే. భల్లమునఁ విల్లు ఖండించి మొల్లపిఱులు, నశ్వతంబారఁ జేతపాయక పరీక్షఁ
జేసి నకులుఁడు నిష్ఠురహాసభాసి, తాననాంభోజుఁ డై పొలుపారె నధిప. 127

క. సూతసుతుఁడు బలువిలు గొని, [2]యాతనిపతి యున నారైదమ్ములు ని
ర్ఘాతసమప్రఖరముల, నాతఁ డతని నొంచి విల్లు నఱిమిఁ ద్రుంచెన్. 128

వ. మఱియు నొక్కమహనీయకార్ముకంబు గొని కర్ణుండు గడంగి నప్పాండవయ్యుఱుపురు
నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొక్కొక్కళ్ళ నెత్తుట ముంచు
చుం బేర్చి వివిధవిశిఖజాలంబు లడరించిన నంబరంబు శలభపటలసంవృతంబునుం
బోలె నుండె నాసమయంబున నకులునకుఁ గర్ణభాగంబునకు వచ్చిన సోమకబలంబులు
గర్ణక్రూరనారాచాదిబహుళబాణపాతంబులఁ బలాయితంబు లయ్యెఁ గర్ణునకు బాస
టయై తఱిమినకౌరవసైనికులును మాద్రేయశరాస్త్రవిజృంభణంబున దూరవిఘటితు
లై రట్టిరువాఁగును నెడ గలిగి చూచు మంచి నారథికోత్తము లుదారఘోరా
కారంబుల నుల్లసిల్లి భల్లప్రముఖప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి
యంబుదపిహితమూర్తు లగుమార్తాండశశాంకులచందంబు నొంది యన్యోన్య
దివ్యాస్త్రతేజోవిలాసంబుల నయ్యుయస్త్రంబుల వారించుచుం బోరి రట్టియెడ 129

క. అలుక వొడమి కర్ణుండు నకులుచాపము ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం

1. క. పె నతిరిచిత. పె నవతినిశాత. 2. అ. యాతనియశోమయ.

బాలఁ జంపి చక్రరక్షుల, తలలు నఱికి సిడము ద్రుంచి దరహాసముతోన్. 180

వ. మెఱసినం గుపితచిత్తుం డై: 181

చ. పలకయు వాలునుం గొనియెఁ బాండుకుమారుఁడు పెక్కుచెక్కులై
యిలఁ దొరఁగంగఁ జేసె గద యెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు
జ్జ్వలపరిఘాభిరాముఁ డయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి లసితలాఘవస్ఫురణపెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. 182

ఆ. మర్మభేదులైన మార్గణంబుల, గోహటించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి
యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున, గొర్చె యక్కుమారుఁ డోడి పాఱె. 183

—.. కర్ణుఁడు నకులుని విరథుం జేసి యవమానించుట. ..—

క. వెనుకొని రాధేయుఁడు నిజధను వాతనికంధరమునఁ దగిలిచి నలిఁ బ
ట్టిన నింద్రచాప[1] పరిగత, ఘనాకృతిని బొలిచె నతఁడు కౌరవనాథా. 184

వ. ఇట్లు పాండుతనయు బాఢుదలఁ బట్టి మందస్మితసుందరాననుం డై 185

క. పలుకులు వృథగా నన్నం, బలికితి మున్నింక నెన్ని పలుక పలసినం
బలుకుము నీ కేఁదగ నా,యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్. 186

క. అల వెఱఁగి పెనఁగు పెనఁగం, దలఁచిన నది గాక సిగ్గు దలకొని యునికిం
దొలఁగుట యెంకట దగు ని,చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా. 187

క. అని విడిచె నకులుఁ గుంతివ,చనములు దృఢవృత్తిఁ జిత్తసంకలితములై
యునికిం గర్ణుం డతఁడును, జని ధర్మజునరద మెక్కె సవ్రీడముగన్. 188

వ. ఎక్కి నిట్టూర్పు నిగుడం గుంభనిశ్వస్తభుజంగంబుచందంబున నుండెనివ్విధంబున మాద్రీపుత్త్రమానమథనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతం బైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుంబోలెఁ బ్రదీప్తమూర్తి యై వెలిమావులును వెలివడగయు నల్లసిల్ల శోభిల్లుతనరథంబు రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దరిసి పెక్కుతెఱంగుల మెఱుఁగుటమ్ములగములఁ గదియించి.

సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల వీట,[2] తాటంబు సేసి రథ్యములఁ గూల్చి
చామరచ్ఛత్త్రవిభ్రమణములు పొడిసేసి [3] రథికజనములశిరములు ద్రుంచి
కొమ్ములు నఱికి యంకుశములు దునిమి తొం,డములు ఖండించి కుంభములు వ్రచ్చి
జోదులతనువులు ఛేదించి మోరలు, [4] గళ్యాలతోడఁ జెక్కులుగఁ జేసి

ఆ. కందములు వగిల్చి కాళ్లులు ద్రెంచి యా,శ్వికులఁ జంపి చర్మవిశిఖకుంత
ముసలముద్గరప్రముఖసాధనములు భ,గ్నములు సేసి భటుల నమియఁ జూచి.

వ. బాహువిలాసంబు మెఱయ నెఱయం బొలిచె భవత్సుతుం డగుయుయుత్సుండు

---

1. గ. పరివృత. 2. జ. తాటనంబులుగ రథ్య. 3. గ. రథికశిరంబులఁ బృథివిఁ గూల్చి.
4. చ. గళ్యలుగూడఁ జెక్కులుగఁ జ. గళ్లలు చెక్కులుగాఁగఁ. గళ్యాలు చెక్కులుగాఁగ.

పర్వతప్రతిముం డగునులూకు నయ్యుం గవిసి కులిశనిభం బగువిశిఖంబున నొంచిన
కోపించి యా బల్లిదుండు విల్లు విఱుగ నేయుటయు నక్కుమారుండు. 141

తే. మేలువిలుఁ గొని యఱువదినాలుగమ్ము
లతనిమెయి గ్రుచ్చి సాయకత్రితయనిహతి
సూతు నొప్పించి మఱియు నిశాతశరచ
యమ్ము పరఁగించె నధికరయమ్ము మెఱయ. 142

వ. దానం గనలి. 143

క. బలువిడి నులూకుఁ డిరువది, శిలీముఖము లొడలఁ జొనిపి సిడము రయమునమై
నిలఁ గూల్చిన నీసుతుఁడు, జ్వలవిశిఖము లయిదు నాటె వానియురమునన్. 144

వ. నొచ్చి యా సౌబలనందనుండు రౌద్రంబు రూపంబు దాల్చినవిధంబున విజృం
భించి. 145

శా. భల్లం బొక్కటఁ ద్రుంచె సూతుని జతుర్బాణాహతిన్ వాజులన్
డొల్లం జేసె నిశాతపంచవిశిఖాటోపంబునం జించె నీ
రోల్లాసంబు వికాసముం బొరయ మే[1]ను క్కేది నీనందనుం
డెల్లం జూడఁగఁ బాఱె యొండొకరథం బెక్కెం గురుగ్రామణీ. 146

క. గెలుపున మెయి వొదలఁగ సౌబలసూనుఁడు రథము వఱపి పాంచాలబలం
బులు గలఁగఁ బలుదెఱంగుల, యలుఁగుల విహరించె నుద్భటాటోపమునన్. 147

సీ. శ్రుతకర్మ నకులునిసుతుని శతానీకుఁ, దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి
సూతునిఁ బరిమార్చె నాతఁడు గద వైచి, రథవాహనముల సారథిని గేత
నముఁ బొలియించె భూరమణ యిమ్మెయి నీదు, తనయుండు నకులనందనుఁడు విరథు
లై యొండుదేరుల కరిగిరి [2]సుతసోముఁ, దలఁపడి కడిమి గాంధారనాథుఁ

తే. డతనియుదరించువివిధసాయకము లెల్లఁ
దునిమి బాణత్రయంబునఁ [3]దనువు నొంచి
తురగముల నరదమ్ముఁ గేతువుఁ దిలప్ర
మాణశకలంబులుగఁ జేసె మద మెలర్ప. 148

మ. విరథుం డై పోలివోనిబీరమునఁ బృథ్వీభాగసంచారి యై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీమఱిం
దిరథం బేడ్తెఱఁ గప్పినం దునిమె నుత్సేకోగ్రుఁ డై యమ్మహీ
వరుఁ డబ్బాలునిచాపదండము భుజావష్టంభ మేపారఁగన్. 149

చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యానృపాలుఁ దు
ద్ధతిఁ బరఁగించుసాయకశతంబులు ద్రుంచుచు నుల్లసిల్ల న
వ్వతి పటుభల్లఖండితకృపాణునిఁ జేసిన వీఁకఁ బోక చే

1. క. నుక్కారి. 2. ఆ. శ్రుతసోము. 3. ఆ. ధనువు.

తుతునియ వెట్టు వైచె జగతీవర యాతనివిల్లు రెండుగన్. 150

వ. ఇట్లు కోదండంబు దుండంబులు సేసి త్రోలంగి యక్కుమారుండు శ్రుతకీర్తిస్యం
దనం బెక్కె సౌబలుండు వేఱొక్కవిల్లెత్తి యత్తెఱపి నురవణించి పాండవరథి
కులం గలంచెం గృపాచార్యధృష్టద్యుమ్నులు పెనంగునెడ గౌతముండు పాంచాల
వరుం బొదువునాటోపం బాలోకించి యక్కౌంతేయసైనికులు దమలోన. 151

ధృష్టద్యుమ్నుఁడు గృపాచార్యునితోఁ దలపడి యోడి పోవుట.

ఉ. ద్రోణుపరాభవం బధికరోషము సేయఁగ నున్నయీతఁ డ
క్షీణపరాక్రమంబు విలసిల్లఁగ నీ ద్రుపదాత్మజుం గత
ప్రాణునిఁ జేయ కేలుకుఁగుఁ గ్రైకొను నంతటఁ బోక విస్ఫుర
ద్బాణవిలాసముల్ నెఱపుఁ గదా మనసైన్యము దల్లడిల్లఁగన్. 152

వ. అని వెండియు. 153

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుబలగర్వక్షేమనిర్వాహకుం
డరులం జీరికిఁ జేకొనం డితఁడు[1]క్రోధాత్తాత్ముఁడై నేఁడు ని
ర్భర శౌర్యంబు నుదాత్తధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు
స్తరదర్పోద్ధతిఁ దేక యున్న మనలం గదా నేలకుం గోలకున్. 154

వ. ధృష్టద్యుమ్నుండును బెండువడి యున్నవాఁ డనుచు నుంగి రట్టియొక [2]బెట్టిదంబు
గుకృపాచార్యుతూపులయేవు రథ్యంబుల నొంచు సారథిక్రొవ్వడంచి యా
ద్రుపదనందనుతనువు నెత్తుటం దోఁగ యుల్లంబు గలంచె నవ్విధాతనినూతుం దత
నితో ని ట్లనియె. 155

చ. వినుము కుమార విప్రభుకృపీర్యు మహార్యతఁ దేజరిల్లెడుం
జనవు భవత్సమగ్రశరజాలము లీతనిమీఁద దైవసం
జనితము సువ్వె యెవ్వఁడరు గ సంగర మిట్టిద తొల్లి యెందు నా
కనినది లేదు తేరు దొలఁగంగఁ గొని పోవుట కార్యమిత్తఱిన్. 156

వ. నీయట్టివాని పరాక్రమంబు నుండి తెట్టిన యట్లు నను మూటం జేసి యిమ్మహాత్ముఁ డవధ్యుం డని
నిశ్చయించితి నామాట కియ్యకొను మనవుడు నాప్పృషతపౌత్రుం డిదియట్టిద యని
నిశ్చయించి పలికి మఱియు హీనస్వరంబున ని ట్లనియె. 157

చ. చరణములుం గరంబులును గ సంచలభావము నొందఁ జొచ్చె మే
నిరవిరఁ బోవుచున్నయది గ పిహ్వాల మయ్యె మనంబు నీతలం
పరయఁగ మేలు మారుతసురాధిపసూనులలోన నల్ల నొ
క్కరుదెసకై రథంబు దొలఁగంగం గొని పొమ్ము డబీర మేటికిన్. 158

చ. అనవుడు సూతుఁ డంతయు రయంబునఁ దేరు వృకోదరాంతికం
బున కగవంగ శంఖరవముల్ గుణనిస్వనముల్ నిగిడ్చి యే

1. గ. క్రోధావిష్టుఁడై, 2. గ. బెట్టిదంబు గాఁ గృపాచార్యుం డేవు నూపి రథ్యం.

పునఁ గృపుఁ డుజ్జ్వలప్రదరపుంజములం బగఁగొనఁ జేయుచున్
వెనుకొని పొల్చె నిల్చె గిరి వెన్కను నిల్చిన వహ్నిశైవడిన్. 159

తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు, చుండె శరపంచకంబున నురమునొంప
నతని నయ్యాదవోత్తముఁ డలఘుమష్టి, విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె.

క. ఒండుశరాసన మెత్తి శిఖండి గురియునవతిసాయకమ్ములు వెలుచన్
ఖండించె నతఁడు తత్కో,దండం బా ద్రుపదనృపతితనయుఁడు నఱకెన్. 161

క. ధనువు దునిమి కొమ్ములు మురిసిన వృషభము చాద మగుడు శిఖిస్ఫురణం
దనువున శితశరములు వడిఁ, జొనిపి యతం డతని గళితశోణితుఁ జేసెన్. 162

చ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొండువింట దో
ర్బల మెసఁగంగ డెబ్బదిశరంబుల[1] నాఁటిమి మేన రక్తధా
రలు దొరఁగించి పెక్కుప్రదరంబులు పైపయి నేయుచుండ న
గ్గలికఁ జెనంగె వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁడై. 163

వ. ఆ ద్రుపదనందనుండు జత్రుదేశంబున నాబకత్రయంబు నాటించిన. 164

శా. క్రూరోల్లాసము పల్లవింప గృతవర్ముం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనన్ గ్రువ్వ మూర్ఛిల్లెన
వ్వీరాగ్రేసరుఁ డప్డు సారథి భయావిర్భావదీనాత్ముఁడై
తే రచ్చోటు దొలంగఁ దోలుటయు భీతిం బాఱెఁ దత్సేనయున్. 165

వ. వివ్వచ్చు విక్రమవిహారంబునఁ గోర్చి శిబి త్రిగర్త సాల్వ సంశప్తక సైన్యనారా
యణగోపాలోపేతుండై సత్యసేన చంద్రదేవ మిత్రదేవ మిత్రవర్మ సౌశ్రుతి
సువర్మ సుశర్మాదు లగుసోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు.

సీ. సత్యసేనుఁడు మూఁడుసాయకంబుల మిత్ర, దేవుండు షష్టింశదీప్తమార్గ
ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను, జంద్రదేవుఁడు శరసప్తకమున
మిత్రవర్ముఁడు కంకపత్రత్రిసప్తతి, [2]సౌశ్రుతి యేనుదిశాతవిశిఖ
ములను శత్రుంజయుఁ డలఘువింశతికాండ,ములను సుశర్ముఁ డుజ్జ్వలనవాస్త్ర

తే. ములను గప్పిర పార్థు నాబలియుఁ డంబు,దములధారలు వొదువ నుదాత్తరేఖ
గరము పొలుపారు మేదినీధరముభంగి, దలఁపఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప.

వ. ఇట్లు సుస్థిరుండై మిత్రదేవునంగంబున గంకపత్రశతంబును సత్యసేనుతనువున
మార్గణత్రయంబును సుశర్మమిత్రవర్మలశరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను
బఱపి శత్రుంజయు శిలాశితశరంబులం బడవైచి సౌశ్రుతిం బంచవింశతికాండం
బుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిదియమ్ములం దునిమి యుల్లసిల్లిన.

చ. కనకపుఁగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భునిభుజశాఖ యుచ్చి చన భూరిబలుం డగుసత్యసేనుఁ డు

---

1. గ. నాఁటిని మేన. 2. జ. సామస్సుఁ డేడు.

ష్కున నిగిడింపఁ జేతిమునికోలయుఁ బగ్గములుఁగా మహీతలం
బున నొగలందునుం బడిన ¸ భూవర పార్థుఁడు క్రోధదీప్తుఁ డై. 169

క. హరిదెసఁ గన్గొని యాతని, యరదముఁ గదియంగ నడపు ¸ మరద మనుడుఁ జె
చ్చెర నొండొకమునికోలం, గర ముద్ధతి నడపె ఘోట¸కంబుల నతఁడున్. 170

క. తే రతనియరదమునకుం, జేరువ యగుటయును గ్రీడి ¸ శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో,దారణ మొనరించి యొప్పె ¸ దరహాసముతోన్. 171

వ. ఇట్లు సత్యసేనునిఁ జిత్రవధంబు సేసి. 172

చ. ఘనతరవత్సదంతశరఘాతమునం బడ వైచి మిత్రవ
ర్మని రథసూతు [1]నట్టి దొకక్రూరవుఁదూపునఁ నుర్విఁ గూల్చె నా
తని సముదీర్ణమై వెలుచఁ ¸ దాఁకి త్రిగర్తబలంబు సుట్టుము
ట్టిన వివిధోగ్రసాయకపటిష్ఠత నొప్పి కలంచె నేపునన్. 173

వ. వెండియు సుశర్మనిజ్ఞాతులు పోక పెనంగిన. 174

ఆ. వెఱచి పింజఁ బోలు చక్కవడఁదయమ్మున మిత్ర, సేనధరణినాథు¸శిరముఁ ద్రుంచి
వాఁడినారసము [2]సుశర్మనికునికిట, నాటె నయ్యమర్త్య¸నాథసుతుఁడు. 175

వ. అట్టియెడ సంశప్తకగణంబు లన్నియు నార్పులు నింగి ముట్ట నలుదిక్కులం గిట్టి
చుట్టిదంబు లగు నస్త్రశస్త్రపరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁ డలుక నూనిన
యలంతినవ్వుచెలువంబు మొగంబునకు వింతచెన్నొసంగ విజృంభించి యైంద్రా
స్త్రంబు ప్రయోగించిన నది ప్రకీర్తభల్లాంజలికప్రముఖంబులం బరఁగుటయు.

సీ. తేరులచెక్కులు ¸ వారణంబులఖండ,ములు ధూమణంబుల¸పాయుడి ఘోట
కంబులతునియలుఁ ¸ గరవాలతోమర, శరపరిఘాదుల¸శకలములును
రథికజనంబుల¸వ్రయ్యలుఁ జామర,చ్ఛత్త్రికేతువులయం¸శములు భటుల
తుమురును [3]కాతుల¸తుండంబులును గంక,టములభాగములుఁ జం¸దములను ఱుముఁ

తే. గలసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి, మెదడు బ్రుంగి వియచ్చర¸హృదయములకు
నద్భుతంబు బీభత్సంబు ¸ నావహింప, సంగరాంగణ మతిఘోర¸భంగి యయ్యె

వ. అప్పుడు. 178

క. కరిహయశవముల విఱిగిన, యరదంబుల విషమ మైన¸యాజిక్షితి నె
త్తురుఱొంపిలోన రథ్య,స్ఫురణకతనఁ దవులఁబడక ¸ శోభిత గతి నై. 179

—దుర్యోధనుఁడు ధర్మజానితో యుద్ధంబు సేసి విరథుఁ డగుట.—

తే. నరుఁడు దీవ్రశరార్చులు ¸ పరఁగఁ జేయఁ
గలఁగి హతశేషసంశప్తక¸వ్రజంబు
పలుగడల విచ్చుటయుఁ బోగ ¸ వాసి మెఱయు

1. క. ఁడి ట్టదురఁ గ్రూరవు. 2. ఖ. సుశర్మునినటిటు. గ. సుశర్మునిపత్త్రిక. 3. ఙ. రావుతుతుండం

నగ్నియునుబోలె వెలుఁ గొందె నాతఁ డధిప. 180

ఉ. కౌరవరాజు ధర్మజుఁడు గయ్యము సేయునెడం గడంకమైఁ
గౌరవరాజు ధర్మజుని కాయమునన్ నవసాయకాళులన్
సారథిమేన నొక్కపటుసాయకమున్ నిగిడింప నాతఁడు
ఘోరతరాత్ముఁడై యతని నొంచెఁ ద్రయోదశసాయకాహతిన్. 181

వ. నొంచి తోడన. 182

తే. తునియలుగఁ జేసె హరులఁ జతురశ్వరథుల
సూతుఁ బంచమమున ఘనకేతుయష్టి
షష్ఠమునఁ జాపదండంబు సప్తమమున
నలిగి యొత్తినకరవాల మష్టమమున. 183

క. ఆలోనన యజ్ఞనపతి, వాలిక నారసము లైదు వక్షమున వడిం
గీలించి ధైర్యసారము, దూలించినఁ దొలఁగి నీసుతుం డిల కుతికెన్. 184

చ. వికలరథప్రయుత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్త్రక
ర్ణకృపులుఁ దక్కనుం గలుగునాయకులున్ రయ మార వచ్చి కూ
డికొనుట చూచి యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూనుపొం
తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకంబునన్. 185

వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరం బొత్తంబు లొక్కెడనుం దార్కొనిన నుభయబలంబులు నురవడించి కలయఁ బెనసినం గ్రందుకయ్యం బయ్యె నందుఁ జిందంబులప్రోఁతయు నార్పులయులివును బాణకృపాణాగ్నిహేతిసంఘట్టనంబునం బుట్టు రణనంబును రథావయవాస్థికపాళభంజనంబున నెసంగునినదంబునుం గూడి పరఁగిన దిక్కులు పిక్కటిల్లెఁ గరులకొమ్ములం జిక్కి వ్రేలుతురంగంబులును సందుకొని చొచ్చినసుభటులు [1]సెరివిస నొఱగి కూలుశుండాలంబులును నాశ్వికుల మొగంబునం బడి యులాయంబులు సొచ్చినసరోవరంబులచందం బగు కాల్బలంబులును రథికులు వోక పెనంగిన నఱవఱ లయినయురదంబులును నెత్తురుకాలువలును గండలతిట్టలును బ్రేవులప్రోవులును నెమ్మలరాసులును నత్యంతరౌద్రంబు నావహించె ననుటయు నాంబికేయుండు. 186

చ. సమరము [2]పెంపు సెప్పెదవు సంజయ చెప్పవు నీవు నీమహీ
రమణునిభంగి ధర్మజశరంబులచే విరథత్వ మొంది మా
నముఁ బలముం దెగం దొలఁగెనా మగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజభుజగర్వవిహీనతి నొంచెఁ జిత్తమున్. 187

వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కిట్లనియె. 188

తే. విరథుఁ డయ్యెన కాని యవ్వీరుఁ డాహవంబు దక్కక యొండురథంబు పన్ని

1. జ. పొదివిన. 2. గ. సొంపు.

కొని సముద్ధతి వచ్చి సక్రోధ మైన, మనముతో సూతునకు నిట్లు లనియె నధిప.

ఆ. [1]తెల్లసేవిగులును వెల్లనిగొడుగు నై, యల్లవాఁడె పాండవాగ్రజుండు
మెఱసియున్నవాఁ డుపవఱపు మహోత్కటిక, రథము ఘోటకములఁ దఱియుము మెఱయ.

వ. అనుటయు నతండు నట్ల చేయు నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహికేతుమహితంబై వచ్చుచున్నధృతరాష్ట్రనందనస్యందనంబునకు సమ్ముఖంబుగా మనరథంబు నడపు మనుటయు నాతం డవ్విధంబు నాచరింప నయ్యిరువు రతిరథికులకుఁ బ్రకటప్రధనం బయ్యె నట్టియెడ. 191

సీ. పాండవుచాపంబు ఖండించె నీకొడు, కొండొకధను నెత్తి యుఱక యాతఁ
డకురునాథువిల్ గ్రక్కునఁ దునుమాడె, నతఁడు వేఱొకవింటనతని నేయ
నయ్యుధిష్ఠిరుఁడు నాగ్నేయాస్త్రంబు లేసిన, నాచ్ఛాదితం బయ్యె నంబరంబు
వారొండొరుల రక్తధారాప్లుతులఁ జేసి, పుల్లకింశుకభంగిఁ బొలిచి రేచి

ఆ. ఘోరశక్తి నైచెఁ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు
నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మ,హీశునురము గర్వ మానక మెనఁగ. 192

వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీనందనుండు. 193

చ. బరవస మొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె నమ్మహీ
శ్వరు నతఁ డల్గి బల్విడుగుచాపశిలీముఖ ముచ్చి పోవ న
క్కురుపతి సేయఁ గయ్యమునకుం దుది యప్పుడు చేయువాఁడు గా
నరదము డిగ్గి నాతఁడు గదాకలనోద్భటబాహుదండుఁ డై. 194

క. డిగి రయమునఁ గదిసిన నా, జగతీపతి యేచి యుగ్రశక్తి నురము బి
ట్టుగ నైచిన నీతనయుఁడు, పొగడఁగ రథ మెక్కి వింట మార్కొనువాఁడై.

దుర్యోధనుఁడు ధర్మజుతో యుద్ధము సేసి మూర్ఛిల్లుట.

క. అత్తఱిఁ గడుఁ బెల్లుగఁ గ్రో, ధోత్తరు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ గృతవర్ముఁ, డాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్.

ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్డు బలంబు మారుతో
ద్ధూతపయోధివోలె వడిఁ దోడ్పడియెం గృతవర్మ కంత ను
ద్ద్యోతితభంగి వచ్చి విజయుండును వెసం దునుమాడె లీల మైఁ
జేతులకింట వోవ రథసింధురవాజిభటోత్కరంబులన్. 197

వ. అంత. 198

క. కురుపతి దెప్పిఱి బాహు,స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మార్కొని ని
ష్ఠురవివిధవిశిఖనిహతి, శరీరుఁ జేయుటయు నతఁడు సక్రోధుం డై. 199

తే. కార్ముకముఁ గేతువును ఘోటకములు సూతు
పెడఁద బలుతూపు లేడింటఁ బుడమిఁ గూల్చి

---

1. గ. తెల్లసైనకిడము ♦ తెల్లనిగొడుగు నై.

నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగెను, నాధనంజయునను నట్లు కాన
యీరసంబున మాకు నిద్దఱ కొండొరు, విమునకఁ బెనఁగఁ బొరపొచ్చెద యుండెఁ
[1]గలహ మొక్కమొగంబుగా గావున నేఁ జేసి, దలఁపఁడె పోరు నుగ్రములప్పుఁ జలము
ఆ. నుల్లసిల్ల నొక్క రోఁకుని నొంపను, జంపఁ జూతు మూఁ డిక్రలింపనాథు
బలసంగన్నశక్తి వ్రాలియుట నామిగాఁగ, నలుకు లేక తెలియుము రాజఁ డధిప. 229
వ. అప్పుడు చేనత్తుఁడు గా కుండ నక్కిరీటి గీటడంగించు విధంబు బాహింపుము. 230
చ. నరియగు నాకు దివ్యశరజాలములం దలఁపోసి చూచె న
న్నరుఁడు దృఢత్వలాఘవగుణంబులఁ దక్కవ మారపాలిపి
స్ఫురణఁ గరంబు [2]వత్రపడు భూవర సౌష్ఠవరేఖ నేరియుం
దొరయఁడు ధైర్యశౌర్యపటుదోర్విభవంబుల హీనుఁ డెంతయున్. 231
క. మును విశ్వకర్మ దేవేంద్రునకై నిర్మించి మహాత్రరూపము విజయం
బనుచాపము దానిని బాహుబలముల మెఱయించె నతఁడు దగ్రస్ఫూర్తిన్. 232
చ. పరిచయ సక్తచిత్తుఁడయి భార్గవరాముని శాతకిచ్చినం
బరమపరాక్రమమ్మున నృపాలుర నెల్లను నిమ్మహాభుజుం
డిరువదియొక్కమాఱు సమయించె దదీయ నితాంతశక్తిన
ప్పరమమదయుషాపరుం డొసఁగె భార్గవ నాకది కూర్మి మెంపునన్. 233
ఉ. అనుపమనీయచాపమున నర్జునుదర్ప మడంచి నేఁడు సం
గ్రామము నుజ్జగించెద నరుల్ కంటకనుస్సితి గల్గ మేటినై
భూమి [3]యమర్త్యదం గొనుము భూవర నీ దగుపుత్రపౌత్రులన్
శ్రీమహిమావళి సమస్తజన సేవ్యమహోన్నతిఁ బొందునట్లుగన్. 234
వ. అని పలికి వెండియు నిల్లనా నాపిడయుంబును విజయుగాండీవంబును నొక్క
రూప యితనికి నతఁడు యుతూణీరంబులు నగ్ని దేవుం డిచ్చిన దివ్యరథంబును
నవధ్యరత్నంబులుం గల వవి యొక్కసాయునను దాని కంతఁ జింతింప. 235
క. నారాచములాదిగఁ గల, ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్
తేరులు దృఢవాజులు నా, తేరి వెనుకఁ బెక్కుమర్పు తెచ్చెద నధిపా. 236
వ. మఱియు నొక్కండు డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయిన కృష్ణుండు సారథ్యంబు
సేయుట సప్పార్థపరాక్రమంబు నసాధ్యంబై యుండు నట్లుగుటం జేసి. 237
తే. ఖండనము సేర్పు మొయిఁ గృష్ణు పాటియనగ, మహిఁ బొగడ్తకు నెక్కినయమద్రనాథు
నాకు సారథి గాఁగ నొసర్పవలయు, గెలుతు నట్లైన నన్నరు నలవు మెఱయ.
క. హరి కక్కడ రయమద్రేశ్వరుఁ డశ్వజ్ఞానమున సనంతయు మే న
న్నరునకు మిక్కిలి బలవిస్ఫురణంబున నర్మకుశలబుద్ధిఁ దలంపన్. 239
క. కావున నశ్వర మిమ్మాటు, గావించుట యెల్ల హితముఁ గావించినయ

1. చ. గలమునఁ మొగి నుసు గావున. 2. జ. దొట్రుపడు. 3. జ. యొనర్చెదం.

ట్టి వెలయ నింత సేసి మహీవర ననుఁ జూడు పోర నశ్లాఘించెదనో. 240

క. విను మిత్రేంగితన నే న, య్యనిమిషవర్గంబు నైన నాజి జయింతున్
మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్కసరకే తలఁపన్. 241

వ. అనిన విని నీపుత్త్రుండు ప్రీతుండయి రాధేయు నగ్గించి నీ కెల్లభంగి నిశ్శల్యు సారథిం గావించెద నని పలికి మహోత్సాహదీప్తుం డై. 242

క. అమ్మేటిబంట్లను రథరథ్యమ్ములు నాఁ గెన్నుఁ గాంచ నవనీశులు నా
తమ్ములు నేనును నీపార్శ్వమ్ముల నడచెదము బరవసంబు గ్రమ్ముగన్. 243

క. అని చెప్పి ప్రీతుఁ డగునా, తనిఁ దోర్గర్వాని నతని సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁ డై మద్రనృపు దుర్యోధనుఁ డనువినయయుతుఁ డగ నతనిఁ గనెన్.

—దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట.—

సీ. సత్యవ్రతంబును శాత్త్రవదుర్గశౌ, ర్యాసనంబును మహాభాగ్యమును
నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్మి, గావున నిన్నును గారవించి
వినతుండ నై వేఁడికొనియెద రాజుల, నడుమ నీ యగుసామ్యనస్న మెఱిఁగి
యర్జును ననిఁ దెగటార్పఁగ వలయుట, యూహించి సంభృతోత్సాహ లీలఁ

ఆ. గావు మితని ననుచుఁ గర్ణునిఁ జూపి యి, తని రథంబు గడపు మనఘ యిట్టు
లైన నితఁడు పగఱఁ బోనీక పాదివి యస్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.

చ. గురుఁడును భీష్ముఁడుం జనినఁ గొంచెపుమూఁకలతోడ నేను సం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సకి నన్న పాండుభూ
వరసుతవర్గముం దొడరువాఁ డన నా మది నిశ్చయించు టె
వ్వరిఁ గొని యింత నీ వెఱుఁగవా నినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. 246

క. ఇమ్మెవ్వర[2]మ్ము సారథ్యమ్మితనికిఁ జేయు మనుచు నగుణుఁడు నా సాహా
య్య మ్మొనరించినట్టుగఁ దిమ్మరమ్ము క్రియఁ రూపు సెసి యుక్తరాత్ము లడంగన్.

క. అనిన విని కెంపుసొంపునఁ, గనుఁగవ యుగ్రతఁగ బొమలు గదియఁగ ఫాల
మ్మునఁ జెమటవొడమ నీసుతుఁ, గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్.

సీ. నను నింతనీచపుఁబనికిఁ బంపఁగ నీకుఁ, గగునె భూవర వర్ణధర్మ విధము
తెలియఁగవే శూద్రుల కేనాఁటఁ బరిచర్య, సేసిరి మూర్ధాభిషిక్తు లైన
రాజులు సూతజు రాధేయుదొరఁ జేసి, కొని యేను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల నీతని బలశాలిఁగాఁ దలచెదు, [3]నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె

ఆ. పగఱతోన నొకనిఁ బొల్పెట్టు మెట్టివాఁ, డైన సమయఁ జూచి యెరుగు వాఁడ
నట్టిభంగి సాల దంటేని [4]దరవాయి, గొని వధింతు శత్రుకోటి నెల్ల. 249

1. క. బరవసమునిద్రగమునన్. 2. గ. మితనికి సహాయమ్ముగ నినునకు ననూరుసారథ్యసహా యమ్మొదవి_జ. మ్మసారథ్య మ్మితనికిఁ జేయ వినతతనయుసహాయుత్వ మ్మొదవినరవిగతి. 3. క. నా కింతకంటె బన్నంబు. 4. క. దరువాయి_గ. అరవాయి.

క. విను మేను విశ్రమింపఁగఁ, గనుఁగొనియెదు నంతవాఁడుఁ గలఁడే శల్యా
లనికాయంబు పగులఁగ, ఘననిధులు గలంతు ధరణిఁ గ్రత్తుం గలయన్. 250

చ. నరవర చూడ నే తెలియ నాదగు బాహులు మద్బలంబు నీ
వరయఁగ శక్తి తే నొకని నక్కట సారథి నై రథిత్వవి
స్ఫురణము తక్క నొప్పగున సూతతనూజుఁడు షోడశాంశమున్
దొరయఁగ నాకు నాననసుకృతున్ సురమర్దనుఁ జీరికిం గొనన్ 251

వ. ఇట్లుగు వెలుఁగి చెప్పితి వెతెంగియుం గర్ణుపడుపాతంబున నవమానించె దేనిమా
భూమికిం బాయి వచ్చెద నని నలికి రాజమధ్యంబున నుండి వెడలిపోవం జూచినం
గురుపతి నప్రణయబహుమానంబునం జని నిలువరించి సాంత్వనస్వరంబున మధు
రాక్షరవిన్యాసంబుగా నతనితోఁ [1]గర్ణుండ యేల తక్క నీకక్కడయైన రథికులుం
గలరే కడింగనఁగ నీ హృదయశల్యంబగుటఁ గాదె నీకు శల్యుం డనునభిధానం
బయ్యె నాయభిప్రాయంబు వినుము ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు
మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీవధికుండవు ధనంజయునకుఁ బ్రతి
పీడగా మహనీయత్వం బాలించితి మది కృష్ణుండు సిల్ల నీకు నికిం జేసి కృష్ణువర్త
నంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుం గోరితి నింతవని నీకుం దక్కనొరులకు
శక్యం బగునే యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుండు. 252

క. ఘనుఁ గృష్ణునకంటె నధికుం, డని యమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం
గొనియాడితి విమలయశో,ఘనుఁ డగు కర్ణునకు రథముఁ గడపెద నధిపా. 253

వ. అని యా సూతునందను నుద్దేశించి వెండియు నిట్లనియె. 254

క. జనవల్లభ యోగసముదాయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు, నను నెగ్గులు పట్టకుండ నియమం బొందొనరున్. 255

క. అనుటయు గౌరవమున నీ,తనయుఁడు రాధేయుఁ జూచి తగు నిట్లగుఁ గా
కని పలికి శల్యునిం గనుఁ,గొని యిది గడు లెస్స యనియెఁ గురువంశనిధీ. 256

వ. ఇట్లభినందించి యున్నయన్నరేంద్రుం డమ్మద్రపతిమనం బురియాడునోయని
శంకించియుతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు
తొల్లింటిపెద్దలవృత్తాంతంబు వినుము మార్కండేయమహాముని మాతండ్రి కేను
వినుచుండఁ జెప్పినయది నీకుం జెప్పెద సురలతోడి దురంబున నసురవరుండగు తార
కుండు దెగినపిదపఁ దదీయతనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును కమలా
క్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి. 257

దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురుల వృత్తాంతంబు సెప్పుట.

క. దమమున నియమంబున ను,త్తమమును ఘోరంబు నైనతప మతినిష్ఠం
బ్రమదితు లై చేయఁగ న,క్కమలభవుఁడు దోఁచి పరమకారుణ్యమునన్. 258

1. క. గర్ణుండ తేల తక్కనీ కెక్కుడురథికులుం.

సీ. తారకాక్షున కొడుకు తత్తనయుండు హరి యనఁ, జనియించి వాని జాడ ననుగుణించి
తపము సేయంగఁ బ్రత్యక్షుండై యద్దేవుఁ, డడుగుము వరమన్న నతఁడు త్రిపుర
ములవార లాయుధగతులు గాఁ జచ్చినఁ, బీనుఁగుల్ నీరిలోఁ బెట్టి తడవ
నొక్కఁడు పదుగురై యొప్పుడులావును, బీరంబు మెఱయ సత్ప్రీతి నుల్ల
ఆ. సిల్లునట్టి బావి చిగతరత్తోయమై, మాపురములఁ జిత్రమహిమ వెలయ
నావహిల్ల వలయు ననిన నిచ్చితి నని, యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె.

వ. ఇట్లు మహాప్రభావంబైన[1] యబ్బావి వడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జరభయంకరు లగుచు భువనంబు లన్నియు బాధించుచుం గొఱిగి లోభమోహ వశతం బొంది విచ్చలవిడిం దిరుగం దొడంగిన దేవపితృమునిస్థానంబులకు హాని పుట్టినం బురందరుం డఖిలబృందారకులుం బరివేష్టింప నప్పురంబులపై నెత్తి చని పెనంగి భేదింపం జాలక విషణ్ణుండయ్యె నంత నతండు దివిజులుం దానుం సంయమి సహితుండై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా నద్దానవుల తెఱం గెఱింగించి తద్వధోపాయం బడిగిన నతండు వారల కిట్లనియె 265

ఉ. ఏచిన యా పురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాని పెఱచొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచెనేని మదనాంతకుచే నది సెల్లు నొండ్లకు
న్గోచర[2]మట్టె యింతలు పనుల్ సనుఁ డమ్మహితాత్ము పాలికిన్. 266

ఆ. అనిన నట్లకాక యని దివ్యవర్షసహస్రకంబు వారలధికనిష్ఠ
నతులతపము సేసి యత్యంతమగ్నాత్ములై మహేశుకడకుఁ జనఁగ నపుడు. 267

వ. అవ్విరించిం బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి. 268

క. వరదు శరణ్యు శశాంక, స్ఫురితశిరోభాగు సర్వభూతేశ్వరు శం
కరు సాంఖ్యయోగనిష్ఠాపరసంభు ననంగదమనుఁ బరమాత్ము శివున్. 269

—త్రిపురసంహారమునకై బ్రహ్మాదులు రుద్రుని బ్రార్థించుట.—

వ. కని ఫాలంబులు భూమి సోఁకం బ్రణమిల్లిన నద్దేవుండు మీరాకకుం గారణం బేమి యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి 270

క. సత్త్యానుభావ నిర్మల, నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ చి,త్సత్త్యాత్మక భక్తలోకదౌర్గత్యహరా.

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించినం బ్రసన్నుండై భవుండాదరించి మీకు భయంబు వలవదు మీ చెప్పినయట్లు చేసెద వలయుకార్యం బెయ్యదియనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొందె నరవిందభవుండప్పరమేశ్వరునకిట్లనియె

1. క. యప్పురంబు వడసి 2. క. మెట్టు లింతలు పనుల్ సనుఁ డమ్ము; మెట్లగుం జనుఁ డుగ్రుఁ గొల్వ నన్ను.

భవదీయ ప్రసాదంబున బ్రదికెద మని చాఁగిలి మ్రొక్కినం బరమాదరంబున
నెత్తి యవ్వృషధ్వజుఁడు వారలఁ గారుణ్యంబునం గనుంగొని. 288

మీరు నిజంబ చెప్పితిరి మిక్కిలి నేర్పును లావుఁ గల్గినన్
సారథి పోరులన్ రథికసత్త్వముఁ దా గెలిపించు నెట్టిదో
స్సారవిలాసభంగులకు శల్యుఁడు మెచ్చఁగ నాగమాత్మజో
దారహయంబులన్ నడపెర్ద దనుజుల్ చెడఁ గందునట్లుగన్ 289

అని పలికి సురగణంబు ముదంబునం బొదలఁ దనచేతికమండలు వొక్కెడ నిడి జడముడి బిగియించి యజినపరిధానంబు దృఢంబుగా బంధించి ప్రణవంబునందష్టయోనర్చినముఁ గోలఁ బట్టికొని నొగ నెక్కి నిల్చు లోకపితామహుని సురలు శంకరసారథ్యంబు సేయుంచి గని చెప్పి దార్ఢ్యధరాధరు చెంగటియు నిల్చినను.

వారు లక్ష్మమహోత్సుకులిరువుర, ధరించుగుట గోర్కెలేక పటుటాను నెక్కెఁ
వెరవున లాఘవ వాగెలు, ధరియించుచుఁ బక్కభవ్యుఁడు ధరణీనాథా. 291

. ఎత్తియత్తురఁగంబులకు వీర్యశౌర్యంబులు గలుగ నను గ్రహింపరథంబు గడవం దళ్కొళలంబు గొనియాడి కామకమనాం డాగసుజులమర్గంబులకునకు వరదంబు వలపుము నేఁడు జగంబులయులజడి పూన్చిన నాచేతిబలువు నూఁడు మని పలికిన నప్పరమసారథి మనోమారుతజవనత్వంబులు గలుగునవ్వేదాశ్వంబులం బలువ నథర్వాంగిరసులు చక్రరక్షకు లయి [1]చనుదేర నత్తేఁ గాపురంబుల కడరిన నయ్యాదిమరథికుండు. 292

—శంకరుఁడు త్రిపురంబుల సంహరించి సురల సంతోషపఱచుట—

. కోపసందీప్తుఁ డై చాపంబు సజ్యంబు, గావించి మార్గ్యమార్గణముఁ గూర్చి
పాశుపతాస్త్రసంబద్ధంబుగాఁ జేసి, యరములు మూఁటిసి బుద్ధి నిలువ
నవి యొక్కచోటికి నవప్పుడ చూడెడు మునులును, సురలును ముదముఁ బొంది
గెలు గెలు మంచు నగ్గింప నయ్యుగ్రుఁడు, దెగ వాసియేసిన [2]దితిజయుతము
3. గాఁ బురత్రయంబు గాలి నీఱై పచ్చి, మూఁడిఁ దొంగ నమ్ముక్కాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁబురహరుఁడను మాన్పె, నంతసిల్లె సకలజంతువులును.
5. అప్పు డనిమిషమునిజనంబులు కృతకృత్యు లయి భూతనాథుం బ్రణుతించియతం డనుమతిసేయ నంబుజాసనుం డు లోనుగానందేకు నిజస్థానంబులకుం జని రివ్విధం బున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె నీవు నట్ల పోలెఁ గౌరవరక్షణార్థంబుగా రాధేయురథంబు గడపు మిక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకుఁ బలశౌర్యంబుల నెక్కుడయినవాఁడవు మదీయజీవితంబును రాజ్యం బును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును సుఖంబును గావింపను నీవ యొడయుండ విశ్వార్యం బాదరించి నన్నురక్షింపు మని ప్రార్థించి నీపుత్త్రుండు

1. ఖ. వడతేర. 2. గ. దివిజరిపువుఖ్యుతంబుగాఁ బురత్రయంబు నీ త్రై.

మద్రపతికి మఱియు ని ట్లనియె. 294

సీ. ఇది యొక్క యితిహాస మిను నోర్వనుండు ధర్మప్రవీణుం డగు బ్రాహ్మణుండు
ధృతరాష్ట్రవసుమతీపతికిఁ జెప్పినయది వినుము భార్గవవంశమునఁ బ్రసిద్ధుఁ
డగు జమదగ్నికి నత్యంతనిర్మలమతి రాముఁ డుదయించె నతనిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షుఁడై నిలిచిన నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును

తే. నమ్మహాత్ముఁ డసమున లైనవారల నవి నిగ్రహించుఁ గాన నీవు పరమ
శుచివి గమ్ము నీకుఁ జొప్పడు నఖిలమహాస్త్రవీర్య మనియె నాదరమున.

వ. అనిన విని జామదగ్న్యుండు వినతుండై నాకెప్పుడు పాత్రత్వంబు గలిగె నప్పుడు నీవ తలంచి దయసేయుదువు గాక నీకు శుశ్రూషసేయుచుండ నన్నుఁ గాఁ బ్రసాదింప వలయు నని విన్నవించిన విని కరుణాయత్తచిత్తుం డగు భవుం డవ్వరం బిచ్చిన నమ్మహాత్ముండు [2]నియమనిష్ఠాపరుండై పూజోపహారప్రముఖవిధానంబుల నద్దేవు నారాధించుచుండ ననేకసంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు ప్రసాదలసితాననుండై గౌరీదేవికి నతనిం జూపుచు. 296

క. రాముఁడు విమలవ్రతచర్యామహితుఁడు నాకు భక్తుఁ డని పలుమాఱుం
దా ముద్దు సేసి మృదువచనామృతసంసిక్తుఁ జేయు నాసమయమునన్. 297

వ. బలవంతు లగుదనుజులచేత బాధితు లయి బృందారకు లయ్యిందుధరువాలికి [1]భయసంభ్రమంబులతో నరుగుదెంచి తమయలజడి యెఱిగించిన. 298

ఆ. జామదగ్న్యుఁ జూచి చయ్యనఁ జని దానవుల వధించి దేవతలకుఁ బ్రీతి
యాచరింపుమని యెహ్హరుఁ డుదానికిమది మదముఁ బొంది కేలు మొగిచి యతఁడు.

క. అకృతాస్త్రుఁడ నగునాకుం బ్రకటభుజాబలులు నస్త్రపారీణులు నై
సకలసురనికరసంబాధకు లగుదానవుల గెలువ దరమే యనుడున్. 300

తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ
దలఁపు నీదన నిలిపెద దానఁ జేసి
పగఱ నిర్జింప నగుఁ బదంపడి మనోర
థంబు సిద్ధించు నరుగుము దడయ కనఘ. 301

చ. అనవుడు నట్ల కాక యని యాజమదగ్నిసుతుండు ధీరతం
జని సముదగ్రులైనసురశత్రులఁ దీవ్ర[3]రాయుధోత్కరం
బున వధియించి వారిబలుపోటుల నొచ్చినమేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ గరంబున నంటి యాతనిన్. 302

వ. ఇవ్విధంబునం[4]బ్రకృతిస్థశరీరుం గావించి భర్గుం డాభార్గవుపయిం బ్రీతిశీతలం బగునాలోకనం బొలయ నాతని కిట్లనియె. 303

---

1. క. నప్పుడ నీతలంచినట్ల దయసేసెదవు గాక. 2. గ. యమనియమానుష్ఠానపరత్వంబు గలిగి పూజో. 3. గ. రాశుగోత్కరం. 4. క. బ్రదీప్తశరీ.

అనివర్తనమతి గవయుఁగ, నని నీ దగుతనువు సునిశితాయుధములు [1]దాఁ
కిన నొవ్వదు శత్రులు పన్నిన సుడువుము గర్వ మడఁచి నిర్మలచరితా. 304
కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు. 305
కోను మని దివ్యం బగున, స్త్రనికాయము శస్త్రచయముఁ దద్దయు నుదయ ని
చ్చిన నవి యాతఁడు సాష్టాంగనమస్కారంబు సేసి కైకొనియె నృపా. 306
తదనంతరంబ లోకగురుం డగునాహరునిచేత ననుజ్ఞాతుండై యతండు నిజస్థానంబు
నకుం జనియె నయ్యతిహాస ప్రకారం బిట్టిది యవ్విధంబున వివిధదుష్కరసత్కర్మా
నుష్ఠానఫలంబులై వచ్చినసర్వదివ్యాస్త్రంబులు నారాముండు రాధేయునకుఁ బ్రీతి
చేసియుండై యొసంగె నట్టిమహాత్ములు హీనకులజాతుల నాదరింతురే యుప్పుణ్య
పురుషుండుగ యిక్కొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుం డనితలంచెద నవనవక్షో
బాహుప్రముఖాంగకంబులు సూడ దేవకుమారుం బోలె నున్నవాఁడు ప్రకృతి
కాంత కుండలవజ్రకవచంబులతోడ నాదిత్యసన్నిభుం డగుకొడుకుం గాంచు నే
సింగంబు లేడి కట్లు వుట్టు నితనికి సూతసంవర్ధితుం డైనకీడు దొడరె నింతియకా
నోవు రుద్రశిష్యత్వంబున విస్రుతుం డగుభార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగు
నంగరాజు ననంగదమనుం బరిగ్రహించినవిరించి భంగి బరిగ్రహించినీవు సారథ్యం
బాచరింపు మఖిలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయు ననునీతి నీవు
ప్రసన్నుండ వగుటం జేసి నాకు సిద్ధించె ననుటయును. 307

తే. గ్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మానసమునఁ దలిర్ప నృపకు
మార నీవు నాకోలఁది యుల్లరయ నెఱుఁగు
దేని నిది తెప్ప నీకోర్కి యేను దీర్తు. 308

వ. అని మఱియును. 309

శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట.

క. వినులకుం బలుకులు నేఁ, దైనను జెప్పెను హితంబు లగుకార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం, గాని యలుక వలదు నీకుఁ గర్ణవ రథిపా. 310

తే. అనినఁ గర్ణుఁ డిట్లను మద్రపతితోడ, హరున కజునకు నమరచ్యుతునకుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ, శాలి నాకు నీవు సంగరమున. 311

వ. అనవుడు నట్లు కాక యని శల్యుండు వెండియు. 312

క. తగువారల లోపులు దెగడుట, పొగడుట యగుపలుకుహితంబు బోవరు హితకా
ర్యగతులు సెప్పఁగ [2]దెగడఁగఁ, బొగడఁగ నను నోర్వవలయు బుద్ధిగలిగినన్.

తే. శక్రుతేరైన నడపంగ జాలువాఁడ, [3]నుఱవు సెప్పను రథికు నేర్పమ్ముఁ [4]నీకు

---

1. జ. దాఁకిన నొవ్వ కుండఁ జేసెద, విను మానుషకర్మ మడఁచి విమలచరిత్రా. 2. క. దెగడఁగఁ, బొగడఁగఁ దను. 3 గ. నొఱవు; క. నొఱవు. 4 జ. నీకు.

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము, ద్వితీయాశ్వాసము.



నిష్పాదననిపుణాకృ
పానిరతిశయమార్గవిభావభావాతీతా
భానుసహస్రప్రభ ర
మ్యానంతవపుఃప్రకాశ హరిహరనాథా. 1

— శల్యుఁడు కర్ణునుత్సాహంబునకు విఘ్నకరంబు లగువాక్యంబులు సెప్పుట. —

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనసుతుండగు సూతసుతుఁ గర్ణు దీర్పం బూని యతిప్రయత్నంబు సేయుచుఁ గూర్ణించి యాంబికేయుండు. 2

ఆ. ఎట్లు ప్రియము వలర్చె నట్లు సంప్రార్థితుం, డైనమద్రనాథుఁ డంతఁ గోరి
తేరు గడప నతని తెప్పిరిల్లెట్టియు, వీరుఁ డేమిభంగి విక్రమించె. 3

వ. అని యడిగిన సంజయుం డిట్లనియె నట్లు రథిసారథులు విలసిల్లి వందిమాగధప్రస్తూయమానులగుచుఁ దనవలసను గౌరవంబునం గనుంగొనుచుండఁ గురురాజయ్యంగరాజు నుద్దేశించి. 4

చ. గురుఁడును భీష్ముఁడుం జనుటఁ గర్ణ బకవైరికి నగ్గలంబు వీ
రిరువురు వారి నిద్ధజనహీనపరాక్రమలీల గీటడం
తురు ధ్రువ మంచు నాత్మఁ బరితోషముఁ బొందుదు నట్లు గాక ని
ర్భరబలశౌర్యముల్ మెఱయ గ్రక్కున నావని సర్వహింపుమీ. 5

తే. పాండవుల నొండెఁ బట్టుము పాండుతనయ
ముఖ్యు వీరు వారన నేల మునుమువట్టి
వైరివర్గంబు నెల్లను బారి సమరి
సైన్యయుతముగ నద్భుతజయము గొనుము. 6

1. క. యింత గోరి తేరు నడప. 2. గ. గాద నిరంర.

వ. నడపు మనుటయు నమ్మాటఁ గైకొని కర్ణుండు శల్యునిం జేరు నడపు మనిన నతం
డట్ల చేసె నప్పుడు శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వ
లంబు గావించె నిర్విఘ్నంబునం జని చని గర్వాగ్రహవిధేయుం డగురాధేయుం
డమ్మద్రపతి కిట్లనియె. 7

శా. నారాచాదిమహోగ్రబాణపటలీనానావిధోల్లాసముల్
సైరింపన్ ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ వి
స్మేరం బై ఖచరవ్రజంబు పొగడన్ మెచ్చంగ నీచూడ్కి దు
ర్వారోదగ్రత నేఁడు సూపెద భుజావష్టంభసంరంభి నై. 8

సీ. అన విని మద్రరాజాతని కిట్లను, సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్యమహితులు భూరితేజోధను, లఖిలాస్త్రవిత్తము లార్యు లమర
పతి కైన రణమున భయము పుట్టింపంగ, నోపుదు రప్పాండుభూపతనయు
లేల వారల నింత యాలపోఁ బలికెద, విప్పుడు వల్కరా దెట్లు నీకు

తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
విదళనము సేసినను భీముగదమెఱుంగు
లాలసి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను భ
యంబువెల్లున నపుడు వా యడఁగుఁ గాక. 9

వ. అని వెండియు. 10

చ. నరునిశరంబులన్ రథగణంబులు గూలఁగ భీమునుల్లస
త్పరిఘమునన్ గజవ్రజము భగ్నము గాఁ బెఱతమ్ములున్ యుధి
ష్ఠిరుఁడును దాఁకినం జలము సించి దొరల్ గలఁగంగఁ జూచియుం
దిర మయి నీవు నాలుకకు జెప్పినమాట గదా వినం దగున్. 11

క. అనుపలుకులు వినియుం బా, వనని చెవులు సేసి మద్రవిభుతో రాధా
[1]తనయుఁడు నాచేతిబలువు, గనుఁగొనియెద విపుడ యనియె నుగ్రం డమరంగన్. 12

వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుం డై నడతెంచు నతని నుపలక్షించి. 13

చ. కురుబల మబ్బి మ్రోర్చెఁ బటుఘోటకహేషితనిస్వనంబులుం
గరివరబృంహితధ్వనులు గాఢము లై విలసిల్లె నెత్తురుల్
గురిసె నభంబు మ్రోయఁ బిడుగుల్ మొరసెం బొరి నుల్క లెల్లెడం
దొరఁగెఁ బ్రదీప్తమారుతము ధూళిఁ గురున్ వడిఁ జల్లె భూవరా 14

వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశం బగుటం దెలుపుచుం దోఁచె
దోఁచిన నవి యెల్ల సరకుగొనక వారు దైవమోహితులు గావున శల్యసహితుం
డైనకర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁబడుదురు గాఁ దలంచి

1. గ. తనయుండు మాట లేటికిఁ.

సంతోషించి రథంబు భీష్మద్రోణులదోర్వీర్యంబులు పాండవతనయులచేతం గోలు
పోయె నని మనంబున వారల మెచ్చక ముంగలి యై మెఱసి నడచుచుండి
పార్థపరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప మాన
దర్పోన్మాదంబున మద్రపతి కిట్లనియె. 15

మ. అరదం బెక్కి శరాసనంబు గొని తేం పారంగ నే నేచి సం
గరసంక్రీడకుఁ జొచ్చినం దృణసముం గాఁ గొందు నద్దేవతా
వరు నైనన్ గురు నాపగాతనయుఁ జావం జూచుటన్ నైరు[1]లే
తురు చెండాడెద నుగ్రతం దలలు నాతద్గర్వముం జూడుమీ. 16.

వ. అని పలికి యనంతరంబ గాంగేయకుంభసంభవులం గటిమానుసులు నిట్టి రిత్త
సావు సత్తురే యని యాగడించి మఱియు నిట్లనియె. 17

ఉ. వారల లోకవీరుల నశ్వధ్యుల గీటడంగించి పల్వురన్
వారలయట్ల యెందు నవిశ్వార్యు లనం జను మేదినీశులం
బోర వధించి రౌద్రమునఁ బొంగి క్రమాగతమృత్యువో యనాఁ
గా రణకేళికిం గడఁగుఁ గాండివి నేన యెదిర్చి యోర్చెదన్. 18

ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ బావనియుం గవలుం జలంబు నై
నొండొరు మూదలించుకొని యొక్కటఁ బాఁకినఁ దీవ్రవిస్ఫుర
త్కాండవిదారితాంగకులఁ గా నొనరించి యలంచి లీలనై
గం డడఁగింతుఁ బోర పెనఁగం గలచంద మెఱింగి చెండుదున్. 19

వ. [2]అని పెండియు నిట్లను భీష్ముఁడు దెగినను ద్రోణుదోర్బలానంబునాసగలిగియుండె.

సీ. ద్రోణుండు బహుదివ్యబాణశిక్షుఁడు భుజాబలశాలి శౌర్యసంపన్నహృదయుఁ
డతులవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డ, వ్వీరుండు పార్థుచేఁ బోరఁ బడిన
ధార్తరాష్ట్రులయేవు దఱిఁగెఁ దదాప్తసైనికులు గం డడఁగిరి నీ వెఱుంగ
నైనను రాముకృపాతిశయంబునఁ, గనినయీరథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులును గలిమి నే, నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు నెల్లభంగిఁ గురురాజుమన్నన, యప్పుదీర్తుఁ బ్రాణ మాసపడక. 21

—శల్యుఁ డర్జునుపరాక్రమం బుగ్గడించి కర్ణునిఁ దూలం బలుకుట.—

వ. అనిన విని శల్యుండు కర్ణున కిట్లనియె. 22

చ. వినినజనంబు లీతఁ డవివేకి యనన్ వల దింతరజ్జు ల
ర్జునుబలశౌర్యసంపదలు సూచి యెఱుంగవె మున్నునిన్ను నా
తనిఁ గలనన్ జగం బెఱుఁగదా యతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్దివిజేంద్రనందనున్. 23

1. గ. లేతురు. 2. ఆ. క. అని పలికి పెండియును నిట్లను భీష్ముఁడు దెగిన ద్రోణుంపతులిత విద్యా ప్రవీణత్వము దోర్బలావష్టంబును జాలం గలిగి యుండె ◆ ధూమత ముదముచే.

సీ. రాత్రిఁ జూచ్చి దానికి గ్రూరతఁ బోరి మగఁటిమి, వాసినయంగారపర్ణుఁ గంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱవట్టి, మాన మేదినచిత్రసేనుఁ గంటె
ఖాండవోద్యానంబుఁ గావ నేరక సిగ్గు, పడి చన్ననిర్జరప్రభునిఁ గంటెఁ
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగఁ, బెనఁగి చిక్కిన త్రిలోచనునిఁ గంటె
ఆ. నెక్కుడైనవీరుఁడే నరునని తోడఁ, బొడుతు నోడుదు ననినఁ బోలుఁ గాక
వినుము సూతతనయ మనబోఁటు లాతని, జెఱుతు మనుట నోరిచేటుగాదె.
చ. నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు ను
గ్రపుబల మేచి తో నడవఁగాఁ [1]జెనుదాడికిఁ బోయి మత్స్యనా
థుపసులఁ బట్టి యద్దొరలతోఁ జెడి పాఱితి కర్ణ యుద్ధ మ
య్యపుబలు పాడి [2]దప్పు మనయుజ్జునమ్ములు దుస్సపన్నవే. 25
ఉ. ముందరియట్లు గాదు జనకోత్తములఁ దెగడెవ్వఁ బోఁటి నేఁడు సం
క్రందననూతి మార్గ్కని తీరం బయి పోరిన దాఁప ప్రాణముల్
నిందకుఁ జాల నిండ ననుగనిక్కువుఁబల్కులు వల్కటోవ్వ దా
నం దుదిఁ జచ్చినం జను మొగ్గనెడ నరుఁ దాకుఁట రిత్తపోవునే. 26
వ. అనవుడు వలుక వోడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కిట్లనియె. 27
చ. నరునకుఁ బూని పల్కతి విశనం జవి మూలినదొడ్డవల్కలే
[3]నరగలి లేక బెట్టదరిగినవ్వాడు నూడుము నన్ను నాతనిం
దిర మయి బాహుశక్తియును ధీరతయుం జెరిపుం జలంబు నె
వ్వరిదెసఁ గాంచె దెక్కడు వారి నుతింపుము మానుమంతకున్. 28
వ. అనుటయు నట్ల చేసెద నని పలికి శల్యుం డూర కుండెఁ దేరు వోని మ్మని రాధేయుండు గఱిమి పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా నడపె నివ్విధంబునం జని మనయున సొచ్చి సైనికులు నంతసిల్ల వారలం గలయం గనుంగొని కర్ణుం డిట్లనియె. 29
సీ. వలను శోభిల్ల నెవ్వాఁడైన పేఁడె యర్జునుఁ డని నాకుఁ జూపెనేనిఁ
బనదనం బే నిచ్చుభంగి యాదరికును, వివరించి చెప్పెద వినుఁడు మీరు
పొగడంగఁ దగురథ్యములతోడిసౌవర్ణ,రథములు వలసిన రమ్యపు లావుఁ
బొలుపును గలుగుకాంభోజహయంబుల, వలసినఁ[4] బేర్చునత్త్వంబునందుఁ
తే. బరిణతము లగుసుందరకరివరముల, వలసినను జారులావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కి, కొక్కడమ్మేటిమగని కేనిచ్చువాఁడ.
క. మఱి యొక్కటి సెప్పెద సిద్ధము కృష్ణులఁ జంపి వారిధనములు నా కి
త్తఱిఁ దద్రథ మిదియే యని, యొఱఁగించినయతని కిత్తు నేనుముదమునన్.
వ. అని పలికి శంఖంబొత్తిన దుర్యోధనుం డనుజనహితంబుగాఁ బ్రమోదంబునొంద

1. గ. వేస దాడిగా: 2. గ. దీవు 3. ఖ. నరవంబు లేక. 4. క. చ. జ. బెక్కు క్రమంబులందు.

నప్పుడు నిస్సాణాదితూర్యనిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె ఘనయోధవరులును
వరూథినియు నుబ్బునం బేర్చి యార్చినవినదంబులు నింగి ముట్టె నయ్యెడం బ్రభాత
భాసురముఖుండై మద్రవిభుండు రాధేయున కిట్లనియె. 32

ఉ. ఎవ్వరు నూఱ నేల నరు ‖ నిప్పుడ కాంచెద రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు ‖ గొం డని యీ వల దిట్టు లిచ్చినన్
నవ్వ జనంబు మిక్కిలి ధనంబులు గల్గినఁ జేయ గాదె నీ
కివ్విధి నైన సద్వ్యయము ‖ [1]లెందు నపాత్రపుటీవి యొప్పునే. 33

వ. అని యంత నిలువక. 34

క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియె దీవు ‖ గంటిమె సింగం
బుల నెత్తఱి నైనను [2]నేఁ, బొలయుననేనియును నక్క ‖ పోరి గెలువఁగన్. 35

ఉ. అగ్ని సారం బెలంచునటు ‖ లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ
కగ్గిది మాను [3]మీపలుకు ‖ లెవ్వరుఁ జెప్పఁగ లేరు యీ పటు
స్ఫూర్తిగఁ గాల మయ్యెనొకో ‖ నావచనంబు లొకింత కర్ణము
లగ్గల నిచ్చి యోధులు బలంబులుఁ దోడు గఁ బోరు [4]టొప్పుగన్. 36

ఆ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుట,కై పెనంగి చెవుల ‖ కప్రియంబు
లైన నిన్నిమాట ‖ లాడితి నాబుద్ధి, విని దురాగ్రహంబు ‖ విడువ వలయు. 37

చ. అనవుడు నగ్గి సూతసుతుఁ ‖ డాతని కిట్లను మద్బలంబు న
మ్మిన నను నిత్తెఱంగునకు ‖ మేకొన కుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబు గా దనినఁ ‖ జొప్పడునే నినుబోఁటి [5]శాస్త్రఁ జె
ప్పిన క్రియఁ జెప్పి నీవు వెఱపించిన నే వెఱ పెక్కువాఁడనే. 38

వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుటకై శల్యుండు మఱియు నిట్లనియె.

తే. ఇప్పుడే నీకు బుద్ధులు ‖ సెప్ప నేల, నరుఁడు గాండీవగుణనిక్వణంబు సెలఁగఁ
గదిసినీమొఱు బలుతూపుగములునిగుడఁ, జేసి నిను బుద్ధిమంతునిఁ ‖ జేయుఁగాక.

వ. అని యంతం దనివోక యుతండు. 41

సీ. రోమమహాటోపభీషణహరితోడ, సమరంబునకు హరిణము గదంగి
దానధారాభీలదంతావళముతోడ, సంగ్రామమునకు శశంబు గడఁగి
చండస్వభావోగ్రపుండరీకముతోడఁ, నాజికి సారమేయంబు గడఁగి
దారుణతుండాతిఘోరగృధ్రముతోడఁ, గలహంబునకు నురగంబు గడఁగి

ఆ. యడరునట్లు గాదె ‖ యస్త్రశౌనముజ్జ్వలుండు పార్థుతోడ ‖ సంగరమున
కీవు గడఁగి యడరు ‖ టెల్ల రాధేయ నీ, కేటిబలము నమ్మి ‖ నెమ్మిఁ గలదు. 43

1. లింతయుపాత్రపుటీవి, అ. ప్ర. 2. క. బెబ్బులిమీఱు మెదురిన నక్కపోరు గెలువఁగన్. 3. అ. మన్నలుకు. 4. క. మెప్పుగన్-గ. మెప్పునన్. 5. అ. శాస్త్రచెప్పిన.

గా నెందుఁ దిరుగుదుము దవ్వైనను భేదంబు లేదు । హంసలు మగుటన్. 58

వ. ఇట్టిమాయందును. 59

క. బలశాలి యైనహంసముఁ, బిలిచితి ఘురుడించి పాఱ । [1]జేలతనమునన్
కలవే యింతకు మును హం,సలతోఁ బురుడించువాయసంబులు జగతిన్. 60

సీ. అనుటయుఁ గాక మి । ట్లను హంసములతోడ, గతులునూటొక్కటి గలవు నాన
నొక్కటొక్కట శతయోజనవ్యాప్తి నే, మెఱయుదుఁ బొదవ్రాగ్రమీఁది కెగసి
చనుట యచ్చటనుండి । చక్క నేలకుఁ జోడు, వట్టి డిగ్గుట నిరాశ్రపాతభంగి
సంగతి పరువడి । చాలులీలాగతి, వక్రయానము వలయక్రమంబు

ఆ. లోను గాఁగ నెట్టు । లైనను మీఁగోరిన,ట్ల పఱచి మేటియైయుంచ యైన
దాని నిపుడ గెలుతుఁ । దక్కటియుంచలు, భయముపొందఁ గాకపదుపుపొంగ.

—కాకము హంసముతో సముద్రముమీఁదఁ బఱచి భంగపడుట—

వ. అనుటయు విని మున్నాహూతం బైనహంసం బక్కాకంబు నాలోకించి. 62

ఆ. నూఱుగతుల నీవు । వాఱు దే నన్నియు, నెఱుఁగఁ బులుఁగు లెల్ల । నెట్లు వాఱు
నదరి యాకసమున । [3]నిడుబాట నట్ల పా,ఱుదము రమ్ము జలధి । చదల ననిన. 63

వ. అయ్యెడం గూడినకాకంబు లవహసించి శతప్రకారగతి యుగుదీనితో నేకయాన పర్యవసానహీనసముత్సాహదోహలి వగునీ వెట్లు మచ్చరించెదవు పఱచి భంగ పడియెదవు గాక యనుటయు నమ్మరాళం బా గమిం బాసి పఱవఁ దొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ. 64

క. రాయంచ మందగతిఁ జను, వాయస మతితీవ్రభంగి । వలను మెఱసి తీ
[4]లాయితము లొప్పబహుగము, నాయానము నొంది పఱచు । నగ్గలికమెయిన్.

ఆ. ఎలమిఁ గడచి పోవుఁ । బిలుచుఁ గ్రమ్మఱి వచ్చు
ముక్కు ముక్కుమీఁద । మోపుఁ జుట్టు
నేచి తిరుగు నీఁక । లీఁకలతో రాయుఁ
నొరయుఁ జిత్రగతుల । మురియు నవ్వు. 66

వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకారప్రసరణచతురం బై సంచరించుటం జూచి ముదితంబు లైనవాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలి గొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుళ్లి త్రుళ్లి యాడుచు మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం డని పెద్దయెలుంగునం బలుకుచుండఁ దదీయకలకలంబాలించి హంసంబు భరితోత్సాహం బై. 67

క. పాదవ్రజనకు నెగసి యొప్పటి, పడమటి దెస నిగిడి పిలుచఁ । బఱచినఁ గూడం

---

1. క. గ. చ. జ. తెలుఁదనమునన్. 2. క. చ. సంగడిఁ బరువిడిఁ 3. క. గ. చ. నిడు బాఱు _ జ. నిడుబాఱు. 4. క. లాయితము లొప్ప.

గడురయమునఁ జని యంచం, [1]గడవం గా[2]కీలుకలచి రథాంగము పాఱున్. 68

వ. పాటి పాటి దయ్యాలయు నయ్యంచ యుగంధరత్వరితగమనకళాదక్షత్వంబు మెఱయం బఱచిన [3]బీటువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యిట్లని వితర్కించు. 69

క. నేరక తోఁ గరితిఁ గాల్కొన, భూరుహములు లతలు గిరులుఁ బొద లేమియు లే వారయ యోగ్యాసన్నమయము, వారిధి డిగినోఁకినపుడ వలయుం బోలియన్.

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి దప్పి సొగసి యవశత నంతకంతకు డిగుచు నున్నయక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె. 71

ఆ. నీ వనేకగతులు నేర్తిది సోగరిఁ, జనుట చెప్పుము వాయసంబ యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడసెద, వెఱక లేటి కొల్లు లెసల విడువ. 72

వ. అనియె నప్పొడు. 73

క. తలకొని జలములు పఱుంబులు దుండను దోఁక సోఁక బోరిఁబోరి నెగయఁగా
బల మఱి మెయి దిగఁబడఁగా, సొలసి మొగయలేక వాయసుఁడు నగఁ దొందెన్.

వ. ఇట్లు మున్మిటినీటివయిం బడి [4]నగ్గలం బగుదురవస్థకు బెగ్గలంబు నొందుకాకంబు నాలోకించి పలుక నగుం గాక పలికినట్లు యెవ్వారికిఁ జేయంగ దీరుఁ బని తీరం గదా యనిన రాయంచకు నక్కాకం బిట్లనియె. 75

క. ఎంగిళులు గుడిచి క్రొవ్వనఁ, బొంగినమొనతోడ గర్వమునఁ దిరుగుచు నా
కుం గలదె యొండు నెదురు వి,హంగమపతినైన గెలుతు నని మును దలఁతున్.

క. నాకోలఁది యిప్పు డెఱిఁగితి, నీకరుణాలోకనంబు నిగిడించి శర
ణ్యా కావు నన్ను మగుడం, గాకులలోఁ గలుపఁ [5]దగవు గాదే నీకున్. 77

వ. అని యెత్తెఱంగున. 78

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ, గా కా యని చంచు [6]దెఱవ గా నఱచుచు నీ
రాకరమున మునిఁగెడున, క్కాకిం గలహంస పరమకారుణ్యమునన్. 79

క. వెరవునఁ దత్తనువుం దన, చరణంబుల నెఱికి యెత్తి చా పుడిచి బల
స్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁ బక్షిపతులు నుతింపన్.

వ. ఇవ్విధంబునం దెచ్చి మొప్పటినెలవున డించి రాయంచ యక్కాకిఁ దప్పిఱిన దానితో నచ్చటికాకులు విన నింక నిట్టియవినయంబు లెన్నండును జేయకు మని పలికి నిజసహచరంబు లగుమరాళంబులుం దానును వలయుచోటికిం జనియె నీవు నాకోమటికొడుకులయెంగిలికూటం బెరిఁగినయక్కాకంబుచందంబునఁ [7]గురుకుమారులయెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు నీకొలఁది యెఱుంగవు దీనం జేటు వాటిల్లెఁగాన కేటవడ నెఱిఁగించెద నాకర్ణింపుము 81

1. క. గడవఁగఁ జనుకినుక కేచి. 2. క. గ. చ. జ. 'కీలుకలచి'. 3. గ. బిట్టు వడి [illegible]
4. గ. యగ్గలం బగుదురవస్థకు బెగ్గడిలునక్కాకంబు. 5. క. దరము గాదే. 6. గ. [illegible]

చ. విరటుని గోవులన్ మరల విల్చి మదంబున నీవు రమ్మనిం
బోరిఁ గొనం బోరుఁ దాఁకి కెట పోయితి నాఁ డలఘోషయాత్రలోఁ
గురుపతి డించి [1]క్రీడి కృపకుం దగుపాత్రము సేసి యొక్కఁడక్
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ నాకు నేర్పడన్. 82

వ. అని వెండియు. 83

చ. పనిపడి జామదగ్న్యుఁడు సభన్ వినిపింపఁడె మీకు నెల్ల న
ర్జునభుజవైభవంబు మధుసూదను పెంపును నాఁడ ద్రోణశాం
తనవులుఁ జెప్పరే బహువిధంబుల వారల గెల్వ రామి [1]మఱ
వినమి యెఱింగియున్ మఱియు పెంచి [2]మాటలు వేయు నేటికిన్. 84

క. ఒంటిమెయిఁ జాఁక నా ముక్కంటికి వశమగునె కృష్ణగాండీవుల ని
ట్లంట యుడిగి తగురథికుల, జంటగొని రణమ్ము సలుపు శత్రులు దలఁకన్. 85

తే. కొంతికొడుకును దేవకీకొడుకు మనము
గనియొదము దినకరనిశాకరులఁ బోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోతవిలసితంబు
తోడి దగుఁ గాక నీపెంపు దోఁపఁ గలదె. 86

వ. అనిన విని కర్ణుండు కమలనాభుని పెంపును బాహుబలిమియు నెఱుంగక యే నేల
వారిఁ దొడరెద నట్లు సెప్పినను దొడరుదుఁ దొడరి వా రొండె నేనొండె నగుదు
నింతియ నీవు వెడమాట లాడక యుండుగు మని పలికి యచ్చటిమహీపతులు విన
నమ్మద్రపతి కిట్లనియె. 87

— కర్ణుఁడు శల్యునితోఁ దనకుఁ గలిగినశాపంబు తెఱంగు సెప్పుట. —

సీ. తలఁచిన నెదకు సంతాపంబుఁ జేయుంగఁ, జాలెడునట్టివి జామదగ్న్య
కోపంబు బ్రాహ్మణశాపంబుఁ గాక యే, నరకు గొందున మురహరుఁ గిరీటిఁ
జెప్పెద విను మస్త్రశిక్షార్థినై మహేం, ద్రనగంబునకు జమదగ్నిసుతునిఁ
గోరిపోయినఁ గృపాంభోరాశి యగునమ్మ, హాముని కులము నన్నడుగుటయును
తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాఁగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ శిక్షించె నలఘుబహువి
ధాస్త్రశస్త్రసంవేదిఁ గా నతఁడు నన్ను. 88

వ. భార్గవాభిధానం బగుమహాస్త్రంబులోనుగా ననేకదివ్యాస్త్రంబు లిచ్చెఁ బదంపడి
బ్రాహ్మం బగునస్త్రంబు నొసంగె నొసంగి సమరంబున నాపత్సమయంబున దీనిం
బ్రయోగింపుమని యానతిచ్చె మఱునాఁడ తపోధనసత్తముండు మదీయాంకతలం

1. క. మీ, వినమి యెఱుంగుదున్. గ. మీ, వినమి యెఱుంగుమన్, 2. క. గ. చ. మాటలు బుద్ధిఁ జెప్పెదన్ _ జ. చెప్పుచున్.

కృష్ణార్జునులకు నేఁ జెఱువ నింద్రయమవరుణకుబేరులు వజ్రదండపాశగదాహస్తులై
బెట్టు ముట్టినను బెదర నని యుండునుఁ దక్కినవారిం జెప్పనేల యిప్పుడు బ్రహ్మా
స్త్రమునుం దోఁచుచున్నది యన్నరుని యీన్నెడకు మనరథంబు నడపుము పుడమి
జనంబులు మదీయకోదండపాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు వందు
చుండు నట్లు సేసెద నమ్మేటిమగని మృత్యునివాసంబు నొందించెద. 94

సీ. కాండమహాతరంగముల వైరుల ముంచు, విజయాంబురాశికి వేల నగుదు
బాణరశ్ములఁ బరిపంథులఁ బొదివెడు, నర్జునాదిత్యున కభ్ర మగుదు
విశిఖోగ్రశిఖల విద్విషుల నేర్చు కిరీటి, ఘోరదావాగ్ని కాసార మగుదుఁ
బ్రదరవేగమున నరాతులఁ గూల్చుపా, ర్థాతివాయువునకు నచల మగుదు

తే. విల్లు వట్టెడువారికి నెల్ల నెక్కు, డనఁగ నెగడినగాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడులఘుప్ర, కారులకు వచ్చునే నాకుఁగాక శల్య.

వ. అనిపలికిన విని యమ్మద్రపతి యేనియుంతరంగంబు గలంగఁ దానర్జునుచేతం జచ్చుట
నిర్ణయించె నెట్లనిన సిట్టియుప్పొంగు జములు దనమీఁదం జాలమి వెట్టకుండుటకుం
గాదె జామదగ్న్యబ్రాహ్మణులశాపంబులు భూపాలుకు విన నుగ్గడించె నిక్కలంక
యే నీరజులానికి నర్జునుగుణవిశేషంబు లెఱింగించి మదంబడంచిన కతంబునం గలి
గెఁ గౌంతేయాగ్రజునకు నా యిచ్చినవరంబు సఫలం బయ్యె నని మనంబునం
దలంచె మనుజేశ్వర వినుమా శల్యుండు సెప్పినయాఖ్యానంబునం జిత్తం బెరియు
చునికిం జేసి యాసూతనందనుం డతనితో మఱియు నిట్లనియె. 96

—✿ కర్ణుఁడు హంసకాకీయోపాఖ్యానము విని కోపించి శల్యుని దూఱుట. ✿—

క. దృష్టాంతము సెప్పెద నని, కష్టాత్మ నిపు నన్నుఁ గాకము నను ను
త్కృష్టమరాళము గాఁగ ని, కృష్టపుఁగథఁ జెప్పి తిది సత్కృత్యము తెలఁగే. 97

ఆ. నీచులకు బలంబు నెట్టన పరుసని, కాఱు లాడుచున్కిఁ గాన యిట్లు
వలికితింతఁ జేసి భయ మయ్యెనే నాకు, నట్టిమాట లింక నాడకుముగు. 98

క. అడిగితినే నిను నాకు, వ్యాడివడులు మెట్టి దని యధ్వారణ నీ వి
ప్పుడు నృపు లెల్లను విన వా, విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్. 99

చ. అనిమొన శత్రులం బొగడు నారయ మూర్ఖత గాదె యిట్టిమ
ర్జునుని సహింతురే పెలుచఁ జంపక సైరణ సేయు కాల మై
నినుఁ దెగఁజూడ నైతి ధరణీపతి కయ్యము పైభరంబునన్
గొనకొని సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్. 100

వ. అని వెండియు. 101

తే. అకుటిలుం డగునాకు నత్యంతకుటిల
వృత్తి సహితంబు సేసెద విత్తెఱంగు

మిత్త్రవంచన మారయ । మైత్త్రి నష్ట
పదకృతోద్భూతి యనియెడు । పలుకు వినవె. 102

క. అను లెట్టిది మిత్త్రవిధం, బని చెప్పుదు రట్టిచంద । మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ, మన మూఱక యుండు నా కనుమంద ప్రీతిన్. 103

క. అను లెట్టిది శత్రువిధం, బని చెప్పుదు రట్టిచంద । మారయఁగా ను
ర్జనుఁడ వగునీకు నాయెడ, వినుము కలిగె దీన మనసు । విచ్చెం గుటిలా. 104

ఉ. కావున నీకు నప్రియముఁ । గౌరవరాజునకుం బ్రియంబునుం
గా విధి మెచ్చ బాహుబల । గర్వ మఖర్వము గాఁగ లక్ష్మికిం
జేవయుఁ గీర్తి కున్నతవి । జృంభణముం గలుగ న్ముకుందగాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గ । డిందిమగంటిమి యుల్లసిల్లఁగన్. 105

వ. అని పలికి మఱియును. 106

తే. భండనంబునఁ బార్థుచేఁ । బడక [1]నేఁడు, మేలుచే యైతినేసియు । మృత్యువునకు
నెన్నఁడును నగపడ నాకు । నివ్విధంబు, నందియము లేక చిత్తంబు । నందుఁ దోచె.

చ. వినుతమహాస్త్రముల్ వఱపి । విక్రమసంపద నాకుఁ జూపున
ర్జునుభుజలీల కోర్చెద వ । సుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు నవార్యమై యెడరు । పుట్టక తక్కిన శల్య చూడుమీ
నను విశిఖావలీవిలస । నంబున నాతని యేవు మాపెదన్. 108

వ. నీకు వెఱపింప నయ్యెడుకొలందివారిని వెఱపింపుము కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని భయంబు గొనుటకుం గాదు కురుపతిసన్నిధి నీవు సారథ్యంబునకుం బూనుచుండి పలికికొన్నబాసకతంబున బ్రదికిపోయి తనిన విని శల్యుండీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి వినుము కర్ణ కర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే యనుటయు నితండు గినుక [2]నెఱనైన కన్నుంగవతోడినవ్వు నవ్వుచు నిట్లను ధృతరాష్ట్రసన్నిధి నుత్తమద్విజులగోష్ఠి సకలదేశాచారవిదుం డైనవృద్ధబ్రాహ్మణుండు సెప్పవింటి బాహ్లికదేశంబునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి నగ్నులై యసంగతదురాలాపంబులతోఁ దిరుగుదు రని తొడంగి యనేకప్రకారంబుల బాహ్లికదేశనిందోపన్యాసంబు సేసె నట్టిబాహ్లికుల కొడయుండవు తత్కృతంబు లగుపుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం జేరు నట్లుంగాక వారియనాచారంబులు వారింపమిం జేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు బాహ్లికులకంటె మద్రదేశజాతు లవినీతు లని యార్యులు సెప్పుదురు నిన్నేమి సెప్పం గల దింతవట్టు నెఱింగి నాలుక యడంచి యుండు మనవుడు నమ్మద్రేశ్వరుండు. 109

క. లావులు [3]రథాతిరథసం, ఖ్యావేళం దెలియఁజెప్పెఁ । గాదే భీష్ముం

1. క. సేను. 2. అ. నెఱనైనకన్నుంగవతో నవ్వుచు. 3. ఆ. రథ్యాతిరథసంఖ్యా.

డావచనమ్ములు మనమున, భావింపుము క్రోధ మేల బలియుఁడ నీకున్. 110

తే. విమతు రాష్ట్రుల బంధుల వెలలు గన్న, నమ్మదురు కులకాంతల నంగదేశ
జనితు లగువారు విభుఁడ వ్యజ్ఞనుల [1]కిట్టు, లేలొకో నొడ్డచరితంబు లెన్న నీకు.

క. పరదోషము సెప్పఁగ నేర్తురు గా కాత్మీయ మైనదోషంబు మదిం
బరికింపఁగ నధములు నేర్తురె తలఁపక యుంటి వలుకరతో నుండకుమీ. 112

వ. అని యుల్లసం బాడి మఱియును. 113

ఆ. సకలదేశములను సన్మార్గవర్తులుఁ, గలరు దుష్టతతియుఁ గలిగి యుండు
మది నెఱుంగ నేర్చు మధ్యస్థు లదియును, నదియు నుగ్గడింతు రెదురు మెచ్చ.

వ. ఒకదేశంబు దాఁగీడ యగుట కలుగునే యట్లుం గాక సదాచారదురాచారంబులు దైవం బెఱింగెడు [2]నీ వనాత్మజ్ఞుండ వూరకుండు మనియె నట్లుభయులు వివాదంబు సేయుట యాలించి చేరి కౌరవపతి సఖభావం బుపన్యసించి రాధేయు రాజత్వ గౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నా సూతనందనుండు నగుచు శల్యు నుద్దేశించి పోద పోద రథమ్ము పో నిమ్ము పో నిమ్మని పలికిన నట్లరిగి శల్యుండు నస్మితుండగుచు వెండియు నర్జును [3]నుగ్గడించి కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబును నై యప్రతిహతమనోరథుం డగునారథికుతోడం బెనంగ నోపితేని నీవ మా కెల్లను రాజవన్నుట నిను గనియరదంబు మన మొగ్గరంబు చిక్కువఱచుట గలుగు నని యెఱుంగ నయ్యెడు మన మేమఱక యుండ వలయు నీ తోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. 115

— శల్యుఁడు కర్ణునితో నప్పుడు దోఁచు నుత్పాతంబులు సెప్పుట. —

క. పఱఁగులు మనచేరువఁ బెల్లఱచుట బెట్టిదురు గాలి యడరుట గ్రద్దల్
తఱచయి యాడుట వికృతివు, టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే. 116

వ. అని వెండియు. 117

ఆ. సిడము కామ నూడు పడఁకేసు మన తేరి, మట్టు మొఱయుఁ గట్టికట్టి దిఱుకి
పడగలందుఁ గంటె వెసలెసు మంట లు, గ్రంబు గాఁగ నొప్పు రణము నేఁడు.

వ. అనియె నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితం బయినధర్మతనయవ్యూహంబు గనుంగొని రథికవరులం దగనయెడల నమర్చి తన మోహారం బాయితంబు సేసికొని యురవడింప నమ్మద్రపతి యత్తెఱఁ యాలోకించి. 119

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబున న్మెఱసి యుద్భటు లైన త్రిగర్తు లేవురో
భిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంపవె
ల్లి నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వొంగ వారలన్. 120

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లనియె సంశప్తక, బలము చేతఁ బొదువఁబడి కిరీటి

1. అ. కొల్ల, నొడ్డచరితంబు లెన్న నీ కుచితమగునె. 2. అ. నీవు నాత్మజ్ఞుండవు. 3. గ. నగ్గించి.

మేఘపిహితుఁ డైన ✽ మిహిరునిచాడ్పున, వాఁడి లేక యున్న ✽ వాఁడు గంటె. 121

వ. అనుటయు శల్యుండు. 122

చ. వరుణుఁడు నీళ్లఁ జేఁ జెడునె ✽ వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే నరుఁడు ✽ వోరుల నేవఱు ఛేల కల్గు నె
వ్వరికిని వానిఁ గీడ్పఱుప ✽ వచ్చునె గాలిఁ బరాభవింపఁగా
[1]దొరకొనినం జలంబుమొయిఁ ✽ దోయధి యంతయుఁ ద్రావ వచ్చినన్. 123

ఆ. దేవతలకు నైన ✽ దేవేంద్రపుత్త్రుని, నాహవమున గెలువ ✽ నలవి గాదు
మనము గెలుతు మిట్టి ✽ మాట లాతనిఁ జేరఁ, జనక యాడి దీన ✽ నంతసింపు. 124

ఉ. మేరువువోలె నొప్పినస ✽ మీరణపుత్త్రుని పేర్మి యుక్ మహో
దారుఁడు ధర్మనందను ను ✽ దాత్తతయుక్ విజయానుజన్ము లే
పారఁగ నున్నసొంపును న ✽ హంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
[2]ల్వీరల మీఱి పొల్పనఁగు ✽ లీలయుఁ జూడుము సూతనందనా. 125

వ. పాండవులు ధర్మపరు లెవ్వలన ధర్మంబు గలుగు నవ్వలనికి జయంబు గలుగుట దప్పదనునమయంబున నంత ప్రతికూలంబుగ నుంగొని మనసైన్యంబునుసవ్యసాచిం జూచి వారిసేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన గంగాయమునలసంపాతంబుచందంబు దోఁచె నట్టియెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగురాజులను సాదరావలోకంబున నంభావించి యిట్లనియె. 126

ఆ. ఎద్ది ప్రియము సేయు ✽ నేపారుశూరుల
చిత్తములకు నది యు ✽ దాత్తభంగి
నొదవె మీకు బాహు ✽ మదమునఁ గొనియాడు
డుగ్రశౌర్యమహిమ ✽ యుల్లసిల్ల. 127

క. బలు పెనఁగఁ బాండుపుత్త్రులఁ, బొలియించిన నతులరాజ్య ✽ భోగంబును వా
రలచేతం బొలిసిన నుజ్జ్వలనాకసుఖంబుఁ గలుగు ✽ వ్రాలుఁడు పోరన్. 128

వ. అనిన వార లందఱు నుబ్బి సింహనాదంబులు సేయఁ దూర్యనినదంబులు సెలంగ సైన్యంబులు నంతనంబునం బొదలె నప్పు డశ్వత్థామ రథికజనంబులమనంబులం బ్రమదం బెసంగ ని ట్లనియె. 129

క. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగురు మీరు సూడఁ ✽ జంపినకష్టా
పాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియ కాని తొడిన ✽ వమటు వై నూడ్పన్.

క. కడువడి వడముడియును గ,వ్వడియు నతనిఁ గావఁ బూని ✽ వచ్చిరయేనిం
జెడుదురు మచ్చాపంబున, వెడలువివిధవిశిఖశిఖల ✽ వేఁడిమిచేతన్. 131

చ. అన విని యవ్వరిష్ఠరథి ✽ కావలి పెల్లుగఁ బాండుపుత్త్రయో
ధనులవయిఁ జెనం గవియు ✽ దర్పము వార లుదగ్రవృత్తి మా

1. అ. దొరకొనునే జలం...ద్రావ వచ్చునే. 2. అ. ల్వీరుల

ర్కానిసమమహోగ్రభంగియును ‡ ఘోరవృలీలల విస్మయంబొన
ర్చ ననిమిషాంతరంగములఁ ‡ జెల్లె రణంబు సుదీర్ణరౌద్రమై. 132

కం. జనసంక్షయంబు వెల్లే, మనవచ్చుం బ్రళయకాల ‡ మయ్యెనొ కా కిం
దును నిట్టిది గలవే యని, మనమునఁ దలపోయ వలసె ‡ మముబోఁటులకున్.

వ. అట్టియెడ. 134

ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి యప్సరో
వ్రాతము గంధపుష్పపరివర్షణ కేళియొనర్ప సౌరభం
బాతతి సంచరించు లలి‡తానిలుఁ డక్కడు సేసి వీచె నం
జాత నవీన ఘర్మజల‡జాలక సైనిక ఫాలసీయుఁ డై. 135

ఉ. ఆ సమయంబునం గురుకు‡లాగ్రణి భీమునిఁ దాఁకె వైరిసం
త్రాసనమత్తవారణ‡కదంబసముద్భటుఁడై యతండునుం
జేసె రణంబు దర్పిబల‡సేన దలంకెనునట్లుగా సము
ద్భాసితదుర్నివార్యబహు‡బాణవిసారణదారుణోద్ధతిన్. 136

కం. పదపడి రాధేయుం డున్మదవృత్తిఁ గవిసె గుణని‡నాదంబును బె
ట్టిద మగురథనిస్వనముం, జదల నిగుడఁ బాండవాగ్ర‡జన్ముని దెసకున్. 137

వ. ఇట్లు గవిసిన మన సైనికు లిట్లని రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన
నరుండు వచ్చి యుద్ధంబు సొచ్చునపుడు. 138

చ. నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతిఘోరభంగి నం
దరయ నితండు గి టడఁచు ‡ నాతని నన్నటు లున్నవాఁడు దు
ర్భరరిపుబాధ దక్కి కురు‡రాజు సుఖిత్వముఁ బొందు నిప్డు రం
డరదము సేరి యీతనిమహా‡స్త్రవిలాసము చూత మేర్పడన్. 139

కం. గెలు పెల్ల భంగి నితనికిఁ, గలుగు ననుతలంపు పుట్టఁ ‡ గా నిపుడు మనం
బుల జనియించు మనోరథ, ములవడుటయుఁ బోర నెఱుఁగ‡న య్యెడు నదియున్.

వ. అనుచుఁ గూడుకొని రథకరితురగసమ్మర్దనిర్దళితభూభాగంబుగా నురవడింప రాధే
యుం డతిభీషణం బగురణంబున. 141

తే. మిగిలి యప్పాండవాగ్ర‡జు మగఁటిమియును
బలముఁ గోల్పుచ్చి తూలఁ బోఁ ‡ బలికి పొలిసె
నధిప యతనికి వీఁక మై ‡ నడ్డపడఁగఁ
గడఁగునద్దెస యోధుల‡గర్వ మడఁచి. 142

— కర్ణుఁడు ధర్మజుపైఁ గవిసి విజృంభించుట. —

వ. అనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియెఁ గర్ణుండు దనపూన్న మెట్లాయి
తంబు సేసెఁ గౌంతేయముఖ్యసైన్యసన్నాహంబు బెట్టిదతం దతనింబొదివినయప్పుడు
గప్పడి యెవ్వలనుండె నవ్వీరుం డన్నకడనున్న నాసూతనందనునకట్లు సేయువకం

బగునే వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని యన్నరునిపై వచ్చి ఖాండ
వంబు గాల్చ కుండఁ గావం జాలెనే బ్రదుకున కానవసుమగల కతని మూర్కొన
వచ్చునే రాధేయునకు వచ్చుం గాక యనుటయు. 143

తే. ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు
సంగరతిమోహరంబు తెఱంగు ధర్మ
సుతునియోద్ధృవిధంబు నర్జునుఁడు వారి
పోరునెడ లేమియును మీఁదిపోరు వినుము. 144

వ. కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు వలవట శకునియు నులూకుం
డును గుఱ్ఱపుదళంబులతో వారికెలనను సంశప్తకగణం బిరువదినాలుగువేలు
ముఖ్యరథంబు లగ్గలిక నుల్లసిల్లి దాపటను నీకొనుకులందుఁ గొందఱు కాంభోజ
శకయవనసైన్యసమేతంబుగా వారియువులను బాహుబలభాసితుం డై దుశ్శాస
నుండు వెనుకనుం గతిపయసోదరపరివృతుం డై కురురాజు పిఱుందను నశ్వ
త్థామప్రముఖయోధులు గరినికరకృతసన్నాహులై యన్నరపతి నియోగింప
నతనిపజ్జ నిలువ నిజపుత్త్రులుఁ దనచుట్టునుం గదిసి యొసక మొనఁగుబరపనంబున
మెఱయ సూతిసూనుండు సేనాముఖంబునకుం దిలకం బై నిలిచి పొలిచె నట్లు
మోహరించి మదకలమాతంగంబులతిఱుచుకతంబున మొయిళ్ళమొత్తంబుల
కైవడిం గాఱుకొనున మ్మొనసురవసి నడపించునాకర్ణునిం గనుంగొని కౌంతేయా
గ్రజుండు గాండీవి రావించి యిట్లనియె. 145

ఉ. సూతతనూజమోహరము సూచితె యొంతయు గట్టి యై సము
ద్ద్యోతితభంగిఁ దోఁచె నది యుక్కునఁ బై పడి యిబ్బలంబు ని
ర్ధూతము సేయ కుండఁగ నెదుర్కొని యెమ్మెయి నిల్వరింత మ
న్నీతి విధింపుమా బలువు నేర్పును దద్జ్ఞులు పిచ్చలింపఁగన్. 146

వ. అనుటయు సంక్రందననందనుండు. 147

తే. సారవంత మై కర్ణునిసైన్య మురవ
ణించుఁ గా కేమి దీనికి నృపవరేణ్య
పూని సేయంగ వలయుఁ బ్రధానకార్య
మతని నమయించుటయ నాకు నది భరంబె. 148

వ. అనిన విని యమ్మనుజపతి యతని కిట్లను నట్లేని నీవు రాధేయుని గెలువుము
భీమసేనుండు సుయోధనుని నకులుండు వృషసేనుని సహదేవుండు సౌబలుని
శతానీకుండు దుశ్శాసనుని సాత్యకి గృతవర్మను ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్త్రుని
ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటిధార్తరాష్ట్రులం దలఁపడువా రేను
గృపునితోడం బెనంగెద ననుటయు నట్ల కాక యని యతండు మున్ను దననిలి

చిననెలవునకుం జనునెడ నయ్యుధిష్ఠిరుపనుపు తెలుఁగు వార లందఱకు సెఱిం
గించె నతండు వలపటివలన సైన్యాగ్రవర్తి యయ్యెను వృకోదరుండు వామ
పార్శ్వవర్తి యయ్యెను శైనేయద్రౌపదేయసమేతంబుగా నప్పాండవాగ్రజుండు
మధ్యభాగస్థుం డయ్యె నన్నయమ్మోహరంబుఁ గా సూతనందను మొనయురవణి
సరకుగొనక మార్కొనియె ననవుడు నాంబికేయుండు. 149

మ. నరుఁ డప్పైం విని వచ్చె నన్నరునకు న్నంశప్తకశ్రేణికి
న్దుర మత్యుద్భటభంగిఁ జెల్లుటయు ము న్నాఁచించి తీ వయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిన్ రణాం
బరయుం జిత్రము సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా. 150

వ. అని యడిగిన సంజయుం డమ్మానవపతి కిట్లను నట్లు ధర్మజుండు సెప్పిన కాని యయ్యిరువాఁగుం గదిసినప్పు డన్నియమంబు నడవక [1]కయ్యంపుటౌచిత్యంబున నొండుదెఱంగు సెల్లె నది యెఱింగించెద నవధరింపు మవ్విధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొనుసమయంబున సవ్యసాచి గర్జనడచుచక్కటికి నదరం గడంగినఁ గ్రాలుకపికేతనంబు గనుంగొని తెంపు పెంపునఁ బొంపిరి వోవుచుఁ ద్రిగర్తాదిసంశప్తకులు సరభసంబుగా నడ్డపడి పైకొని తఱిమి పొంగినపయోనిధిం బోలిన నబ్బలియుండు సెలియలికట్టం బోలి నిలువరించి మాతంగప్రముఖసేనాంగసకలాంగకశకలంబుల నిలాతలంబు గప్పుచుండ నొండొండ పేర్చి యాబలం బా బలమర్దననందనువరదంబు ముంచికొనిన నవ్వీరుండు విజృంభితవిక్రముం డై బడబాగ్నికీలాకలాపంబు చందం బగుసాయకనికాయంబు నిడిగించుచు నెక్కుడుమదంబున నమ్మూఁకలం ద్రెక్కొను చుండఁ దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుండు. 151

ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటు లైనత్రిగర్తు లేవు రో
ఖిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంపపె
న్వెల్లి నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వోఁగ వారలన్. 152

వ. అని చెప్పి చూపెఁ బదంపడి భారద్వాజపుత్త్రునిబిరవసంపుమూటల నాటోపంబు మిగిలి మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని. యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద. 153

సీ. కృపుఁడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ
జెలఁగుమూఁకలతోడఁ బెలుచఁ గవిసి
కాశ కైకయ మాత్స్య కౌసల పాంచ్యాది
బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ

---

1. క. చ. జ. 'కయ్యంపుటుచితంబున'.

నారెండువాఁగుల ¤ నాయుధంబుల[1] యొడ
మంటలుఁ బొల్లును ¤ మింటఁ బుడమిఁ
జూడ నక్కజముగ ¤ శోణిత[2]ధామము
ప్రచురధూళీతిమిరముల నడఁప

తే. భగ్నరథములు నిపతితేభములు నిహత
హయములును మృతభటులును ¤ రయమునకు వి
ఘాతి యొనరింప నున్మదగమనభంగు
లందు బలువెర వొలయఁ బోరాడి రధిప. 154

వ. ఆలోన. 155

—కర్ణుఁడు పాంచాలకుమారుల ననేకులం జంపుట.—

ఉ. మేలిమదావళంబులును ¤ మేటిహయంబులుఁ దమ్మపింపు నా
ఖీలతఁ జుట్టి రాఁగ రథబృందములోఁ గురురాజు కర్ణుడో
ర్లీలకుఁ దోడ్పడం గడఁగె ¤ రేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె ¤ శౌర్యసముద్భటబాహువీర్యుఁడై. 156

వ. అబ్బలంబునకు బాసటయై చేదిసైన్యంబును వెనుఁబ్రాపై పాండవానీకంబునుం దఱిమినఁ బెఱిఁగినదర్పంబునం బ్రదీప్తుండయి యక్కర్ణుం డాగట్టిమూఁకలం దఱిసి మెఱుంగువాలమ్ములు వఱప నవి పేసుంగుపెంట లగుచుండ నుఱక యుక్కునం బొదివినబలుముగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి తమవారి కింపెఁ బ్రమోదభరితులం జేయుచు సాయకాసారంబులు వఱఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల నాసేనలును గృపకృతవర్మాదియోధబృందంబులతో వెనంగు మొనలును నొక్కటిగాఁ గలంచి యందు శోణితజలంబులను మాంసమజ్జామస్తిష్కకర్దమంబులను బఱితాతపత్రహంసంబులనుం బొలుచునట్టినదీప్రవాహంబులు వఱపె ననుటయు ధృతరాష్ట్రుండు ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి రక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి రనుటయు సంజయుం డవ్విభున కి ట్లనియె. 157

తే. ఇవ్విధంబున సేనలు గ్రొవ్వడంచి
నూతనూనుండు ధర్మజు ¤ కేతనంబు
వెనుక నడర ధృష్టద్యుమ్నుఁ ¤ డెనక పెనఁగ
బంధులును దాను వడి నడ్డపడియె నధిప. 158

క. వారలఁ గడచి ప్రభద్రకు, లారాధేయుపయిఁ గవిసి ¤ నాతండు మహో
దారుల నేన్నూర భద్రా,కారుల నారాచవ్రాతకంబునఁ గూల్చెన్. 159

క. కని పాంచాలురు గోపం,బును దర్పము నెఱయ మొఱయఁ ¤ బొదివిన రాధా

1. క. గ. ఛ. యొఱమంటలుఁ బొగలును. 2. క. గ. చ. ధారలు.

తనయుం డిరువదియేవురఁ, దునిమె నిరువదేను వాఁడితూపులఁ బెలుచన్. 160

క. వెండియు నేపునఁ బైకొని, చండశరప్రకరములు వెసనం గురియఁగ ను
ద్దండతఁ బాంచాలురఁ గ,ర్ణుం డేవురఁ జంపె నైదుక్రూరాస్త్రములన్. 161

వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి యాటోపదీపితుండయి చక్రరక్షకు లగుసుషేణసత్యసేనులును వెనుక బలసివచ్చువృషసేనుండు నిమ్మువ్వురుగొడుకులఁ గడిమి రూఢి కెక్కం దనకు రణక్రీడకుం దోడుపడియెడు నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం బాండవబలంబులం గలంచు నయ్యంగపతిమీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖపాంచాలకుమారులును సాత్యకినకుల సహదేవద్రౌపదేయులును గేకయమాత్స్యయోధవీరవ్రాతంబును భీమసేనపురస్సరంబుగాఁ దోఁతెంచిన బహుళజలధరంబులు ధరణీధరంబుపయిం గురియు పెనువానచందంబు దోఁప వివిధాస్త్రశస్త్రంబు లతనిపయిం దొరఁగింపం గనుంగొని కౌరవేశ్వరుండు దుశ్శాసనశకునిదీయతనయులు దనకెలంకులం దఱుముం గరిఘటలతోడం గడంగి యవ్వడముడిని మార్కొని. 162

క. తానును వారును దూపుల, వాన పయిం గురియ నతఁడు వారించి గళ
ద్దానాంబులోలమధుకర, మైనగజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్. 163

క. బొదివెడునప్పుడు శౌర్యో, న్మదుఁ డగు నయ్యనిలతనయుమార్గణములు బె
ట్టిదముగఁ గవియుడు నోటటి, యెదురుపలే రైరి కురుకులేంద్రుఁడు వారున్.

మ. బలుగాలిన్ నలుదిక్కులం జెదరునభ్రశ్రేణి[1]మాడ్కిన్ సము
జ్జ్వలసూర్యాంశులచేత విచ్చునిబిడధ్వాంతంబు చందంబుఁ జూ
డ్కులకుం దోఁచెఁ బ్రచండసంగరపటిష్ఠుం డైన యాభీముతూ
పులమొత్తం బడరం గరిప్రకర ముస్సాభార్తమై తూలినన్. 165

వ. అట్టియెడం గృపప్రముఖరథికులు రాధానందనభవన్నందనులకుం దలకడచి పవననందనుపార్శ్వంబులం దఱుముధృష్టద్యుమ్నాదియోధులం దలపడిరి దుశ్శాసనప్రభృతులును వారిం గూడికొనిరి కర్ణనందను లక్కుమారమర్దనుం దాఁకి రందు సుషేణుండు. 166

క. ఖరభల్లంబున నాతని, శరాసనము ద్రుంచి నారసములు రయము మై
నురమున నేడు సొనిపి ని,ష్ఠురనినదం బెసఁగ నార్చె సురలు నుతింపన్. 167

భీమసేనుఁడు కర్ణనందనుఁ డగుసత్యసేనుం జంపి విజృంభించుట.

సీ. కవలి రెండొకవిల్లు గొని కీచకాంతకుఁ, డక్కుమారునిచాపయష్టి విఱుగ
నేసి మై బల్దావు లీరేడు నాటించి, తన్నప్పు డొడరురాధాతనూజు
నుబ్బువాలమ్ములు డెబ్బదిమూఁట వారించి తత్సుతుఁడు దోర్బల మెఱయఁ
జేరిన నా సత్యసేనురథ్యంబుల, సూతుఁ గార్ముకమును గేతనంబు

1. 'మాడ్కిన్' అనియు వ్రా. ప్ర.

తే. నేమమూపులఁ దునుమాడి యేఁచి మూఁడు
నారసము లంగమున గ్రుచ్చి నాళమునకు
వికసితాంభోరుహముఁ బాపు పెరవు దోఁపఁ
దునిమె వెసఁ గత్తివాతియమ్మున శిరంబు. 168

వ. తునిమి దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కటిరథికజనంబులవియు నదరి [1]కృపకృతవర్మాదిరథికవరులకోదండంబులు దుండంబులు సేసి వారిం గ్రూరమార్గణంబుల మర్దించి దుశ్శాసనుని సాయకత్రయంబునను సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను స్రుక్కించి యులూకుని నతనితమ్ముని నొక్కొక్కమ్మున విరథులం గావించి కర్ణుకొడుకుం గని యోరిసుషేణా పొలిసితి పొమ్మనుచు బలునారసంబు నిగిడించిన నది నడుమన కర్ణుండు నఱకె మెఱుంగుటమ్ములు మూఁడు మేనం బఱప నుఱక మఱియు నట్టిమార్గణం బక్కుమారు నుపలక్షించి యేసిన నాసూతనందనుం డదియునుం ద్రుంచి యవ్వడముడిమీఁదఁ ద్రిసప్తతి నప్ప్రదరంబులు వరఁగించె నప్పుడు నకులుండు గవిసిన. 169

ఆ. చిత్రచాపముక్తశితశరపంచక,హతశరీరుఁ జేసె నాసుషేణుఁ
డేచి నకులుఁ డతని నిరువదియమ్ముల, నొంచి కర్ణుమనము నొవ్వ నార్చె.

చ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిదిదొడ్డవాఁడితూ
పులు మెయిఁ జొన్పి విల్ దునిమి పొంగిన నొండొకదీప్తచాప ము
గ్గలికఁ దలిర్ప నెత్తి వెసఁ గార్ముకదండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్. 171

ఆ. అన్యచాపలసితహస్తుఁ డై కడఁగి సు,షేణుఁ డతనిషష్టిబాణగాఢ
నిహతదేహుఁ జేసె సహదేవుఁ డదరిన, మేటితూపు లేడు మేనఁ గ్రుచ్చె.

క. అయ్యిరువుర యబ్బాలుని, కయ్యము నమరదైత్యరణముకరణి మహోగ్రం
బయ్యె వృషసేనుఁ డత్తఱి, నియ్యని సాత్యకి నెదిర్చె నిషుచయ మడరన్.

సీ. సాత్యకి వృషసేను సప్తసప్తతిమార్గ,ణంబులఁ బొదివి బాణత్రయంబు
సూతుమైఁ బఱపిన నాతఁ డాతనిపెనుఁ,[2]గడఁక వాలికయమ్ము గాఁడనేయ
గోపించి మూఁడుబద్లూపుల సారథి, నొకభల్లమున విల్లు నుజ్జ్వలాస్త్ర
సప్తకనిహతి నశ్వంబుల నేకకాం,డమ్మూర్తిఁ గేతుదండంబుఁ దునిమి

ఆ. శినివరుండు వత్సమున్న మూఁడుశరములు, నాటఁ బొగసి కర్ణునందనుండు
దెలిసి కనలి వాలుఁ బలకయుఁ గొని తేరు, [3]డిగ్గ నవియు నతఁడు నుగ్గుసేసె

వ. ఇవ్విధంబున విరథుండును నిరాయుధుండును నగునక్కుమారుం గనుంగొని దుశ్శాసనుండు రయంబున నెయిది నిజరథంబుమీఁదికిం దిగిచికొని తొలంగం గొనిపోయిన నతండు వేఱొక్కయరదం బెక్కి యెప్పటియట్ల తండ్రి తేరివెనుక వర్తించె నయ్యంగపతి దొమ్మిదియమ్ముల నదరించి శైనేయుసూతాశ్వచాపంబులు

1. క.గ.ఛ. కృపకృతవర్మలకోదం. 2. గ. గడఁక వాలమ్మున. 3. అ. డిగ్గి కవియ నవియుఁనుగ్గు

రూపడంచి యతనిఫాలమ్మున మూఁడువాలికయమ్ములు నాటించె నానర్త్యక
నందనుం డన్యస్యందనారూఢుం డయి కవిసి కర్ణునకుఁ దోడువచ్చుబలంబులం
గలంచి యతనితనువున నేఁనునారసంబులు నిగిడించెఁ గూడికొని శతానీకుం
డన్నియశరంబు లేసె నప్పు డురవడించి శక్రటిద్రావదేయులు డెబ్బదిమూఁ
డును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం బదిపదియు భీమసేనుం డఱువదినాల్గును
సహదేవుం డేఁను నకులుండు ముప్పదియును [1](యుయుధానుం డేఁను) బాండ
వాగ్రజుండు నూఱును బాణంబు లానూతపుత్త్రుపయి గుప్పించి నొప్పించిన.

క. మదమున నతఁ డందఱఁ బది,పదితూఁపుల నేపడంచి బహువిధగతులం
దదనీకంబునఁ దేరొ,ప్పిదముగ వడి సంచరింపఁ బెద్దయు మెఱసెన్. 176

శా. శైనేయుండును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడున్ ద్రౌపదీ
సూనుల్ ము న్నుఢరంగఁ గట్టి విశిఖస్తోమంబు లొక్కుమ్మడిన్
మేనన్ గ్రువ్వ శిఖండియున్ భుజబలోద్యన్మేషంబు సూపన్ వెసం
దా నయ్యోధుల నూతిసూతి [2]విరథవ్యస్తుబులం జేసినన్. 177

వ. వియచ్చరులు వెఱఁ గందిరి వెండియు నవ్వీరుండు వారల నందఱ నస్త్రధారలం
బొదువుచు నెడ్డెఱం బెఱవారిని బాణాంధకారంబునం గప్పినం ద్రిప్పికొనియును
దొలంగియుఁ దరలియు మరలియు నారథికసంఘంబు దైన్యంబు నొందె నంత
ధర్మనందనుని బాధింపఁ [3]దలం పెయ్యిన. 178

క. ఆ రాధేయుం డాతని,పై రయమునఁ గవియుఘోరభంగిఁ గని మహో
దారంబుగఁ జేదిబలము, బోరన నడసొచ్చెఁ బార్థ్యములు మొరయంగన్.

ఉ. నూతితినూఱఁ డబ్బలము సొచ్చి శతత్రయయోధవీరులం
జేతులతీఁట వో నుఱుము సేసి పిశృంఖలదర్పమర్దముం
దైతియుమంగఁ గల్పెరథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం
బ్రీతునిఁ జేయుచుం గడిమిఁ బేర్చిరి సాత్యకియున్ శిఖండియున్. 180

క. వారికిఁ దోడ్పడ యక్కడి,విరులు గొందఱు గడంగి వివిధోగ్రశరా
సారము లంగాధీశ్వరు,పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్. 181

క. కురుపతియోధులును స,త్వరులై యా రథికవరులఁ దాఁకి భుజావి
స్ఫురణము సూపిన నద్భుత,కర మయ్యెఁ దదవసరంబుదగ్ర్యం బధిపా. 182

వ. ఆ సంకులసమరంబునందు. 183

శా. బాణజ్వాలలు బెట్టు పర్వ గగనప్రక్షోభణజ్వాలతా
క్షాణస్ఫూర్తి ఘటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రతి వైరిసైన్యవనభస్మీభావనిర్వాహపా
రీణం బై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే మెచ్చఁగన్. 184

1. ఇది ప్రాచీనప్రతుల లేదు. 2. అ. విరథవ్యస్తాంగులం. 3. క. జ. దలఁ పెత్తి.

వ. అమ్మహోగ్ర విజృంభణంబున. 185

క. ఆటోప¹ మడఁగి యచ్చటి, మేటిమగలు తెచ్చవడిరి ²మొయిగలి కర్ణుం
డేటులవిరిఁ గవిసె ధను, ర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజుఁ బెలుచన్. 186

వ. ఇత్తెఱంగునం గవిసిన నతనిమీఁద నమ్మేదినీనాయకుండు సాయకజాలంబులు పరఁగించిన నతం డుఱక యతిరయంబున నవి వారించి. 187

సీ. నవ్వుచుఁ జాపంబు నడిమికిఁ ద్రుంచి మె, ఱుఁగువుఁ దొంబదిశితమార్గణముల
భేదింప రత్నప్రభాదీప్త మగునది, సౌదామనీచారుజలద మంబు
జాప్తునితనువున గడ్డనై యుండి వా, తాహతం బై పాయునట్టువోలెఁ
బడుటయు మణిమయాభరణసుందరమైన, యతనిగాత్రము నతారాంబరంబుఁ
తే. తోలి యప్పుడ యానూత్రపుత్రిచేత, రక్తమయ మైనపల్లవోద్రిక్తకల్ప
తరువుచందంబు నొందె నతండు రాజ, ధర్మమూఁది చలింప కదల్పెనధిప. 188

వ. ఇట్లదల్చుచు. 189

క. చదల మెఱుంగులు పర్వం, గొదనుపిడుగునట్లు నిగుడఁ గుంతీసుతుఁ డు
బ్బు దలిర్ప శక్తి వైచిన, నది కర్ణుఁడు నష్టభల్లహతి నడఁ దునిమెన్. 190

సీ. పాండవాగ్రజుఁడు దర్పంబును వేగంబు, నొప్ప నవ్వీరునియురమునందుఁ
గరముల ఫాలభాగంబున నాల్గుతో, మరములు సొనిపి నెత్తురులు వఱపి
యార్చినఁ బేర్చినయుగ్గలికంబున, నానూతనందనుఁ డతనిసూతుఁ
జంపి కేతువుఁ ద్రుంచి శాతశరంబుల, నంగంబు నొప్పించె నపుడు పార్థ
తే. కియు శిఖండియు నెడసొచ్చి రయము బలువు
మెఱయు రాధాతనూజునిమేన నమ్ము
లొక్కమొగి నింప నయ్యోధుఁ డుఱక వారి
విరథులుగఁ జేసి విండులు విఱుగ నేసి. 191

క. తనువులఁ బటుబాణంబులు, నినిచి వెగడుపఱచి కడచి నిరతిశయరయం
బునఁ గదిసి ధర్మనందను, ననేకసాయకపరిక్షతాంగుం జేసెన్. 192

వ. ఇవ్విధంబున రాధేయుండు నొప్పించినం దదీయసంరంభంబు సైరింపం జాలక యమ్మహీపతి హతసారథికం బగురథంబు దొలంగం దోలుకొని పోయినం దోడన తవిలి నిలువరించి హాసభాసితుం డగుచు నయ్యంగపతి యతనితో నిట్లనియె. 193

—•• కర్ణుండు ధర్మరాజు నొప్పించి యవమానించుట. ••—

సీ. క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ, మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి
నట్టినీ ³కిట్టిమహాహవమునఁ బ్రాణ, ములు డాఁచికొన శాత్రవులకుఁ దొలఁగి
పోవుట దగునె నీబుద్ధి గావఁగ నయ్యె, నృపనీతి యెఱుఁగవుఁ నీవు బ్రాహ్మ

1. గ. ముడిగియక్కడి. 2. క. మేగలి. జ. మేగరి. ఇట చూడు కర్ణ. ౧. ఆ. ౧౧౩. పద్య. మైగలి దుష్పేమఁడుప్. 3. క. గ. చ. కిట్టు మహా.

ణాచారవేదివి యాగాధ్యయనముల, వర్తింపు కయ్యంబు వలవ దుడుగు
తే. మింక ననుఁబోటిఁ దొడరిన క్కనింతకంటె, నెడరు వాటిల్లు వేగ పొమ్మింటికడకు
వారియుఁ బార్థుఁడు నున్నెడకైన నరుగు, మేను దెగ నీదుప్రాణాన కింత నిజము.

వ. అని పలికి గొంతివచనంబులు మనంబున నునికిం జేసి వధియింప నొల్లనివాఁడై యప్పాండవాగ్రజు విడిచి యా పురుషసత్తముండు తదీయ సేనాసముదయంబు నానాస్త్రనిహతంబు సేసె లజ్జాకులమానసుం డగునమ్మానవపతియును దత్ప్రదేశంబున నిలువక తొలంగి పోయెం బోవుటయు. 195

క. విను మతనియోధజనములు, మొనయుఁ దిరిగి నట్లు సమరమున విముఖం బై
చనునబ్బలముం గని వెను, కొనియెం ¹గర్ణుండు నీదుకొడుకులుఁ దానున్. 196

క. పటుసింహనాదతూర్య, త్కటరవగుణనిస్వనములు గలసి యఖలది
క్తటధారణకేళిసము, ద్భటము లగుచుఁ గురుబలమునఁ బరఁగె నరేంద్రా. 197

ఉ. ఇమ్మెయి సూతనందనుని రయోద్ధతి గోడిన యోధవీరసం
ఘమ్ములఁ బాండవాగ్రజుఁడు గన్గొని పేర్కొని పేరెలుంగున
న్గ్రమ్మఱ నెంచు కౌరవనిశాయముగర్వ మడంపుఁ డన్న ధై
ర్యమ్ము మిగుల్చి కొత్తవే తిరిగి రారథికుల్ మరలెన్ బలంబులున్. 198

వ. ఇవ్విధంబున వృకోదరపురస్సరంబుగాఁ బాండవబలంబులు మార్కొనినమన మూఁకలుం గూడికొని తిరం బై ¹త్రోచి తలఁపడుటయు నయ్యిరువాఁగునందు.

మ. కరిబృందంబులు ద్రెళ్లఁ బెల్లుగఁ దురంగస్తోమముల్ పెక్కు గూ
లె రథానీకము లగ్గలంబు గెడసెన్ లెక్కింపఁ బెక్కైనకా
ల్వరమొత్తంబులు రూపడంగె సిడముల్ లున్నగ్గమ్యైన నెల్లలన్
తురువెల్లెన్ మునిఁగెన్ మరుత్త్వచరపంక్తుల్ వెక్కసం బందఁగన్. 200

వ. అట్టినందడిగయ్యంబున భీమసేనుండును శైనేయుండును బెట్టిదంపుటురవడిం గవిసిన ధృష్టద్యుమ్నాదిరథికప్రకరంబును బరవసంబు సేయం గురుబలంబు వెఱచఱచి పఱచినఁ గర్ణుం డదల్చి కరతలంబెత్తి నిలునిలుమని పలికిన నమ్మహారంబు నిలువ దయ్యె నవష్టంభవిజృంభితుండైన యాసూతసూనుండు పెండియుం గౌరవుల ²వేఱు వేఱ పురికొల్పి మరల్చిన నమ్మొనయును మొగకట్టి నిలిచె నంతం బవమానసూనుండును మార్కొన నగ్గలించె నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తి స్యందనం బెక్కియున్న తమయన్న వలను సాత్యకిధృష్టద్యుమ్నులకుం జూపి వారలతో నిట్లనియె.

ఉ. ఈతఁడు దుర్దశం బొరసె నేను గనుంగొనఁ గర్ణుఁ డేచి దు
ర్నీతిపరున్ సుయోధనునిఁ బ్రీతునిఁ జేయుటకై కడంగె మీ
చేతికి నిచ్చి ³యిట్లురువు సేసెద నిమ్మరనాథు నాకు నా

---

1. క. తోడంబడుటయు. 2. గ. పేరువాటి_క. చ. వేఱువేఱం. 3. అ. యుల్లడమ్ము; క.శ. యుల్లె వు:— ఇది 'యుల్లటవు' అని యుండనోపు.

సూతతనూభవుఁ డమయుఁ జూడక పోదు విషాద మెమ్మెయిన్. 202

క. ఏ నొండె నతనిచే నా,చే నొండె నతండు దెగుట సిద్ధముగ మదిం
బూని కడంగెద మీరీ,భూనాథునిఁ గాచికొనియు పోరు నడపుఁడీ. 203

చ. అని పటుసింహనాదమున నంబరమున్ బగిలించి తేరు క
ర్ణుని దెసఁ బోవ నిచ్చినఁ గనుంగొని శల్యుఁడు కర్ణుతోడ ని
ట్లను మనమీఁద వచ్చు ననిలాత్మజుఁ జూచితె యంతరంగ మే
ర్పునలుక తామసం [1]బిడఁగఁ జూచినచందము గాన నయ్యెడున్. 204

చ. అలిగిన మూఁడులోకముల నైనను జీరికిఁ జేకొనం డితం
డలఘుపరాక్రమస్ఫురణుఁ డగ్రజసూనుఁడు నాత్మపుత్త్రుఁడుం
బొలిసిన కాని కోపమునఁ బొంగఁడు [2]నాఁడును నాఁడు నింత దో
ర్బలమును శౌర్యసారముఁ దిరం బయి చూపఁడు మెచ్చఁ జూపుమీ. 205

చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కిట్లను నట్టివాఁడ కా
కనిలజుఁ డల్పుఁ డెట్లు సమరాగ్రమునన్ భవదుక్తియట్ల [3]యిం
తను వగునే కిరీటిఁ దెగ టార్పఁగ నీతని నొంపఁ జంపఁ దాఁ
గని వెస వచ్చునాతఁ డధికం బగుమద్బల మప్డు నూఁడుమీ 206

చ. తిర మిడి చంపెఁ గీచకశతంబు నితం డది యేల యెల్లెడన్
బిరు దనఁగా బలాఢ్యుఁ డనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగున్ వృకో
దరుఁ డటు లైన నీతనిమదం బడఁగించుట లీల నాకు నీ
వరదము సమ్ముఖంబుగ రథయంబునఁ బోవఁగ నిమ్ము భూవరా. 207

ఉ. నావుడుఁ దేరు మద్రనరనాథుఁడు భీముని దిక్కుదగ్రతం
బోవఁగ నిచ్చెఁ దూర్యరవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల న
ప్పావని నవ్వుచున్ బలము వాయ వడం గడు బెట్టుగిట్టినం
జేవ దలిర్ప నారథిసింహునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్. 208

వ. కప్పి యాలోన. 209

క. వెస నతనియురము బలునా,రసమున నొంచుటయు నతఁడు రాధేయతను
ప్రసరన్నవనారాచో,ల్లసితుం డై మెఱసెఁ గురుబలంబు దలంకన్. 210

ఉ. సూతతనూభవుం డనిలసూనునిచాపము ద్రుంచి యేచి యు
ద్ద్యోతితమార్గణంబు మెయి నుచ్చి చనన్ నిగిడింప నొంకువి
ల్లాతఁడు ధైర్యసారము రథయంబును జూపఁడు మెచ్చ నెత్తి సం
స్ఫీతశరోత్కరం బతని పేరుర మూఁడఁగ నేసి యార్చినన్. 211

తే. ఈడఁబోక రాధానుతుఁ డేసె నిరువ, దేనునారాచములు పవనాత్మజునయు
కత్తళము దూఱి యంగంబుఁ గ్రాఁడి పాఱి,నిలువ కట చని మేదినీతలమునారఁగ.

1. క.గ. బడుగఁ. 2. క. గ. నాఁడు నితంఁడు నింత. 3. క. గ. యిం, తనఁ దగునే. 4. క. గ. గాఁగని

మ. అలుకం గెంపు గనుంగవం గదురఁగా నవ్పాండవుం డేసినం
గులిశంబో యనఁ బ్రజ్వరిల్లి నిగిడెన్ ఘోరంపుభల్లం బుర
స్స్థలి భేదిల్లఁగఁ దేరిమీఁదఁ బడి మూర్ఛం బొంది కర్ణుండు ని
శ్చలతం బచ్చినయట్టు లుండె వెఱఁ దత్సైన్యంబుఁ దూలెం గడున్. 213

భీముండు కర్ణుని మూర్ఛితుం జేసి నాలుక గోయం బూనుట.

వ. అప్పు డయ్యనిలతనయుండు దనయరదంబు గదియం దెచ్చి యా సూతనందనుం గనుంగొని యిస్సీ చునాలుక గోసెద ననుచుం గత్తినయులుఁగు వెఱికి యతనియరదంబుమీఁది కరుగ నుత్సహించినఁ జూచి మద్రవిభుండు వారించి యిది మూర్ఛ గాని మరణంబుగా దీయవస్థ నాలుక గోసినం జచ్చు నితనిం జంపుటకుఁ బార్థుండు ప్రతిన పట్టినవాఁడు నీవు నంపిన నతండు నెవ్వగం బొందు ననిన విని యప్పీరుండు వీఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండ నై యది మఱచితిం గాని చావు గామియు నిట్టియెడ నాలుక గోయం దడవఁ జచ్చుటయు నెఱుంగుదు నిక్కెఱుంగు నీవు దలంపించి తెన్నచేసి తిద్దురాత్ముండు సభలోన ననభ్యంబు లగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించినకోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచికొని యుండితి నేఁడు తద్దోదన వెలార్పం జూచితి నట్లు చేసితి నేని మానధనుం డైనధనంజయుండు దనచేసినప్రానిక నెఱవం గానక మనంబున [2]గుంది మఱియుఁ గృష్ణయుధిష్ఠిరులు నాతనితోడివార యింత ప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి మే లయ్యె మాతులా నీయాజ్ఞ యుల్లంఘింప నని పలికి నిలిచె శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె ననుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 214

క. పాండవుల నాజి నోర్చు ని,తం డని మీరాజు సూతతనయునిఁ బొగడున్
గం డడఁచె భీముఁ డిట్టిమ,గండుఁ గలఁడె పిదప నెట్లు గయ్యము సెల్లెన్.

భీముఁడు శ్రుతవర్మాది కురుకుమారులఁ బెక్కండ్రఁ జంపుట.

వ. అనవుడు సంజయుం డాంబికేయున కిట్లను నట్లు బాధితుం డయినరాధేయుంగనుంగొని కురుపతి దమ్ములతో భీమసేనుచేత సూతసూనుండు గడు నొచ్చెంగావలయు వేగం బెయిదుఁ డనుటయు శ్రుతవర్మాదికుమారులు గొందఱు పటుగతిం గవిసి యక్కుంతేయుం జుట్టుముట్టిన నతండుఁ దదనుచరుల నేమాటయుఁ బంధు వీరరథికులం బిలుకుమార్చి శ్రుతవర్మశిరంబు భల్లంబునం ద్రుంచిన నది ముఖకాంతిమెఱయం జంద్రమండలంబు మహిఁ గెఱఁగు తెఱంగుఁ దోఁపం బడియెఁ బటుబాణద్వయంబున వికటునినముని బెట్టేసిన వెడిదంపుగాలిం దూలుతరువులకరణి ధరణిం దెళ్ళిరి తదనంతరంబ తీవ్రనారాచంబునఁ గ్రాథుం గూల్చి నందోపనందులనొక్కపెట్టపెక్కుమ్ములం బొరివుచ్చె నిట్లునీకొడుకులార్వురుం దెగినఁ దక్కటివారువిచ్చి

1. క.గ. రామియు నెఱుంగుదు. 2. జ. గుందు మఱియు.

దైన్యంబు నొందిన సైన్యంబు గలంగె నంతకుఁ దెప్పిఱి యెప్పటిబరవసంబు
శోభిల్లం గర్ణుండు గడంగి డగ్గఱి. 216

చ. అనిలజుమీఁద నేయ నతఁ డాశరముల్ దునుమాడి సప్తకాం
డనిహతుఁ జేసె నాతని దృఢప్రదరంబులఁ గప్పె నాతఁ డా
విను సముజ్జ్వలప్రదరవిద్ధుఁ గా నొనరించి యమ్మరు
త్తనయుఁడు పేర్చి యార్చె వసుధావర యారథికుండు దుదగ్రుఁడై. 217

మ. పది బాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీతదీప్తోజ్జ్వల
ద్గద వైచెం బవనాత్మజుం డది యొడన్ ఖండించె నవ్వీరుఁ డు
న్మదుఁడై పాండవుఁ డొండువిల్లుఁ గొని నానానాకంకపత్త్రంబులం
బొదువం గర్ణుఁడు నొంచెఁ దత్తను వతిస్ఫూర్జద్దశాస్త్రంబులన్. 218

వ. దానం గోపించి. 219

చ. పటుతర సైన్యనారవము పాండునృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమున బెట్టు గ్రువ్వ సుకృతం బయి వీఁపున నుద్వి పోవ ను
త్కటధరణీప్రకంపచలితం బగు శైలముఁ బోలి తాల్మిది
క్కటముగ రోషరంజితముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్. 220

చ. రయమునఁ బంచవింశతిశరంబులు మేన నిగిడ్చి భల్లసం
చయహతి విల్లు నక్కడఁచి సస్మితవక్త్ర సహస్రపత్త్రల
క్ష్మి యతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి యేచి విద్విష
ద్భయద గదారుచిస్ఫురితబాహువిలాసవిభాసమానుఁడై. 221

వ. అరదంబు డిగ్గ నుఱికి కర్ణునిదెసం గవియుం గురుపతి సేనం గలయేనుంగులం బది
యేడింటిం బరికొల్పిన నవి దివాకరుఁ బొదువు నంబుదంబులచందంబున నాజెట్టి
మగనిం గిట్టిన నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం జదుపుటయు సాబ
లుని ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట నురవడించిన వాని
ప్రాపున నరదంబులుం గాలుబలంబులుం గవిసి కూడికొని పొదివిన మదం
బొదవి యమ్మహాబలనందనుండు దారుణరణవిహారంబున నొండొండ పేర్చిన
యుబ్బలం బుజ్జ్వలానలంబున వైచినచర్మంబు వాడ్పున ముడింగి యొదిఁగె నవ్వా
డాశకునియోధులు పంచశతరథికులు రథసంబున నడరిన వారల సూతాశ్వ
కేతుస్యందనసమేతంబుగా నఱిముఱి నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని
యగ్గాంధారరాజు వనుపం గడంగినయవనదేశీయు లగునాశ్వికులం ద్రిసహస్ర
సంఖ్యుల నవ్విధముడిపోడిసేయుచప్పుళ్లు గార్చిమ్ము వెనుకటఁడవి నేర్పు తెఱం
గునం దోఁచె నిట్లు గదవంపవు సేసి యొంటిరథం బెక్కి యక్కొంతేయుండు
ఖండనంబు సేయ రాధేయుండు పాండవేయాగ్రజుం దాఁకి తీవ్రప్రకాండంబులం

గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు దోలంగ నీడ్చికొని పాఱిన వెనుకొనునయ్యంగపతిం గనుంగొని. 222

ఉ. భీముఁ డదల్చుచుఁ రథము ♦ భీమగతిం గవియింప నాతఁ డు
ద్దామత మాఱుకొన్న విశిఖస్ఫురదస్త్రపరంపరాద్వయ
శ్రీ యొన లప్పు డచ్చెరువుఁ ♦ జెంది నుతించె సురాంతకానుజుం
డామరుదాత్మజుం గడచి ♦ యంగపతిం వెసఁ దాఁకెఁ దాఁకినన్. 223

క. ఆ యిరువురనిబిడకనత్సాయకపటలములు నిగుడ ♦ నరి మధ్యాహ్న
స్ఫాయత్ప్రభాఢ్యుఁ డయ్యుం, దోయజబాంధవుఁడు మింటఁ ♦ దోఁపక యుండెన్.

వ. వా రొండొరులశరపరంపర లడఁగించి రాసమయంబున. 225

చ. తన కరముల్ నిగిడ్చి [1]యుచితంపుమొయిం గొనియాడి యంతటం
దనియక తీఁటఁ జేరి సముద్రదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి జగన్నాథిప చూడ శమంతపంచకం
బున విరిదమ్మితేనియలఁ ♦ బొల్పెసఁగెం బ్రతిబింబ మొత్తయున్. 226

వ. అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామలయుద్దామ [2]సాహాయ్యంబున సమధికోత్సాహుం డగునాసూతనందనునిసంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగి నిర్విఘ్నంబున నిరువాఁగును గలయం బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెనఁగునులివు తూర్యరవంబుల గెలువ నమ్మేదిని నెత్తుటం జొత్తిల్లి కెంజాయ రంజిల్లు పుట్టంబు ముసుంగు వెట్టినయట్లగనచందంబు నొందె మస్తకప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతిభూషణంబులును నాతపత్ర ధ్వజచామరంబులుం దునిసి పడి భీషాభిరామంబులుగాఁ గరిహయనరసమూహంబులు రక్తసిక్తంబులైన సకాలబాలాతపలీల యావహిల్లం దక్కిన సేనాంగంబుల మిగిలినమాతంగంబులు పెనంగినక నకలిప్తకాండంబుల [3]లూడుకొనం దాఁకిన నెరగల్లు వోవుకొండలకైవడిం బొలుచునవియును నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్మురుధిరమ్ముల గైరికనిర్ఝరంబులతోడిధరాధరంబుల ననుకరించునవియును మొయిమఱువు లఱువులై నానానిశితశరంబులు నాటినం జేష్టలు దక్కి తెక్కలు దెగియున్నశైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగునుల్లాసంబున శోణితం బడంగ మట్టవిసి రేణువు లెగసినం జూడ్కులు నిగుడ కున్నసుం దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీజనకనామంబుల బిరుదాంకంబులుం దమ్మెఱింగించికొనుచు వీరులు పోరుచక్కటికిం జొచ్చి ప్రాపై [4]పేరువాడుతకీయబంధుమిత్రులం బొగడు నమరులమొలుంగులు నింగి నిండం జెల్లు దొరఁగుకీలాలం బాధూళి

1. గ. యుచితంబుమొయిం. 2. జ. సహాయంబున 3. చ. లూఁదికొనం. 4. జ. పేరువాడి.

నడంచినకోలంది నిలువక తేఱు లయి పాఱ నుబ్బి భూతభేతాళక్రవ్యాదంబు
లోల లాడుచుం ద్రావుచు మదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్టలాడ
వెక్కసపా టొనర్పం జాలునానమయంబున మనంబు లెప్పటితమకంబున ననిం
దనివి సనమిం గవిసి కయ్యంబు సేయుసైనికోత్తములసింహనాదంబులు దిక్కు
లం బిక్కటిల్ల నాకలనికలన నట యున్న తన్నుఁ బొదివిన త్రిగర్తకోసల నారా
యణ గోపాలబలంబుల నబ్బలనూదనసూనుండు గాండీవారావం బాకసంబు వగి
లింప నొప్పించి. 227

చ. తఱిమి సుశర్మఁ దాఁకిన నతండుఁ దదంగమునన్ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్పి బల్వడఁ దయమ్మున నుజ్జ్వలకేతుదండ మే
డ్తెఱఁ జలియింప నేసిన నుదీర్ణతఁ దక్కఁపి యార్చె నార్చినన్. 228

సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునురథంబుపైఁ బడి యాఁగుట.

సీ. వెగడునఁ [1]జెయ్యాది వేగంబ తేఱి సంశప్తకు లర్జునుసాయకముల
కోహటింపక సముత్సాహంబు వదల కందఱు నొక్కపెట్ట నద్రథము పొదివి
హారులతోఁ గాడియత్తహారికేలు నొగలును [2]బలుగాఁడియానుగండ్లు బట్టి మిలుఁగ
మిడుక రాకుండ నమ్మేటివిల్కానిమేను నిగ్రహించుట గనుఁగొనంగ

తే. నద్భుతం బయ్యె నవుడు నేర్చి శౌరి
లీలఁ గొందఱ మత్తశుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర నమయఁ జేసె. 229

వ. అంతఁ గొంతయూఱువువోయినం జెఱునవ్వు నవ్వి కవ్వడి కమలనాభున కిట్లనియె.

ఆ. తేరు గదల నీక వైరులు బలువిడిఁ, బొదివి పట్టరాచపొల్లనైన
యేనుదక్కనృపతిసూనుఁ డిట్లోర్చుచు సహించు నెట్లువిక్రమించుఁ గాక. 231

క. అని పలికి మూఁడుమీఁ న, న్ననుచు భుజగాస్త్ర మేయు నది యురులకు గ
క్కున నాదబంధ మొనరించిన ముంచె నతండు వారి శితవిశిఖములన్. 232

వ. ఇవ్విధంబున. 233

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి, వారు వివిధబాణ దారితాంగు
లై రథంబు విడిచి రప్పు డాసంశప్తకవ్రజంబు గని త్రిగర్తవిభుఁడు. 234

క. గరుడాస్త్రం బేసిన న, చ్చెరువుగ గరుడములు గవిసి చీరం బంచు
స్ఫురణము మెఱఁగ వెస నయ్యురగాత్మకబంధ మూడ నుర్వీనాథా. 235

క. తనకడిమి బంధమోక్షము, గనినరథికకోటి గడఁగి గాండీవివయి నే

1. క. జేవ్వడి. 2. ఖ. బలుబాండి కండ్లును బట్టి తోలఁగ.

ఘనఁ దూపులు దొరఁగింపఁగ, ఘనభుజుఁడు సుశర్ముఁ జేసెఁ గనదస్త్రమునన్.

చ. అది ¹నరుఁడెంద యాడుటయు నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ
బదికిలఁ బడ్డ నుబ్బి యదె చచ్చె సుశర్మునియేటు దాఁకి బ
ల్లిదుఁ డగుపార్థుఁ డంచు మదలీలల నార్చిరి నీదుసైనికుల్
చదలను దిక్కులం బరఁగె శంఖముఖోద్భట తూర్యనాదముల్. 237

సీ. అంతఁ దెప్పిఱి విలయాంతకుఁడై వడిఁ, గవ్వడి యేచి మార్గణచయంబు
పెల్లడరించిన బిఱువోయె సుశర్మ, యాసేనపైఁ గదనైంద్రాస్త్ర మక్కి
రీటి నవ్వుచు నేయ నాటోపమున నది, వివిధబాణాకృతిఁ గవిసి నుఱుము
గావింపఁగాఁ బదివేవురు సంశప్త, కాగ్రేసరులు దెగఁబాఱి రవ్వ

ఆ. దుక్కు దక్కి తలరి తక్కటియోధులు, చేష్టితంబు లెడలఁ జిత్రరూపు
లట్టులైరి ధూమ మడఁగిన వెలుఁగొందు, ననలు చంద మయ్యె నన్నరుండు.

వ. హతశేషులైన సంశప్తకులు చతుర్దశసహస్రయోధముఖ్యు లవ్విజయువిజయంబు సహింపక యొండొరులం బురికొల్పికొని బలంబులతోడం గడంగి నతిందతిదారుణం బగురణంబు సేయఁ దక్కటిపాండవులదెసఁ బోరు కౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిం గలంగి పఱచినం గృతవర్మ కృప గురుపుత్త్రకర్ణులు నులూకసౌబల సుయోధనులును దుశ్శాసనాదికుమారులును బరవసంబు సేసి యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి రట్టియెడ కృపునియపరిమితశరజాలంబు పాంచాలపుంజంబుం బొదివినం గనలి శిఖండి యుమ్మహాసురవసుని మూర్కొనియె నయ్యుభయపుర సమరంబు రామ రావణుల రణంబుకరణి నొప్పె నట్లు పోర పోర శారద్వతుండు.

చ. హరులను సూతుఁ జంపిన సుదగ్రత నా ద్రుపదాత్మజుండు వి
స్ఫురితకృపాణచర్మపరిశోభితుఁడై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర శరవాహిని పై నిగిడించె నాతఁడ
య్యరి వెఱఁగందుచుఁ నిలుచునట్లుగ జోదులు పిచ్చలింపఁగన్. 240

వ. అట్లేచినకృపాచార్యుపై సురవడించినధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండును దలఁపడి నిలువరించి రగ్గాలిముండు శిఖండిపలుక పఱియలు సేసిన నతండు దెరలక కేవలకరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు. 241

క. వాలికతూపులు మేనం, గీలుకొలిపి నొంపఁ గని సుకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడిరి యా, ఖీలత నాకృపునితోడఁ బెనఁగె నరేంద్రా. 242

తే. తనకు నెడ సొచ్చి యిట్టు లక్షితుండు పెనఁగ
ద్రుపదనందనుఁ డల్లన తొలఁగి పోయె

1. అ. నరునేన వాటుటయు. 2. క. దన్యుర.

నా సుకేతుండు కృపునిపై నాడ నిరువ
దాఱుశరములు వఱపి రక్తయంబు మెఱయ. 243

వ. ధనువు దునిమి యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి 244

క. తోడన హయసూతుల [1]నోఁ, గాఁడఁగ నేయుటయు నతఁడు గనలుచు బలువిల్
క్రీడయుపోలం గొని మే, న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. 245

కృపాచార్యుండు సుకేతుం డనుపాంచాలకుమారుని జంపుట.

తే. అట్లు నొప్పింపఁ దూఁగాడునా సుకేతు
కంధరము మెఱుఁగారెడుకత్తివాతి
ద్రొడ్డతూపున నేవుసఁ ద్రుంచుటయును
శిరము ధరఁ ద్రొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ. 246

వ. ఇట్లు సుకేతుండు నచ్చిన నతనిమూఁకలు విచ్చె ధృష్టద్యుమ్నుండుఁ గృతవర్మయుం బోరునెడ ధృష్టద్యుమ్నుండు గృతవర్మవక్షస్స్థలంబు విశిఖనవకంబున నొప్పించుటయు నప్పాంచాలవరు నతండు సూతకేతుహయస్యందనసమేతంబుగా నిబిడశరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహకపిహితమూర్తి యగు మార్తాండు ననుకరించి తాను సైంధవవధదినంబునం బారావతవర్ణంబు లగురథ్యంబు లగ్గురునందనాశ్వంబులఁ బెరయం బఱపిన తెఱంగున. 247

తే. అలిగి నొగ నొగతోఁ దాఁక నతిరయమునఁ
దేరు వఱపి కృపాణప్రదీప్తపాణి
యగుచు గద పుచ్చికొనియును నఱుము శీక
చలము డిగఁ ద్రావి కృతవర్మ యలుకు దాఁటె. 248

వ. అక్కుంభసంభవుచందంబు గాక పంచకుం డై యప్పురుసున నబ్బలుమగండు దొలంగిన నయ్యరదంబుమీఁదికి లంఘించి యా ధృష్టద్యుమ్నుండు. 249

క. ఆ రథికు నచటఁ గానక, సారథిగల దునుముటయును సంతసమునఁ బాం
గారి [2]తనశబ్ద మిచ్చి మృహారవమున నిక్కడిక్క దనియె నతండు. 250

చ. విని కృతవర్మఁ గాంచి పటువిక్రమకేళి యొనర్ప నాత్మవా
హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతనిలోను గాఁగ న
మ్మెనఁ గలమేటిజోదులనముద్ధతి యేడ్తెఱ నిల్వరింప వి
ల్గొనెఁ బటుశౌర్యశోభితబలుం డగునయ్యదుముఖ్యుఁ డొక్కెడన్. 251

వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచికొని యనికిం దొలఁగం గొనిపోయెఁ బాంచాలోత్తముండును దనయనుమ బలంబు గలంగం బరాక్రమించుచుండె. 252

సీ. ధర్మపుత్త్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచో, బొనటయై శినిపౌత్త్రుఁ డదర

1. క. పైఁ గాఁడఁగ. 2. క. గ. తలశబ్ద.

నా యుద్ధమును ద్రౌపదేయులు వెఱఁగందు, నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి యమ్మేటి, విలుకానిసాయకవితతి నింగి
ఘనమయంబుగఁ బర్వ జననాథ వారల్లి, రయొక్కొక్కరుం డనేకోగ్రబాణ
ఆ. నిహతుఁ జేయనతఁడు ప్రహసితవదనుఁడై, యొకనినొకని బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి వివ్వచ్చుకొడుకుచా, పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. 253
క. ధృతి నొండువిల్లుఁ గొని యా, శ్రుతకీర్తి దదీయతనువు సొనిపెం బ్రదర
త్రితయంబుఁ గనలి యాతం, డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్.
క. ముంచుమహోద్ధతి యాలో, కించి తనదుచూడ్కి దట్టకెం పెనఁగం గో
పించి శరనికరములు గుప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్. 255
చ. కదిసిన నమ్మహాభుజుఁడు గార్ముకముం దును మాడి మూఁడు బె
ట్టిదపుమెఱుంగుతూపులఁ బ్రతిష్ఠత నూపిన నా నృపాలుఁ డు
న్మదుఁ డయి మేటివింట బలుమార్గణముల్ వెన నేసె మూఁడు న
ర్వాదియును నద్ధరామరునిపై శినివంశవరుండు దోడ్పడన్. 256
వ. ఇట్లు ప్రాపై కడంగి. 257
ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్త్రుని, ధనువు శినివరుండు దునుముటయును
శక్తి వైచి యతఁడు సారథి గూల్చి బల్, వింటఁ గురిసె బహుళవిశిఖవృష్టి.
క. సారథి లేమిని సాత్యకి, తేరిడ్చెఁ దురంగములు దేరటు వాఱన్
ఘోరమణ ధర్మనందను, వారు వొదివి రంపగముల వడి గురుతనయున్. 259
క. భీమాస్త్రశిఖల నశ్వ, త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొకవ్రేల్మిడి, నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా. 260
వ. అప్పుడు కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దెగినవారలంగాఁ దలంచె
నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం బీడితుం జేసి.
సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండ, వని విన్న నెఱుఁగుదు నైన నెల్ల
సొంపు పార్షతునకుఁ జూపనోపినఁ దెల్ల, మగు నది యట్లుండె నరయనీకు
నెయ్యంబు పాటించునేర్పు కృతజ్ఞత, యనునివి లేవు బ్రాహ్మణుఁడు దవము
దమమును గల్గువర్తనమున నుండుఁగా, కని సేయునే యెంత యడచిపడినఁ
ఆ. బడిత గాని యుద్ధపడ లేవు కౌరవ, కులము నెల్లభంగి గెలుతు మేము
నీవ చూడ ననుడు నావీరుఁ డేమియు, ననక నగుచుఁ బఱపె నంపవల్లి. 262
వ. ఆవెల్లికి నోర్వలేక యా భూవిభుండు దొలంగి న ట్లంతటిమానిసికాఁ గెలిచినవాఁ
డై నిలిచి నిజపార్శ్వంబులమూఁకలంగనుంగొని గురుపుత్త్రుండు క్రూరవిహారం
బునకు నచ్చెరి మెఱసె మారుతితోడం బోరుకర్ణుండు దదనుచరంబు లగుకరూశ
చేదిసృంజయపుంజంబులుం దన్నుం బొదివిన నబ్బలంబునకు బాహుబలంబు
చూపుచుండ నతని విడిచి యాభీమసేనుండు కౌరవసేనవయిం గవిసి కనుపుగొట్టె

నా రాధేయవృకోదరులమును ములు ధనంజయు మునుముభంగిం బ్రజాతయం
బగుచుండె నీ దుర్మంత్రంబున ననేకులకుం బొలియవలసె నయ్యవసరంబున. 263
సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డ,స్త్రకులసంగంబున నవశరములు
సోనివి యాసహదేవుఁ డనకపుసిరము గ్రుచ్చిన వార లిరువురు నెనిమిదింటఁ
బదితూపులను నొంపఁ బతిరెండువిండ్లును, దానమానుటయు నన్యధనువులత్తి
యన్నయుఁ దమ్ముండు [1]నన్నుఁ బెక్కమ్ములఁ, బొదివినఁ గనలి యా భూవిభుండు
తే. వారి దివ్యాస్త్రములఁ గప్పె ఘోరభంగి
గాంచి జను లక్కుమారులు గాలవశతఁ
బొందుదుర కాఁ దలంప నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున. 264
వ. ఇట్లు పాండవసేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు. 265

ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట.

ఆ. ఇరువదేను నిశితశరముల నొప్పింప, నలిగి యాతఁ డతనిఁ గంకముల
నఱువదేను తూపు లడరింప నఱికె న,క్కౌరవేశ్వరుండు కార్ముకంబు. 266
మ. బలువిల్లుగ్రత నెత్తి యొక్కట మొగి నప్పాంచాలపత్యుండు దీ
ప్తులు గ్రమ్మం బదియేనుమార్గణము లాభూమీశుపై నేసినం
గలయం బూచినకింశుకంబు చెలువంగం బొందఁ దచ్చాపమున్
వెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. 267
క. కాలాయసనారాచము, లోలి నుదుట నాటి యున్న నొప్పారెం బాం
చాలవరుముఖము మధుకర,మాలికచేఁ బొలుచుతమ్మిమాడ్కిం జూడన్. 268
సీ. కనలి యవ్వీరుండు కార్ముకాంతరమునఁ, గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును, దునుమాడఁగా భవత్పుత్త్రుఁ డేపు
గుందక శక్తి [2]నిగుడ్పఁగఁ ద్రుంచె నే, త్తెఱఁ గృపాణము గొన నుఱుముచేసె
గద యెత్తఁ బఱియలు గావించె నుబ్బి ర,త్నమయాహికేతువు నఱికివైచె
తే. నిట్లు హయసూతకోదండహీను దళిత,రథుని విగతాతపత్త్రు నిర్భగ్నశక్తి
ఖడ్గముద్గరకేతు విఖండితాపి,ధానుఁ జేసె నప్పార్షతుం డానరేంద్ర. 269
తే. విరథసాధనుఁ డైన యవ్విభుని నతని
తమ్ముఁ డగుదండధారుండు తనదు తేరి
మీఁద నిడుకొని శత్రుసమీపభూమి
వాయఁ గొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు. 270
క. శినివంశవరునితోడం, బెనఁగి పెనఁగి యతని విడిచి పెలుచ ద్రుపదసూ
నునిరథమునకు నెదురుగఁ, దనయరదము సనఁగ నిచ్చె ధరణీనాథా. 271

1. క. గ. ఘ. నన్నుఁ బెక్కు. 2. నిగుడ్చిన అతఁడు ట్రా. ప్ర.

వ. సాత్యకియును శరంబులు గురియుచుం ద్రోణుఁ దవిలె నుభయసేనాపతు లగు నా సూతనందనధృష్టద్యుమ్నులట్లుదార్కొనిన నయ్యిరువాఁగునందు నొక్కరుండైన నోల మానగొనక కడంగినం బోరు ఘోరం బయ్యె నయ్యెడఁ బాంచాలకుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును జయ రోచమాన సింహసేనులును బలుదేరుల ముత్తంబులతోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యేనమండ్రు వీరుల నెనిమిదిభల్లంబులం దునిమి తత్సహచరుల బహుసహస్రరథికుల నమయించినం జేదిరథిక ప్రవరులు జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును దండ చిత్ర చిత్రాయుధులును హరిసింహకేతు రోచమానశలభులును సబలంబుగాఁ దలఁపడిన [1]నావదునొక్కండ్ర నొక్క పెట్ట బెట్టిదంపుటంపఱపాలుచేసి మఱియును బిరుదు లయి పయింబడినదొరలను వారివరివారంబులను వసుధం గూల్చియు నలంచియుఁ గలంచియుం గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడ మని జనంబులు వెక్కసపడ వివిధసమరవిహారంబు సలిపి వెండియు 272

సీ. సింహంబుదారిఁ జొచ్చినగజంబులభంగిఁ, బులి కగ్గమైన జింకలవిధమున
జ్వలనంబుఁ గిట్టినశలభంబులట్లుఁ బాం,చాలయోధులుఁ జేదిసైనికులును
దనుఁ దాఁకి పొలియ రాధాతనూభవుఁ డనిఁ, దనివోక ధర్మనందనునియున్న
'చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప,దీపుత్త్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గలమహీశులుఁ బొదివి కర్ణుఁ దాఁకు
పెక్కు పాములు బొదివినఁ జెనఁగుగరుడు
ననువు దోఁపఁగ బోరాడె మనుజనాథ. 273

వ. ఆసమయంబున భీమసేనుబారిం బడినకౌరవసైన్యంబునం బ్రబలచతురంగంబులొక్క మొగిఁ బడలువడి రణాంగణంబు [2]మూసికొనియెం బెఱమూఁకలు వెఱగునం జెయ్వేది కరళ్ళడంగినముమ్మిటియట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషం బగుబలంబువిచ్చుటయు వాసుదేవునాలోకించి.

ఆ. ఆ మరులకు నజయ్యు లగునట్టసంశప్త,కులు మదీయబాణఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు భీముని,మునుము కౌరవులును మొనయలేరు.

క. కర్ణుం డొక్కరుఁడును నఱు,దీర్ణుం డై సిడము మెఱయఁ దిరిగి బలువిడిఁ.
ఘూర్ణితము సేసె మనసై,న్యార్ణవమును మంథనగముక్రియను నమరంగన్. 276

చ. అరదము వోవ నిమ్ము గయ మూరఁగ నాత్మనిదిక్కు నావుడు

---

1. క. గ. చ. నావదునొక్కళ్ల. 2. క. మునుకగానియెను; గ. మునుంగుపడియెను.

స్మరహాసితంబుతో నలిననాభుఁడు భీమునిచేతఁ బోదు నీ
శరముల వేఁడిఁ గౌరవులసంగరవాంఛ యడంపు మన్న న
న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథుని యోధులు బెగ్గడిల్లఁగన్. 277

ఆ. అమ్మురారి ధవళహయములు మెఱయ నుద్ధతి సత్వరముగఁ దేరు వోవ
నిచ్చుటయును జూచి విచ్చె నబ్బలము సింగంబుఁ గనిన లేడిగమియుఁ బోలె.

వ. అప్పుడు నీకొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండువేలరథంబులును మున్నూ
ఱేనుంగులును జతుర్దశసహస్రతురంగంబులును లక్షద్వయపదాతులును నప్పార్థు
పయిం గవిసిన నతండు శింజినీటంకారంబునం బటుశరనారాంబున నింగి నించి
పదివేవు రుద్భటక్షత్రియులం బొలియించి యక్కాలనం గాంభోజబలంబు దోఁచిన
నం దుఱికి తదీయసైనికులకరంబులు శిరంబులు నఱికిన నది [1]మహావాతనిహత
విటపం బైన యారామంబు చందం బయ్యె నట్టియెడ. 279

క. అపరి సుదక్షిణుతమ్ముఁడు, గడువడి నేయుటయు నతనికరశాఖలు గ
వ్వాడి యర్ధచంద్రశరముల, వెడందతూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. 280

క. యవనశకసైన్యములు పైఁ, గవిసినఁ దద్రుధిరజలము కాలువలై పా
ఱ వెసం బఱపెను వివిధా, స్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా. 281

మ. కని సంశప్తకులేచి యొక్కమొగి నాకాంతేయునిం జుట్టుము
ట్టిన సేనాంగచతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసి నా
తనిబాణోత్కరవేగ ముత్కటమరుత్సంక్రీడజీమూతప
టనముం జేసినభంగిఁ జిత్రబలగాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. 282

క. హరి వెరవున ధవళాశ్వస్ఫురణమున రథంబు మెఱయఁ బొలుపారెను న
న్నరుసత్త్వద్యుతివిక్రమపరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్. 283

క. ననుఁబోటులమనములు మెచ్చునఁ గరఁగె ససంగ నేల సురతతి కృష్ణా
ర్జునులం గని దుందుభినిస్వనములతోఁ గురిసె విరులవాన వొగడుచున్. 284

వ. అయ్యవసరంబున నశరీరవాణి యియ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నాక
ర్ణింప వీరు చంద్రార్కులం గడచిన కాంతిదీప్తుల నుల్లసిల్లెదరు తొల్లి యేకరథస్థు
లైన బ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు గంటిరే వీరలు పరమ మును లగునారా
యణుండును నరుండును జుండీ యనియె నిట్లు మహానీయాశ్చర్యములు గనియును
వినియును మాత్సర్యధుర్యుం డగునాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మా
ర్కొని మార్గణోజ్జ్వలం బగుదక్షిణకరంబున నా ఫల్గును బిలిచి హాసభాసిత
ముఖుం డగుచుఁ గుపితుం డగు నతని కిట్లనియె. 285

అశ్వత్థామ యర్జునుం బేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట.

క. ననుఁ దగియెడునతిథిం గా, మనంబునఁ దలంచి నీవు మున్నం దెదవే.

1. క. మహాశనిపాతనిహతవిటపం.

నిని వచ్చెద నీపాలికి, ననఘా సంగ్రామ మొసఁగు నాతిథ్యముగన్. 286

ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్య,తనయు గెలువ కునికి దైన్య మిపుడు
నమయఁ జూడ వలయు సంశప్తకులను నీ,మనసు వచ్చువనికిఁ జనువుమనుడు

ఉ. తేరు మురారి ద్రోణసుతుదిక్కునకుం జన నిచ్చి మేలుమేల్
పోరు ఋణంబు దీర్పు కురుభూపతికిన్ నరుబాహులీలకు
న్నెరణ గల్గి నిల్వె మనినన్ విని యట్టుల కాక యంచు న
వ్వీరుఁడు మష్టిబాణముల వెన్నుని నేసి నుదగ్రుఁడై వెసన్. 288

ఉ. అమ్ములు మూఁడు పార్థుని వాడఁగ నేసినఁ ద్రుంచి వైచెఁ జా
ప మ్మతఁ డమ్మహాద్విజుఁడు భారవహమ్మగునొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి చేతులను గాళ్ళను మోమున [1]వింటికొమ్మనం
గ్రమ్మనభంగి గా శితశ[2]రప్రతతుల్ వడి నించెఁ బైపయిన్. 289

క. కడుఁ బెక్కువేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల సరథవాహంబుగ నె
క్కుడుమదమునఁ బొదివినఁ జె, య్వొడలి వెఱఁగుపడిరి వార లిద్దఱు నధిపా.

వ. ఇవ్విధంబున వివిధవిశిఖజాలంబులఁ గారుసే యూర్పు రాకుండఁ గప్పి యార్చిన
నప్పార్థుం డతనిచేత దనవిక్రమం బపహృతంబయ్యె నని తలంపఁ దత్సైన్యంబున
హాహాకారంబు లెసంగఁ జారణసిద్ధగణంబు లట్లు నిశ్చేష్టితులైన యా లోకరక్ష
కుల నాలోకించి లోకంబులకు బ్రదుకు గలుగునో యని పలుక నప్పద్మనాభుండు
గవలి యక్కవ్వడి నుద్దేశించి. 291

క. గురుసుతుఁడు నిన్ను మిగులుట, గర మాశ్చర్యంబు ముష్టి గాండీవము దాఁ
దిర మయి యుండదొ బాహుల, వెరవుబలువు గుందెనో వివేకింపు మిదన్.

క. గురునికొడు కనుతలంపునఁ, బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితో యు
ద్ధురతఁ గడుఁ జెడితొ ననవుడు, [3]సరోషసంరంభుఁడై విజయుఁ డాతనితోన్.

క. వెనఁ బెక్కమ్ములు మనపై, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన నం
తస మందెదు నింతన యేఁ, గసి మసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. 294

మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాత్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుగ్గుం దాల్చియుం దోఁచ నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్. 295

ఆ. ఇట్లు ద్రోణసుతుని యేపు పార్థుఁడు మహి,మంబుఁ జెఱచె మనియు విధంబు మెఱయ
జెఱిచె వంతఁ బొదివె నుఱుకు యాదవుని నం,శప్తక వ్రాతముఁ బవనసుతుఁడు. 296

క. ఎందఱు పొదివిరి వారల, కందఱకును దమక తమక యర్జునచటుల
స్యందన మెదు రైనట్లు మ, దిం దోఁచె. దనీయు బాణతీవ్రబహుళతన్. 297

---

1. అ. వింటికొప్పునం. 2. అ. రమ్ములు నే నిగిడించె. 3. అ. సరోషుఁడై క్రీడి మఱి మెఱుఁగా మనుకొన్.

క. అప్పుడు గురుతనయాద్రిం, గప్పంగ వజ్రోపమానకాండములు వెసం
గుప్పునఁగూర వఱప నరుఁ, [1]డప్పురుసఁదనమున కోర్చి యతఁడుం బెనఁగెన్.
వ. అట్లశ్వత్థామ పెనంగు చుండ సంశప్తకవ్రజంబునందు. 299
క. చేతులు దలలును బహువిధ, హేతులుఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం
జేతులకసి వోవంగ న,రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. 300
క. తురగద్విపరథతూర్యా,భరణధ్వజచామరాతపత్రశకలముల్
పోరిఁ బోరి ధరఁ గప్పంగ నె, త్తురుటేఱులు వానిఁ దొలఁగఁ ద్రోచుచు వచ్చెన్.
వ. అట్టియెడ. 302
తే. అంగవంగనిషాదకళింగబలము, లర్జునునిమీఁదఁ బెల్లు గప్పఁ గడఁగుటయును
గురుతనూభవుఁ డతని నిష్ఠురవిరోధి, నంపవెనువెల్లి ముంచి బెట్టార్చి పేర్చె.
వ. అవ్విక్రమవిశేషంబునకు రోషంబు నొంది. 304
క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును నాసైన్యసమితిక్రూరోద్ధతియు
న్నివ్వటిల నీక ఖచరులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్. 305
వ. మెఱసిన నెఱసినరోషంబున మఱియును. 306
మ. గురుపుత్త్రుం డసురాంతకున్ విజయునిం గ్రూరాస్త్రసంతానని
ష్ఠురపాతంబున నొంప నాహరి దదాటోపంబు సైరింప క
న్నరుతో నౌషధ మీఁది చేసి తెవులు న్మర్దింప కున్నం దుది
న్బర మై యుండదె యే పడంపును రిపు న్సంరంభి వై నావుడున్. 307
వ. అతండు విజృంభించి గుణంబు సారించి. 308
చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్స్థలంబునం
జరణములన్ శరంబులు ప్రసన్ నిబిడంబుగఁ గీలుకొల్పుచున్
వెరవునఁ బగ్గముల్ దునుము వేగమ యాడ్చెఁ దురంగమంబు ల
గ్గురుసుతు తేరు గయ్యమునకుం గడుదవ్వు దొలంగ భూవరా. 309
వ. ఆ భూదేవుండును భగ్నోత్సాహుం డై యల్లన నూతనందనుసమీపంబునకుం
జనియె. నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబు దెసకుం దేరు నడపుచుం దనసేనదిక్కు
కోలాహలం బాకర్ణించి చూడ్కి యట నిగిడించి యర్జును నుద్దేశించి వేదండా
రూఢుం డై దండధారుండు మనబలంబులం గలంచుచున్నవాఁ డమ్మగధోత్త
ముండు భగదత్తునంతవాఁడ యతని మడియించి మఱి చేయం గలపని చూచి
కొందము నిపలికిన నక్కవ్వడి యొడంబడ నక్కడ కరదంబు వోవ నిచ్చె నట్టియెడ.

—✿ దండధారుం డను రాజు వేదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట. ✿—

క. పాండవసైన్యంబుల వే,దండంబుల ఘోటముల రథంబుల భటులం
జండగతి మగధపతి నిజ, శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్. 311

1. క. డప్పురుసున కోర్చి యప్పు డతఁడుం.

వ. అవ్విక్రమవిహారంబు వీక్షించి. 312

తే. మాగధునికోలలకుఁ గాక § మనబలంబు
విఱిగెఁ బాఱ పోద మని తాను § దఱిమెఁ దేరు
హరియుఁ బఱపంగ నర్జునుం § డడ్డపడియె.
జండచేష్టితోద్దండవేదండమునకు. 313

క. అగ్గలిక దండధారుఁడు, దిగ్గజనిభనిజగజంబుఁ § దీవ్రత మెఱయన్
డగ్గఱఁగఁ బఱపి హయముల, నగ్గరుడధ్వజునినరుని § నమ్ములఁ గప్పెన్. 314

చ. అలిగి కిరీటి మాగధ ధరాధిపుబాహులు ద్రెంచి గ్రక్కనం
దలయును ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె నప్డు గొం
దల మొకయింత లేక తనితమ్ముఁడు దండుఁడు దాఁకి తోమరం
బులు వరఁగింపఁ గేలు శిరసముం గఱటం బునుమాడె నుగ్రతన్. 315

క. తదనీకంబుగజంబులు, పొదివిన బలుగాలి మేఘములఁ దీవ్రగతిం
జెదరించుపగిది నరుఁ డున్మదుఁడై నలుదెసలఁ దోలె § మనుజాధీశా. 316

వ. ఇవ్విధంబున మగధసైన్యంబు మర్దించి సంశప్తకసైన్యంబుపైఁ గవిసి కపికేత
నంబు మెఱుంగులు మెఱయ మధుమథను నేర్పున వెలిమావులగతు లక్కజంబు
గా నుక్కునఁ బార్థుండు భల్లనారాచప్రముఖప్రదరపరంపరలసొంపును బాహు
వీర్యధైర్యంబులపెంపును సలింపనిక్కరంబు వర్ణింప నందు మహార్ణవంబునం
దిరుగుమందరనగంబుచందంబున నిజస్యందనంబు ద్రిప్ప నప్పటప్పటి కెక్కు
డౌదగుమదంబునం ద్రిగర్తాదు లగునమ్మార్తురు పైపయిం గ్రమ్మ రియునస్త్ర
శస్త్రంబులు విదళితచ్ఛిన్నచూర్ణితంబులు సేయుచుఁ దదీయగాత్రంబులుం గరటి
ఘోటకతనువులుం దునియ లయ్యును నుగ్గు లయ్యును బఱియ లయ్యును గుదు
లయ్యును ధరం దొరఁగ దామరబావిం గేలినల్పు హాముదంబు వాప్పునవిహరించి
యవిహతధృతి ప్రతమహితు లగునహితుల సత్యుత్తమలోకంబులకుం బుచ్చినం
గొంచెపుమూఁకి విచ్చినం బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి వచ్చునెడ
నచ్యుతుం డర్జును నుద్దేశించి భవద్విక్రమవిహారస్థలంబు సూచితే యని పలికి
వివిధాయుధఖండంబులను వేదండాశ్వరథపదాతిశకలంబులను భూషణాతపత్త్ర
కేతుచామరాంశంబులను జఘ్నశ్మమత్కరణపరిణతం బగురణస్థలంబు సూపె
నప్పుడు గోఱప్రాణంబులతో నొఱలునరతురగద్విరదంబులను గొందఱు దమ
వారిం గానక [2]కన్నీరు నించుచు నాలింగనరోదనప్రముఖంబు లైనకరుణాభాష
ణంబు లగునవస్థావిశేషంబులం బొందువారలం గృపాళు రై యాలోకించుచు
నయ్యిరువురుఁ దమవిహారంబున నెసంగుకలకలంబు విని యుదీర్ణగమనం
బునం జనుదెంచు చుండె రట మున్న కౌరవ్యుల మొనయును గర్ణుని మొగ్గ

1. క. తియమునన్. 2. క. గ. వాంలకు నీళ్లచ్చుచు.

రంబును రెంటనుముఖంబులం బెనంగు చుండి కయ్యంపు[1]టుచితత్వంబునం గలసె
నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుం బ్రాపయి పుళిందబాహ్లిక కేంక
గాంధారభోజానీకంబు గవిసినం గౌంతేయబలంబునకు భరం బగుటయు. 317

—మలయధ్వజుం డను పాండ్యమహారాజు అశ్వత్థామచేతఁ జచ్చుట.—

సీ. పాండ్యుం డాసేనలపై బెట్టిదంబుగ, నదరి బాహాబల § మార్కొనఁ జనుగఁ
[2]బెరిచి పీనుంగుపెంటగాఁ జతురంగ,ముల రూపుమాపె నయ్యలఘుభుజుండు
ద్రోణభీష్ములు దనతోఁ బాటి యనుపలు,కున కొర్వఁ డచ్యుతార్జునులు దనకు
నెక్కుడు నా విన్న § నేవగించుచు నుండు, నప్పీరుం డెమ్మెయి § నాక్రమింపఁ.

ఆ. గని కడంగి యెదురు § చని గురుతనయుండు
నగుచుఁ బగఱ నీవు § మృగకులంబు
గలఁచుహరియుఁబోలెఁ § గలఁచెదు నాదిక్కు
మొగము సేసి యనికి § మొనయు మనియె. 318

చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపునారసంబుఁ ద
త్తనువును గ్రుచ్చి మార్వినినదంబు నభంబునఁ బర్వ నంపవె
ల్లి నిగుడఁ జేయఁ దొమ్మిదిశిలీముఖముల్ వెన నమ్మహీశుపై
ననిమిషవర్ణనీయగతి § నగ్గురునందనుఁ డేసె నేసినన్. 319

వ. అత్తొమ్మిదింటిలోన. 320

క. ప్రతిశరములు పాండ్యమహీ,పతియును [3]బరఁగింప నైదు § భగ్నము లయ్యెన్
గతి సెడక నిగిడి రథ్య,ప్రతతి ధరం గూల్చె నాల్గుబాణము లధిపా. 321

తే. మఱియు గురుపుత్రుఁ డేయ నమ్మలయ కేతుఁ
డాశరంబులఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల § నభముఁ గప్పె. 322

వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యవంతుం డయి వాయవ్యాస్త్రంబున నయ్యంపపరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయచక్రరక్షకులం దెగటార్చి యార్చినం గెరలి యగ్గురునందనుండు దత్సహచరుల నుఱుమాడి రత్నమయాగురుచందనసుందరం బైన మలయగిరిప్రాకారంబునం బొలుచు కేతనంబు గూల్చి గుఱ్ఱంబుల గీటడంగించి సూతుప్రాణంబులు గొని చాపంబు ద్రుంచి తేరు దుమురు సేసి యతండు వాలివోనిపౌరుషంబునం బ్రయోగించు నస్త్రశస్త్రంబుల నుఱక నఱకి యుగ్రుండై యున్నను గయ్యంబువలని వేడుక నతని సమయింప నొల్లక యరవాయి గొనినయాలోనఁ బతితయోధం బైన సుకల్పితమాతంగంబు నెక్కి గిరిశిఖరంబు

1. క. గ. జ. టుచితంబునం. 2. క. గ. చ. బెర్చినఁ బీనుంగుపెంటలై ...రూపుమాపె.
3. క. జ. నదరిరేపనేను

నలంకరించు కేసరియట్లొప్పి యాద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం దఱిమి
భీమాభిరామం బైన తోమరంబు వైచిన మణిగణోజ్జ్వలం బైన యాదాక్షిణిశిరో
భూషణంబు ధరణిం బడినం ద్రొక్కంబడిన భుజంగంబు పోలికం గనలి యుబ్బలు
మగండు తత్పార్శ్వవర్తుల నార్వుర రథికవరులం దద్వేదండంబు తుండంబును
జరణచతుష్టయంబును నమ్మేదినీపతిపాదంబులుం గరంబులు శిరంబును నతితీవ్ర
భల్లంబులం దునుమాడిన నద్దిక్కుమూఁకలు విచ్చిం గురుభూవరుం డమ్మహీసుర
వరుం జేరం జని యగ్గించె నప్పుడు. 323

కం. నిలు నిలు మని తమమూఁకల, నిలిపి వృకోదరుఁడు గవిసె నీబలములపైఁ
దలకొని ధృష్టద్యుమ్నాదులు సంరంభోద్భటముగఁ దోడ్పడి రధిపా. 324

కం. వారలవడి కోర్వక యుక్కౌరవసైన్యంబు దెరలఁ గర్ణుఁడు దర్ప
స్ఫారత నడచ్చి నిల్చి యుదారగతిం వైరిరథికతతి మార్కొనియెన్. 325

వ. అతనికిఁ బాసటయై యడరిన యశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వొలిసిరి
కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి సమీరనందనకర్ణాదు లగు
నిరువాఁగుఁరథికులపరాక్రమంబును వేఱు వేఱ నిరూపించి చూపిన నతండును రథం
బు మనసేనలోనికిం బోవ నిమ్మనిన నతం డట్ల జేయ నుబ్బినపాండవానీకంబునకును
రాధేయగురుపుత్త్రులరథనంబునం బేర్చినవానమొనకును సంకులసమరం బయ్యె
నం దాకర్ణునకు ధృష్టద్యుమ్ననకుం బరస్పరశరకర్తనంబును నితరేతరచ్ఛత్త్ర
కేతుఖండనంబును నన్యోన్యవర్మవిదారణంబును మిథశ్శరీర[2]పాతనంబును నగుసం
గ్రామంబు సెల్లె నట్టియెడ నాసూతినందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపద
నందనుం గవిసి బ్రహ్మఘ్న నిలునిలు మేనుగలుగ నెట్లు బ్రదికెద వని పలికి వెండియు.

కం. మాతండ్రి యెడం జేసిన, పాతకము కతంబు గాఁగఁ బాంచాలనికృ
ష్టా తునిమెద నిను నరుఁ డిట, యేతేరక యున్నఁ బాఱ కీవు నిలిచినన్. 327

వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కిట్లనియె. 328

కం. మాతండ్రి [3]కుటిలికి నటికిన, [4]హీతియ నీకొలకు నునిచి యిపుడ నలుకుదుర్
నీతులువపలుకులకు నీ, డై తోఁచినయుత్తరంబు నదియె దురాత్మా. 329

వ. అని యంత నిలువక. 330

తే. వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకుఁ జనునె బ్రాహ్మ
ణబ్రువఘ్నుఁడ నై సముత్సన్నతి వహించు
నన్నుఁ గిల్చినవరుఁ డనుకనిన్ను జనకు
కడకుఁ బుచ్చెద వేగిరపడక నిలుము. 331

---

1. క. వారలయురవడి కోర్వక, కౌరవ. 2. క. శాతనంబును. గ. పాటనంబును, 3. క. గ. చ. కోర్కి, నటికిన. 4. క. గ. జ. హీతియు నీకొలకియును నిప్పుడ నలుకుదుర్. చ. హీతిన నీ వైనకోర్కి నిపుడ నలుకుదురా.

వ. అనియె న ట్లయ్యిరువురు నొండొరులం బరుషంబులు పలికి తలపడి వియత్త
లంబు విశిఖశిఖాకలాపంబులం గప్పిరి రాధేయుండు యుధామన్యుని నుత్తమౌజో
ద్రౌపదేయసైనేయులను మఱియుం జేయుంగల పాండవ పాంచాల యోధులను
బొదివి ఖండనంబు సేయుచుండ నా ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుకోదండంబు
దుండంబులు సేసినం గుపితుండై యొండువిల్లుం గొని యవ్వీరుండు. 332

క. సూతతురంగస్యందన, కేతనచాపములు సఱికి కేళిమెయిన్ ను
గ్గై తోరఁగ నేసెఁ ద్రోణి, నాతఱిశక్తియును గదయు నతఁ డెత్తంగన్. 333

వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలకయుం గొని కవియం గడంగిన నదియును
దుమారు సేసి పెల్లేసి పడకున్న నశ్వత్థామ[1] వేగిరపడి వెఱఁగందుచుఁ జేతిబాణా
సనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబుదెస కడరువిహంగపతివిధంబునఁ
జనుట సూచి సవ్యసాచితో శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్త్రుం బారిం బడినొం
గావవలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్వరుండై యవ్వీరుం డాద్రుపద
పుత్త్రుం గవిసినకొలందిఁ గ్రూరంబు లగునారాచంబులు గుప్పించుచు నొప్పించిన
నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి మఱలి యరదంబునకరుగ సహదేవుం
డు దన తేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవ
సంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి బెట్టిదంబుగాఁ గనుకనిం దాఁకియతండు
నాటినసునిశితశరంబులఁ బోలె సారథి రథంబు బొంకువాలనికిం దోలె నర్జునుం డట్లు
నిజసేనానాథు రక్షించి ద్రోణిమదం బడంగించుటకు నుంకొని కౌంతేయసైనికులు
సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదులనాదం బెసఁగి నింగి నిండిన. 334

తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితాక్షుఁ డై తలఁపడఁ దలఁచె నపుడు
తత్క్షణమున సంశప్తకతతియుఁ దోఁచె
రెండుఁ గని యిట్టు లనియె నాకిరీటి హరికి. 335

వ. కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులుఁ గ్రమ్మఱం[2] బొదివిరి కర్ణు
చేతం దగులువడితి మేని సంశప్తకుల కోహటించినవార మగుదుము వారల
దిక్కు దేరు వోవ నిమ్ము. 336

చ. అన విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డా రిపుకోటి ముట్టి యే
పున నఱుమాడుచుండెఁ గురుభూవర యప్పుడు ధర్మసూతనం
దనులు సముద్ధతిం గడఁగఁ దండడి క్రొత్తగ వారిసేనయున్
మనమొనయుం బెనంగె నుపమారహితం బగు విక్రమంబునన్. 337

ఉ. సంగర మేను పెక్కుదివసంబులు సూచితిఁ గాని యెప్డు నా
భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము వోరుచున్కియో

1. క. గ. ఈ. వెఱఁగుపడి చేతి. 2. క. మఱిఁ బొదవిరి కర్ణు.

త్రుంగుచు నున్కి యో[1]యెఱుఁగఁ దూలక పైపయిఁ గ్రమ్మఁ గూలు సే
నాంగము లందు నిందుఁ గలహాంబుమహోగ్రత యేమి సెప్పుదున్ 338

కర్ణుండు పాంచాల సైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట.

తే. అందు బాంచాలవీరుల నశ్వసూత,రథసమేతంబుగా నంగరాజు దర్ప
మెసఁగ నేవురఁ బదువుర న్వేవురను మ,హోన్నమార్గణములఁ దునుమాడె నధిప.

క. పదపడి పాండవయోధు, ల్వాదివినఁ బెనుఁదుంగమడువుల గజపతి యు
న్మదవృత్తిఁ గేలి సలుపువ,గిది నాతఁడు[2]వోలె సురలు గీర్తన సేయన్. 340

వ. అట్టియెడ. 341

చ. ద్రుపదతనూజులుం గవలు ద్రౌపదిపుత్త్రులు శౌరితమ్ముఁడుం
గుపితమనస్కులై బలుపుఁగోలలఁ దాఁకి రతం డదల్చి యు
గ్రపురభసంబునన్ శరపరంపరలం బరఁగించెఁ గౌరవా
ధిపుహృదయంబు మోదమునఁ దేలఁగ నందఱయంగకంబులన్. 342

వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగుకయ్యంబునకు వెరవు గల కళింగవంగాంగ
మగధసుహ్మపౌండ్రాదిదేశంబులబలంబులం గవియించిన నవి తదీయచతురంగ
బలంబుల మట్టి వల్లాడి చిత్రవధవిహారంబు సలుప నగ్గజప్రధానసేన లగ్గలికం
జించి చెండాడుచు నాదండిమగలును జేకితానప్రభద్రకులును రౌద్రరసంబునం
బెనఁచినం గనుంగొని మదంబునం బొదలి యుత్తరించి యురవడించిన. 343

శా. వంగాధీశుఁ గరీంద్రుతో [3]నడఁగ గర్వస్ఫూర్తి శైనేయుఁ డే
యం గేలీగతి మాద్రిలేఁగొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
భంగిం గూల్పఁ దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబున ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్. 344

క. విను మల్లేచి నకులుఁ బొది,వ నుదగ్రధ్వని ననేకవేదండము లం
దెనిమిదిటిఁ గూల్చెబాణము, లెనిమిదియెనిమిదులఁ దమ్ముఁ దేఱ్ఱజనధిపా. 345

క. ఆ ధృష్టద్యుమ్నాదులు, గ్రోధాంధత నడరి యేనుఁగుల నస్త్రహతిన్
వ్యాఘాతములుగఁ జేయుచు, రాధేయుం గదియ సంగరము పేర్చె నృపా. 346

వ. ఆసమయంబున శోణితంబు వెల్లువ యై నెగసినరేణు వడంగిననిరువాఁగునై నిక్కు
లును దఘటిమయుడియాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు నెఱసి
పెనంగు చుండ సంశప్తకసంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబు సేసినసవ్య
సాచికి శౌరి యక్కౌరవపాండవబలంబులపోరు సూపి యప్పుడు దుర్యోధనుండు
దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టుతలంపున బెట్టుపొదు
వుటయు నమృతంబున కానపడి యడరునసురుల మరల్చుశక్రాగ్నులచందంబున

1. క. గ. జ. యనలఁగ. 2. ఆ. దోలె. 3. క. నడుమ; గ. జ. నప్పుడు.

భీమసేనుండును సాత్యకియుం బ్రతిహతులం జేయుటయు నంత నిలువక యక్కురు
విభుండును గర్ణకృపాశ్వత్థామలును సుద్దామగతి నత్యుగ్రశరజాలంబుల
నమ్మూల జడియుచుం గదిసి యక్కౌంతేయాగ్రజుకంకటంబు ద్రుంచివైచుటయుఁ
గర్ణునుత్సాహంబునం గడంగుధార్తరాష్ట్రులసింహనాదంబులకుం దెరలక మరు
త్సుతుండు మండలప్రచారుం డగుటయు నాసూతనందనుండు మొనలగునమ్మేటి
మగలమార్గణమ్ము లమ్మనుజపతిపైఁ బఱఁగుటయు నకులసహదేవసాత్యకిధృష్ట
ద్యుమ్నద్రౌపదేయప్రభృతు లైనపాండవేయపాంచాలాదియోధులం గలంచి
యక్కర్ణుండు కమలాకరంబునం గేలి సలుపుమదాలంబులీల నటించుటయు
నవ్వీరుం డగ్గలిక నక్కవ్వడి వాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన
యప్పరిపాటి యంతయు నేర్పడం జెప్పి యీ రాధేయురథనం బుగ్గడించి
మఱియు ని ట్లనియె. 347

క. నినుఁ దలఁపడఁ జూచినయీ, తనియెడ్డెఱ మంట సొరఁగఁ । దలఁచు మిడుతయు
బ్బున కెన యై నాకుం దోఁ, చినయది మ్రందింపు మితని । శితవిశిఖములన్. 348

వ. అని పలికి యతని కప్పుడు దోడ్పడ నుత్సహింపుమధవత్సుతు నుపలక్షించి బీభ
త్సునకుం జూపి. 349

ఉ. ఇత్తఱిఁ ద్రుళ్ళు సూపి నిను । నేవున మార్కొని గెల్వ నెన్నలం
బెత్తి సుయోధనుం డదయ । హీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో
మత్తగజంబులీల నెల । మూమిడిఁ గూల్చినభంగిఁ బాండుపు
త్రోత్తమ వీనిఁ గూల్పు మటఁ । దొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్. 350

వ. అనునవసరంబున. 351

మ. సముదాటోపతి వాయునందనుఁడు ధృష్టద్యుమ్నశైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నపర దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి పొగడన్ । రాజుసైన్యంబు లొ
క్కమొగిం బెల్లగిలంగ బెట్టదరి సక్రోధాంతరంగంబుతోన్. 352

క. అడరి పటుబాణజాలం, బడరింపఁగ వారిబలము । లధికరయమున నె
క్కుడుమదము నొలయఁ బైకొని, బడలుపడఁగఁ జేసె నీసుబలముల నధిపా.

క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగినసేన నేమి । సెప్పుదుఁ దనదొం
దడిఁ దాన చదిసె వెనుకొ, న్న కడిఁదిమగల చేతి గాసి । గాదె నరేంద్రా. 354

ఉ. మ్రొగ్గెడువాహనంబులును । మోములు వాడఁగ వాహనంబుల
న్డిగ్గి తలంగుసైనికులు । నేలకుఁ [1]గప్పుడుఁ జొప్పు సొప్పడం
దగ్గుసిడంబులుం గులముఁ । దన్నుఁ దలంచి యొకర్చి యొంటిమై
మ్రగ్గెడువాడు నై కురుధ । రావరుసైన్యము రూపు మాయఁగన్. 355

1. క. గప్పుటొప్పు.

ఆ. పావనికి నిషాదపతినందనుఁడు మూఁడు,కొనిన నాలఁ దతనిశకుంజరంబు
కరములోఁ దదీయకరములు శిరమును, నఱకె శితశరములు నాలుగింట. 356

క. మూఁడక్షౌహిణు లిప్పుడుఁ, బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్త్రుని యెదురన్
వేఁడిమి సూపఁగ నొకఁడు, న్వాఁడినుగఁడు లేఁడ యే మనంగల దధిపా. 357

వ. ఇవ్విధంబున విక్రమించినభీమసేనుబరవసంబును దదీయసైనికులసంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 358

క. నీచెప్పినమెయి నూడఁగ, నీచత వాటిల్లె మన యనీకమునకుఁ దా
రేచేటు సెడిరొ కౌరవు, లాచరిత మ్మపన్యసింపు మంతయుఁ దెలియన్. 359

క. అనవుడు నతఁ డిట్లను న,మ్మనుజపతికి హితులు సెప్ప మానక నీచే
సినదుర్ణయమునఁ జేటొం,దెను వగవక రణము వినుము ధీరవిచారా. 360

వ. ఇట్లు భీముకడంక గని కవ్వడి దనమనమునం గొంచెపుమూఁకలం దోలి మగిడి మన సేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.

—దుర్యోధనుఁడు భీమసేనుం దలపడి పోరుట.—

తే. ఎందు వచ్చెదు నిలు నిలు మేను గలుగఁ, గడిమి సెల్లునె నీకు నీగుణము విన్న
నంతకునిపాలి కనిచెద ననుచు రోష,రక్తలోచనరుచుల శరములు వఱపె. 362

క. రాధేయుండు సుదీర్ణ,క్రోధుం డై గర్జితోగ్రగుణరవము నభో
[1]బాధం బొనర్పఁగా నిజ,యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్. 363

వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పోరికి నమరుటయుఁ బాండవబలంబును దిరం బయి పెనంగం దొడంగె నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయం గలదొరలు దలపడి యుక్కున నక్కజం బగునమరక్రీడ సలిపి రందు. 364

సీ. కర్ణుఁ డేపారి శిఖండిరథ్యముల సా,రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ
విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడును గాను,దగ్గుఁడై తఱుమునఁతంపు దొలఁగఁ
బాఱె దుశ్శాసనపార్ష్ణ తులాండొరు,తనువులు నొంచు ననిమిషులకు
నచ్చెరు వగునట్టియని సేయు వారల,యనుచరు లెడ సొచ్చి పెనఁగి రంగ

తే. రాజు సూడఁ దత్పుత్త్రుసారథిశిరంబు,నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ జకితమైక
లంగునచ్చటిమూఁకఁ జలంబు మెఱయ, నిలిపె నానూతసూనుండు నృపవరేణ్య.

వ. అట్లు సారథిరహితుం డైనవృషసేనుండు వేఱొక్కసూతు నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుం డై నిలిచె నకులుండు నొండుదెస కడరె సహదేవుండు లూకుని విరథుం జేసి పఱపె సాత్యకిసౌబలు లన్యోన్యకేతుపాతనంబును బరస్పర

1. ఆ. 'వీధి యగుమ నిగుడఁగ నిజ: గ. వీధిఁ బొలుపారఁగా నిజ

కంకటకర్తనంబునుం జేసి రాజ్ఞైనేయుండు దురంగంబులం జదిపిన నరదంబు
డిగ్గ నుఱికి యొరసరించునగ్గాంధారవిభుం గని యులూకుండు. 366

క. మును సహదేవుం డగవం, బనినప్పుడ యొందుదేరు నవరించుకొనం
గనుట నది సేర్చి యలినిం, గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. 367

ఉ. అచ్చటిమూఁక నల్గడల నాతురతం జెడి పాఱ భీముచేఁ
జచ్చెఁ గురుక్షితీశ్వరునిసారథి గూలె హయాలినుగ్గు గాఁ
జొచ్చె రథం బతండు వెలి సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె
న్నిచ్చిన నీదుయోధవరు లేడ్తెఱ మూఁకని రమ్మురుత్సుకతన్. 368

వ. యుధామన్యుండు కృపాచార్యధనువు దునిమిన నమ్మహాత్ముండు వేఱొక్కవిల్లెత్తి

ఆ. కేతనంబు గూల్చి యాతపత్రము దును,మాడి సూతుఁ జంప నధికభయము
గదిరి తేరు దాన కయ్యంబునకుఁ దొలఁ,గంగఁ దోలె నతఁడు కౌరవేంద్ర.

క. శితశరము లుత్తమౌజుఁడు, కృతవర్మనిమేన నింపఁ గినుక గదిరి మూ
ర్ఛితుఁడుగఁ జేసె నతఁడు వెస, నతనిం దత్సారథి డగ్గఱ నరదముఁ దొలఁగన్.

అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట.

చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురముకడంకమైఁ దఱియ దోర్బలశౌర్యము లుల్లసిల్ల ని
ష్ఠురశరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవున్ వియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీ జయనోత్సవంబుగన్. 372

క. అలిగి నరుఁ డైంద్ర మాదిగఁ, గలదివ్యాస్త్రంబు లేయఁగా నయ్యాయు
జ్జ్వలమార్గణంబులను నక్కలశభవసుతుండు మాన్పెఁ గౌరవముఖ్యా. 373

వ. ఇవ్విధంబున వివిధాస్త్రంబులం బోరిపోరి. 374

సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు, విజయునిదక్షిణభుజము నాఱ
మాఁడేయ నొచ్చియుఁ బోఁడిమిసెడక యు,బ్బలియుండదల్పెఁ దత్పాపవర్త
లగుపెనుమూఁకల నమ్ములవెల్లిఁ జే,రల్క నక్కుంభజాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర,ధ్వజము నవ్వీరుగాత్రము బొదివె

తే. మెఱుఁగువాలంపగముల నమ్మేయి నరుండు, ద్రోణితోడ భరంపసిరణ మొనర్చు
చుండ నటమున్న ధర్మజుఁ డుపవసించి, చిత్రసేనుని నమ్ములఁ జిక్కువఱిచి.

క. తఱిమి తనమునుము సైన్యము, నుఱుమాడఁగఁగని సుయోధనుఁడు మున్నగ నే
డ్తెఱ నీయోధులు మూఁకని, యుఱిముఱి నొప్పించి పట్ట [1]నడరి పొదివినన్.

ఉ. పావని మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడున్ వెస వారిఁ దాకినం
జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్రబా
ణావృతమూర్తిఁ జేసె మనుజాధిప యారథికావలిన్ దను

1. నటిమి.'

దనుపయి నాగ్రహించెదు హితం బగుకార్యమె యమ్మహీశు నీ
వనిఁ దెగటార్చినట్లయిన నర్జునుఁ డుత్కటశోకరోషముల్
పెనఁగొన నిన్నుఁ గావులఁ బీనుఁగుపెంటలఁ జేయకుండునే. 389

తే. ఇతఁడు దెగటార్చెనేనియు నేమిఫలము, గలదు నరుఁ బొలియించుట యలఘుశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్య, సిద్ధియును జేయు నింక నా బుద్ధి వినుము. 390

వ. అదియునుం గాక. 391

క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొడువఁబడియె న
వ్వాఁడిమగని కష్టము నీ, వేఁడిమి దక్కంగఁ గలదె వేఱొకఁ డెఱయన్. 392

క. పవనసుతుచేత నాభూ, ధవుఁ డీల్గెనయేని నీవు ధర్మతనయునిం
గవలన్ సమయించుట గలుగఁ, బవ వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ. 393

క. అని విని యుత్తాల్భవ, త్సనయుని దనఁ జూచి వాయుతనయుని చేనా
తనిపొడువఁబడుట యేర్పడఁ, గని రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్.

క. చనుటయు నజాతశత్రుఁడు, దనశిబిరంబునకుఁ గిన్నతమ్ముని యరదం
బున నతని నతనియన్నను, గొని చనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా. 395

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందనుపలాయనం బెఱింగించె
ననుటయు. 396

ఆ. మొదలిరాజు సభయమ్ముగ నిట్లు సమరంబు, దొలఁగి చనియె నట్టిపెలుచబలంబు
దొరలు నిలిచి పోరుటరిది యనంతరవ, ర్తనంబు విప్రవర్య చెపుము. 397

వ. అని యడుగుటయు. 398

చ. అనిమిషవంద్యమాన ఘనసాదరశీలసుధాయమాన స
త్త్వనలినగంధరూప విబుధద్విషదంతకరప్రతాప సం
జనితనిరస్తకామ మునిసంఘమహార్ణవపూర్ణసోమ వే
దనికరసంవిధేయనిజతత్త్వపరిష్క్రియ నిత్యనిష్క్రియా. 399

క. ప్రమితివిదూరా సుమనః, ప్రమితిసమారాధనప్రసన్నాకారా
గమనాగమననిరసనా, శమనదమనసాధ్యపరమసారోల్లసనా. 400

మాలిని. ద్విజపతివృషభాంకోత్కీర్ణ కారుణ్యపూర్ణా
భజననిరతరక్షాప్రౌఢ నిర్భేదరూఢా
గజదురితసముత్సేకఘ్న హృత్పద్మనిఘ్నా
యజనవిధిఫలత్వవ్యాప్త నిత్యప్రదీపా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునఁ గర్ణపర్వంబునందు ద్వితీ
యాశ్వాసము. 402



హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## కర్ణపర్వము, తృతీయాశ్వాసము.



మచ్చరణాంబుజయుగ
ళీమధుమత్తప్రభావిశ్రుతవిమలచే
తోమత్తభృంగభక్తజ
నామృతసరసీస్వరూప హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు కర్ణుండు కౌంతేయాగ్రజు
విడిచి దుర్యోధనసంరక్షణంబునకుం జనుట విని ధృతరాష్ట్రుండు దనమనంబున 2

క. అనిలజునకుఁ జాలఁడె నా తనయుఁడు మానంబు గాక ధర్మజుఁ డట్లు
బ్బినఁ బోనిచ్చుట రాధాతనయునకుం బుద్ధి యగునె తప్పం దప్పెన్. 3

వ. అని వగచి యుధిష్ఠిరుం డనిపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె నని యడిగిన
సంజయుం డతని కిట్లనియె నట్లు నని యాధర్మతనయుండు రథావతరణంబు సేసి
మందిరంబు ప్రవేశించి సెజ్జ నొడలు సేర్చి నాటి యున్నయమ్ములు వెలికించుకొని
హృదయంబున నమ్మెయి నున్నపరిభవంబు పీడ యొనర్ప విషాదవివర్ణుం డగుచుఁ
గవలం గనుంగొని మీరు సమీరనందనుకడకుం జనుం డని చెప్పె నట మున్న
నకులుం డొక్కయరదం బాయితంబు [1]సేసికొని యుండుట నయ్యిరువురుఁ ద్వరిత
గతిం జని యంబుదంబుచందంబున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయు
చున్నభీమసేనుఁ [2]జేరం జని యవష్టంభవిజృంభణంబునం బొలిచి రంత నప్పాండ
వాగ్రజు తెఱం గేమియు నెఱుంగక నరుండు ద్రోణితోడ భరంపడి రణం బొనర్చు
చుండె. 4

క. నెఱి దగఁ దేజిత మై గమి, మెఱుఁగు లడరునారసమున మిక్కిలి వసి నే
త్తఱి మెఱయ నురము నొంచిన, నుఱి కవ్విప్రుండు వైచె నుగ్రంపుగదన్. 5

వ. వైచిన నవ్వీరుండు. 6

చ. అది దునుమాడి మేనఁ బదియమ్ములు గ్రిమ్మఱ గ్రుచ్చి మూఁడు వె
ట్టిద మగుకోలఁ గూల్చినఁ గడిందిమగంటిమిఁ దాన రథ్యనం

---

1. సేసికొనియు నయ్యిరువురుఁ 2. సేనం జొచ్చి

పదయును నూలుకొల్పికొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం
బొదవఁగ దేవకోటికి నృపోత్తమ యగ్గురుపుత్త్రుఁ డుగ్రుఁ డై. 7

వ. అట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన నహీనవర. 8

చ. హయములు వగ్గముల్ వడఁదక్కయున్న నుగ్గుగఁ గ్రీడి యేయుదుగ్
రయమున నీడ్చెఁ దేరటు దూరంబునకుం దొలఁగంగ నంతయుగ్
భరమున నీమొనల్ గలఁగి పాఱె నరేశ్వర వారిసైన్యసం
చయ మెగవగ్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్. 9

ఉ. పాఱినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపదగ్
మీఱిన నీవ నూడఁగ నప్రమేయపరాక్రమ నీకు బాండవు
ల్మాఱె తలంప నీ దగుబ్బలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్. 10

వ. అనిన విని యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె.

చ. కనుఁగొను మిప్పు డేను దురత్యయమన్మరుఁ బార్థుని భీమసేనునిం
దునిమెద నస్త్రసంపదయు దోర్బలవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పార మొందు మే
దిని గురునాథుఁ డొక్కఁడ యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్. 12

వ. రథరథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జుమ్మీ యని పలికి విజయంబు
వీఁకించి గుణంబు సారించి గాండీవంబు నీ కెదురే యని యుగ్గించి యప్పాను
పై వయి నురవడించువరసైనికులం జేయెత్తి యదల్చి భార్గవాస్త్రంబు ప్రయో
గించిన నమ్మహనీయసాధనంబు. 13

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం
దేరుల్ ద్రుంగఁగ వారణంబులు ధరం ద్రెళ్ళంగ నశ్వాలి ను
గ్గై రక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంతచూర్ణీకృతా
కారత్వంబు భజింపఁ గేళి నలిపెం గౌంతేయసైన్యంబునన్. 14

వ. ఇవ్వరుసున భార్గవాస్త్రబాధితం బై యప్పాండవబలంబు వెఱచఱచి మరలి
పఱచిన మనమూఁకలు వెన్నడిం దఱుము నానూతనందనుం దట్లేచి యార్చి
యుంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ తెనిమంటవగిదిఁ బ్రదీప్తుం
డయినఁ దదుత్సాహంబున గోటువడి యాసైన్యంబుజనంబులు హాహాకారంబు
లెసంగ దీనదశం బొంది ముకుంద పురందరనందనులం జేరఁ జని యాక్రందించి
రట్టియెడ. 15

నడవడి నీకుఁ జనుం గాని జనంబులు నన్నుయునం బోరి కోపాటించి పోయె నని యాడుదు రని చెప్పిన నప్పార్థుండు. 25

ఆ. నరభసముగ నన్ను | సంశప్తకులు వీరె, తోడరు మన్నవారు | దొలఁగి నాకు
నరుగ నెట్లు వచ్చు | నని చూపె నతనికి, నప్పుడు గడఁగి వచ్చె నబ్బలముల. 26

క. చూపుటయు నగ్గలం బగు, నేపునఁ గయ్యమ్ము వైర | యేనుఁగులఁ జెదర్
రూపు సెడఁగ నమ్మునలను, భూపతి నరయంగ నివ | పొ మ్మనియె. నృపా. 27

—•• కృష్ణార్జునులు ధర్మరాజు సేమం బరయ నతనిశిబిరంబునకుఁ బోవుట. ••—

వ. అనిన నట్లకాక యని యర్జునుం డచ్యుతు నాలోకించి యామహీపాలుం గను నంతకు నామనంబు గలంగెడు రథంబు రయంబునం బోవ నమ్మని పలుకుటయు నతండు భీముం జూచి యేము మహీయున్నసేనం బరయుట వలయుఁ బని గావునం జనియెదము నీవు కురుసైన్యంబుల యుద్ధంబు నెదుర్చి గెలుపుగొను మని యగ్గించు తెఱంగున దీవన లిచ్చి తురంగమంబులం ద్వరితగతి నడపె నివ్విధంబున మాధవధనంజయులు సమరంబునకు సమానంబునం జాలించి శిబిరంబున కరిగి ధర్మనందనుమందిరంబు ప్రవేశించి యతండు శయ్యాతలంబున నున్నయన్నరపతిం గని యాతండు కుశలి యగుటయునకు ముదంబు నొందుచుం దదీయచరణంబులకుం బ్రణతు లయి రాజన్యాగ్రణుండు వారలు రాధేయు వధించి వచ్చిరకాఁ దలంచి డెందం బలర మందస్మితంబుతో నభినందించి వారలవదనంబులు వీక్షించి యిట్లనియె. 28

మ. సుర సైన్యంబుల మెత్తి కర్ణుని రణక్షోణిన్ జయింపంగ నే
ర్తురె యవ్వీరుఁడు వాయువహ్న్యర్కశితాస్త్రోద్ధ తేజంబునన్
దొర సప్తార్ణవకీలాపూరం బవనితోఁ | దుల్యం [1]డగణ్యుండు సం
గరసంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ | గాంభీర్యధైర్యంబులన్. 29

తే. అట్టిబల్లిదు ననిఁ దెగటార్చు టెట్టు, లేమియును గాక వచ్చితి | రింతసంత
సంబు దొరకొను నే నాయనంబుచింత, వంత యెల్లను జనె నార్యవర్యులార. 30

చ. అతనికి నాకునుం గలిగె | నాహవ మింతకు మున్ద రంగుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు | శాంతనవాంతకుండును ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు | సూతహయధ్వజపాతనంబు నే
సి తనువు దివ్యకాండములఁ | జెందఁగ నేవె [illegible]. 31

వ. అప్పుడు దుర్యోధనప్రభృతిధార్తరాష్ట్రులకు భీమసేనుప్రతాపంబున బ్రదుక రానియంతి పుట్టిన నన్ను విడచి యాతం డట పోవ నేనిట వచ్చితి ననిన చెప్పి వెండియు గాండీవి నుద్దేశించి. 32

---

1. దుల్యుండుడు శల్యుండు.

సీ. పదుమూఁడువర్షముల్ పగలును రేలును, గర్ణుదర్పం బెట్లు గడతునొక్కొ
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక, పరితాప మొందితిఁ బనువుఁ జేయ
విప్రులు వట్ట రా వెలి సొచ్చి యొదిఁగెదు, గవయంబుచాడ్పునఁ గర్ణభీతి
నుల్లల నడుకుచు నుందుదుఁ [1]గర్ణుండు, విడువక మోమున వ్రేలు నాకు
తే. సురనదీసుతుచేతను గురునిచేతఁ, బడనిపరిభవమున వాఁడు పఱిచె నన్ను
నంతయును నేఁగఁ గాంచి నీయట్టియనుజు,వలనఁ దేజంబు వడసితి నలఘుచరిత.

చ. వెరవును లావు దివ్యశరవీర్యము శౌర్యముఁ గల్గుకర్ణు న
ప్పురుషునఁ జంపి తీ వతనిబంధులు మిత్త్రులుఁ బుత్త్రులు౯ సము
ద్ధురబలు లాజికేళినిరతుల్ ధృతరాష్ట్రునిపుత్త్రు లెల్లఁ ద
త్పరిజను లెట్టు లట్టు లనిఁ బ్రాణము లిత్తురు వానికడ్డ మై. 34

చ. అరు దిది నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి తాతఁ డ
క్కురుపతి సంతసింప నరుఁ గూల్చెద సంగరభూమి నేన యొ
క్కరుఁడును వీఁకఁ దాఁకి యనుగర్వపుమాట సనంగ నీక నేఁ
టిరణములోన నిట్లు ప్రకటించితె భవద్భుజవీర్యశౌర్యముల్. 35

చ. పలికిన నేమి బీరములు వల్కుట సేవకనీతి యూ నధం
బలుకుని యట్లు జూదపునెపంబున ద్రౌపది నింతకాల మ
ప్పలుకు లలంచుచుండె మదిఁ బాయవు గీఱినయమ్ములట్ల దో
ర్బలదృఢలీల నిప్పు డవి వాపితి తీర్చి తలంతి యంతయున్. 36

క. అతిగర్వ[2]సమున్నతి మగు, నతనిశిరము వానివార లందఱు బాపో
ద్గతితోఁ జూడఁగ సమరక్షితి ద్రొల్లెన విజయ నీదుశితభల్లమునన్. 37

క. ఈరసమునఁ గదిసి శరాసారముపైఁ గురియ నీవు సక్రోధుఁడ వై
పేరురమున వెస నాటిన తోరం బగునారసమునఁ ద్రుళ్లి కడసెనే. 38

వ. అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం డి ట్లను నేను సంశప్తకులతోడం
బెనంగుచుండ ననేకరథసమూహసమేతుం డయి యశ్వత్థామ వచ్చి నన్నుం
బొదివిన. 39

క. ఏనూఱురథంబులు వెనఁ, బీనుఁగుపెంటలుగఁ జేసి పేర్చినఁ గుపితుం
డై నిప్పు లురలుకన్నుల,తో నక్కోదండగురుసుతుఁడు నామీఁదన్. 40

క. ఉఱక యడరి మెఱసినయ,ట్లై నెఱయఁగ గుదుసువడి యతిస్ఫురితరుచి౯
మెఱసి ధను వనలవలయము,తెఱఁగునఁ జక్రగతి ప్రతిహతిం జేసె౯. 41

క. స్వాతిగతుం డగుశుక్రుం, డేతెఱఁగునఁ బరఁగఁ జేయు నెనకపువర్షం
బా తెఱఁగున సాయకవర్షాళియం బావహించె నతఁడు నరేంద్రా 42

క. తనయరదం బెద్దినఁ జూ,చిన మొగమున వ్రేల దీప్తశితవిశిఖముల౯

1. వస్నెత్రి. 2. సమున్నతుఁ డగు.

ననుఁ గృష్ణుం గప్పిన నే, ననఘా కల వరయఁ జాల ॥ నైతి వెగడునన్. 43

క. వదవడి యొకభంగి నతని,మద మడఁచినఁ దొలఁగఁ బాఱె ॥ మానము దూలం
దదనంతరంబ నిన్ను, న్వదకితి నరనాథ మన యనీకములోనన్. 44

క. ఆలోఁ గర్ణునిచేతం, దూలనిచతురంగబలము ॥ దొరలను ధరణీ
పాల మనమొనలఁ గానను, వ్రాలినదర్పమున మెఱయు వరమునఁ దక్కన్. 45

క. అతనిచే నీ విక్కడ, [1]కే తెంచుట వింటి సేమ ॥ మెఱుఁగుటలఁపునై
నే తెంచితి నవ్వీరుని, చేతులలా వస్మదీయసేన నిలువుటన్. 46

క. మనుజేంద్ర కుశలి వగుని, గని నాయన మూఱడిల్లెఁ ॥ గావున మగుడం
జని కొదఁ గొనియెద రాధా,తనయునితల నలము నెఱయ ॥ దర్పము మెఱయన్.

క. ననుఁ జూడుము వేడుకకుం, జనుదెంచి భవద్బలంబు ॥ సంతస మందం
దునిమెదఁ గర్ణుని దుర్యో,ధనుకోర్కియు నీమనంబుతాపముఁ దీఱన్. 48

మ. ధనురాచార్యునిచావు సూచి తగ రాధానందనుం డా సుయో
ధనునిం దమ్ముల వారిసైన్యములనుం ॥ దాఁ గాచువాఁ డై రణం
బునకుం బూనుట నింతి సేయ వలదే ॥ భూపాల యేపారి మం
డున నేయాఱం గలదీపము ట్లరఁడు మంత్రముం గాక యే నార్చెదన్. 49

చ. నరవర పంపు మేను బ్రథనంబున కేఁగిన సూతసూనుఁ డు
ద్ధురత నెదిర్చె నేనిఁ దల ॥ ద్రుంపక తక్కిన విప్రులోక ని
ష్ఠురుసున నిచ్చువాఁడ నని ॥ పల్కిపదంపడి యొక్క తక్కు దు
ష్పురుషునిఁ జూచుమాడ్కి ననుఁ ॥ జూడుఁడు నీవును వాయుదేవుఁడున్. 50

వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట ,భరం బయి యుండు సేనను దడయుట గర్జంబు గాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు కుశలి యై యుండుట యెఱింగి యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కిరీటితో ని ట్లనియె. 51

—ధర్మరాజు గర్ణుండు బ్రదికి యున్నవాఁ డని విని యర్జును గినిసి పలుకుట.—

క. అనిలోఁ దెరలుట దొలఁగుట, యనునివి నయఁ గాక నొచ్చి ॥ యైనను గల [2]నె
ల్లను వెడలఁ జనునె యే న,ట్లును గాకిట వచ్చుటం జూలుక నై తిఁగడున్.

క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీవు నోడి ॥ తనిలజ మాద్రీ
తనయులు మున్నే యోడిరి, మసతోఁ గూడంగఁ గంసా[3]మర్దియు నోడెన్. 53

క. కావున మన మింక ననికిం, బోవం బని లేదు విపినభూమికిఁ జని యు
చ్చో వెఱవు దక్కి తపసుల, మై విచ్చలవిడిఁ జరింత ॥ మందఱముఁ దగన్.

క. కాదేని భీరుదు లాడక, సాదుల మై వినయ మొప్పఁ ॥ జని కురునాథుం
డేది పనిచినను జేసి ద,యాదృష్టి నతండు సూడునను న్మనఁ దగున్. 5

1. 'యే తెంచుట' అనియు వ్రా. ప్ర. 2. నెల్లను. 3. మర్దనుఁ డోడెన్.

వ. అని కెంజాయ రంజిల్లు కన్నుల నన్నరు నాలోకించి. 56

ఉ. నీ తెలుఁ గిట్టి దేని రణనిష్ఠురుఁ బూనక కార్యవాదివై
ద్వైతవనంబునందు సముదగ్రభుజాబలదుర్జయుండు రా
ధాతనయుండు వాని వనిఁ దాఁక నశక్యము నాకు నన్న నే
నీ తెరు వేల వత్తు మహి యేల నశక్తుఁడ గాంతు నేయునే. 57

తే. అని వధించెదఁ గర్ణు నే నని ప్రతిజ్ఞ, సేసి యిటు దెచ్చి న న్నిట్లు సేసి తింత
కట్లు నేర్చితి పాడవుగా నత్తి [1]నేల, వైవ నోర్చితి ననుఁ బగవారినడుమ. 58

ఉ. పంకజనాభుఁడుం బినఁగఁ బల్కిన యప్పలు కిమ్మెయిం దుదిం
బొంకగు టోర్చి తిట్టి నినుఁ బుట్టినయప్పు నుతించెఁ గోరికిన్
శంక గొనండు గెల్చుఁ గురుసంఘము నీతఁడు పుణ్యుఁ డన్నయా
పొంకరి దివ్యవాణియుఁ దపోధనులున్ మఱి నిట్లలంతురే. 59

క. విను మప్పలుకులు పాటిగఁ, గొని దుర్యోధనుని తోడఁ గొంటివి బగ ము
న్ను నిజంబుగ నెఱుఁగను వీఁ, డని రాధేయునకు వెఱచు నని నే నిన్నున్.

సీ. దేవత లిచ్చిన తేరు నశ్వంబులుఁ, గపికేతనంబును గలవు దైవి
కంబుచే నున్నది గాండీవ మనఁ దాటి,యంతివి ల్లది గాక హరి రథంబు
గడపెడు నటు పరికర మిట్టి దై యుండ, నెట్లు కర్ణున కోడి యిట్లు వలియఁ
గాఱు తెంచితి వీవు భండనంబునఁ గర్ణుఁ,గని పాఱు దని సుయోధనుఁడు సెప్పె

తే. వది నిజంబుగఁ గొనక దిక్కెలై తినాదు, [2]బెంచినమునఁ గాదె పాంచాలమాత్స్య
పాండ్య లాదిగఁ గలిగినబంధుమిత్త్ర,జనులు దెగటాతి ర ప్రయోజనముగాఁగ.

వ. అని పలికి కృష్ణునాననం బాలోకించి కర్ణు నిగ్రహించుట యశక్యం బయ్యె
సుయోధనాదికౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతో
నునికిం గడచినకష్టంబునుం గలదే యది యట్లుండె నేను జావు దప్పి వచ్చుట
వడముడికతంబునం గలిగె నతం డొక్కరుండును బ్రాణంబులు డాఁపక పరబలం
బులు బడలువడం బోరు చున్నవాఁడు. 62

క. అని పార్థుఁ జూచి యతఁ డి,ట్లను నేఁ డభిమన్యుఁ డొండె హైడింబుం డొం
డెను గలిగిన నిట్లగునే, విను మును చేసినవి యనుభవింపఁగ వలదే. 63

ఆ. నిన్నుఁ దృణముఁ జేసి నన్నామరాత్మ్యుంపు, బంధుహీనుఁ జోలెఁ బలుకు వెనకరు
డోఁచినప్పు డొదవి తొలఁగించువానిఁ గా, కన్యు లేల బంధు దంష్ట్ర జనులు.

చ. హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి నీదుగాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగ లెక్కు హరిం రథిఁ జేయఁ గన్న ని
ష్ఠురభుజవిక్రమోగ్రుఁ డగుసూతతనూభవుఁ దత్సహాయులం
బొరిగొనఁడే సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. 65

---

1. బయలవైవ కోర్చితి. 2. తెలుదనమునఁ,

ఆ. కొంతికడుపునందుఁ ǂ గొడుకులై నీవు, దోసకుండ వైతి ǂ ద్రోచినట్టి
పిండకూడు లైనఁ ǂ బిదప దిగంబక, దమ్ములింత పుట్టి ǂ దట్టులైన. 66

— ❖ { అర్జునుఁడు దన్ను ధర్మజుఁ డాడినపలుకులకుఁ గోపించి యతనిపైఁ బెలుచ వాలు వెఱికికొనుట. } ❖—

సీ. అనినఁ గృపాణంబు ǂ గొని సవ్యసాచియు, నీభు నేయఁదలఁచిన ǂ విష్ణుఁడెఱిఁగి
వాలు గేల నమర్చ ǂ వలసినకత యేమి, కౌరవు లిమ్మెయి ǂ లేరు మనకు
ధరణీశ్వరునిసేమ ǂ మరయంగ వచ్చితి, మీతనికుశల మి ǂ క్కేర్పడంగఁ
గంటిమి నంతోషకాలంబు గాకిది, క్రోధకాలమె వధ్యకోటి యిచట

ఆ. నేది గాఁగ నలిగి ǂ తీ వని పలికిన, ధ్యానభంగి మకుటకబ్రాటుదృష్టి
యానరేంద్రుమీఁద ǂ నపరంగ నగ్నుఁ, డమ్మురారి కిట్టు ǂ లనియె నధిప. 67

క. విను మొరులకు గాండీవ మి, మ్మని సన్నవ్వలును వలికి ǂ నగనిశిరము గ్ర
క్కునఁ బగుల నేయుటకుఁ జేసినవాఁడఁ బ్రతిజ్ఞ నాదుచిత్తములోనన్. 68

తే. ఇట్టికష్టపుఁ గేలి కై ǂ యిట్లు సేయఁ
బ్రతిన పట్టుట దగదె యిప్పలుకు నీవు
వినఁగ నిటఁ డాడ నిమ్మహీవిభుఁడు ధర్మ
వంతుఁ డగుఁ గాక చంపనవలయుఁ గృష్ణ? 69

వ. చంపి పాలితప్రతిజ్ఞుండ నైననాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద ,దీనికి
నీ వేమి సెప్పెదవు సెప్పుము జగత్కృత్యసాకల్యవేదివి నీచెప్పినట్ల చేయం గల
వాఁడ ననుటయు నచ్యుతుండు పో పొమ్మెక్కుడివాఁడ వని యదల్చి కొండియు
ని ట్లనియె. 70

ఆ. నీకు వృద్ధసేవ ǂ లేకునికి యెఱుఁగంగ, నయ్యె రిత్త యిట్టు ǂ లడిచి వచుటఁ
బట్టి ధర్మవిధివిభాగజ్ఞులైనవా, రేల చేయఁ జొత్తు ǂ రిట్టిదాని. 71

క. చేయంగ వలయువానిం, జేయుట యిట్టివియె కొన్ని ǂ చేయ కునికి ధ
ర్మాయత్తచిత్తుఁ డైనా, నారయఁగ న్నలము లెఱిఁగి ǂ నడవఁగ వలదే. 72

క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమధర్మయుగళమందు నహింసా
సత్యము గాచుట ధర్మము, సత్యమున నహింసఁ గావఁ ǂ జను నండ్రు బుధుల్. 73

ఆ. కర్మసూక్ష్మభంగి ǂ గానక యిమ్మెయి, సత్యరతుఁ డంబు ǂ నలువుపొంటి
ఖ్యాతి ధర్మపరుఁడు ǂ రా జిమ్మహాత్ముఁ జంపఁగఁదలఁచుట ధర్మపథము గాదు.

క. విను పిన్ననాఁడు నీ వీ, యనుచిత మగువ్రతము వట్టి ǂ తది గాకయు నె
ట్టనృతము సూనృతమును నీ, కనిరెమ చందంబు బుధులు ǂ గయికొన రెందున్.

వ. అది యెట్లం టేని. 76

ఆ. ప్రాణహాని వచ్చునట్టున సర్వధ, నాపహారవేళయందు నడవు
సత్యమనృత మండ్రు నత్యంబు సూనృత, మనిపరిగ్రహింతు ǂ రార్యజనులు. 77

వ. విను పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుం డనువాఁ డొక్కవిప్రుం డొక్కవిశిష్టగ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమపుణ్యక్షేత్రంబున వసియించి సత్యంబ పలుకువాఁడ నని వ్రతంబు పట్టి సత్యవాది యనం బ్రసిద్ధుం డయి తపంబు సేయుచుండ నొక్కనాఁడు ముచ్చులం గని వెఱచఱచి పఱతెంచినజనులు గొంద ఱయ్యాశ్రమంబుచేరువం బొదలం దూఱి రంత వానిం దగిలి వచ్చుముచ్చులు తపోధనునికడ కేతెంచి యిప్పు డిట వచ్చినవార లెట వోయి రని యడిగిన నతండు సత్యవిభాగవిధిజ్ఞుండు గామిం జేసి తన కసత్యంబు వాటిల్లు ననుశంక నీ గుల్మలతాగహనంబు సొచ్చి రని చూపి చెప్పిన నత్తెక్కలికాండ్రు వారలం జంపి ధనమ్ము గొని రమ్మని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యె ననునితిహాసంబు విందుము హింసాకరం బగునత్యంబు ధర్మంబు గాదు తొలుత వినినదానిన పట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు నింతవట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం గాఁ డని నిశ్చయింపు మనుటయు నర్జునుం డి ట్లనియె. 78

తే. తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి, నన్ను ననుచితకృత్యంబునకుఁ దొలంగఁ
ద్రోచితివి లోకమున నీకు గోచరంబు, గానిధర్మవిబోధంబు గలదె కృష్ణ. 79

క. జనములు వృథాప్రతిజ్ఞుం, డని నను నిందింపకుండ నగ్రజుఁడు సుఖం
బునికియుఁ గలిగెడునట్లుగ, ననుగ్రహముఁ జేసి చేయునది పనుపు దగన్. 80

వ. అనిన నతం డతని కి ట్లనియె. 81

కృష్ణుఁ డర్జునునిఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ ధర్మజు దూఱు మని చెప్పుట.

చ. అతిశితకర్ణబాణహతి నంగము నొచ్చినదాన నల్గి యి
ప్పతి నిను నొవ్వఁ బల్కె టిది ప్రాభవ మింతియె కాక నీ యెడన్
మతిఁ బటుకోపముం గలదె మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతనివశంబునఁ గాదె చరింతు రెప్పుడున్. 82

క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుఁ గొనక నా
చే వినుము నీదుప్రతినకు, నేవిధి సేయ నగు దాని నేర్పడ ననఘా. 83

క. నీ విట్టివాఁడ వని ధర, ణీవిభునిం బలుకు మదియ నీచంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ, వై వినయము సేయు చిత్త మలర నతనికిన్. 84

వ. అ ట్లయిన ననత్యదోషంబునకును గురువధపాతకంబునకుం దొలంగి సమాహితుండ వగుదు తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు ని మ్మనుజపతియనుమతి వడయుద మనుటయు నప్పలుకుల కభినందించి పురందరనందనుండు ధర్మనందను నుద్దేశించి. 85

మ. కవచత్త్రంబుల నుజ్జ్వలోద్భటగదాఘాతంబులం గాలఁ గే
ళను విద్విట్చతురంగసంఘములు గూలం గేలి సల్పంగఁ జా

లినయాభిముఖుఁడు వల్కుఁ గాక నను దోశ్శక్తిలావమగ్రుండ నై
యనిలో నిల్వఁగ లేని నీమాటలు కీ డాడంగ నర్హుండవే. 86

క. న న్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ, జన్నె నీజిహ్వ వెక్కుశకలములై పో
కున్నది యే లోకో రణమున, నెన్నఁడు నీ వేమి సేసి తింత యనుటకున్. 87

క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గూలఁ ద్రెత్తురు నోరికి వచ్చినయట్టు లాడితిరే యిబ్భంగిన్. 88

సీ. నీవు జూడం బాడఁ గా వైరబంధంబు, కౌరవజాతితోఁ గలిగె మనకు
రాజ్యనాశంబు నరణ్యావాసంబును, దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ
ములుఁ దెచ్చికొంటి సి గ్గొలయదు నీమనంబున నించుకేనియు ననికిఁ జాల
కున్న వానికిఁ దాల్మి యె ప్పగుఁ గాక ప్రల్లదములు పలికిన లాఘవంబు

తే. సెందుము స్నేమి సేసినఁ జేసి తింక
నైన దుర్బుద్ధితనములు మాని తగిన
పౌరుషము లేము సేయఁగ నూర కుండు
మిడుము పడువారు సైతురే యింతవట్టు. 89

వ. అని యగ్రజునప్రియంబులు పలికి యంతరంగంబు సంతాపంబు వొంద నిట్టూర్పు నిగిడించి యంతకము నొఱఁ బెట్టినవాలు వెఱికినం గనుంగొని పద్మనాభుండు గ్రమ్మఱ నిది యేమి యని యడిగిన నతం డే నిన్నరనాథు వో న్నాడిన పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దలఁద్రెంచుకొనుటయ కా నిశ్చయించితి ననుటయు నమ్మహాత్ముఁ డాత్మప్రశంస సేయు మది మరణం బని పెద్దలు సెప్పుదు రనుటయు నీచెప్పినట్ల చేయ కునికికిం గడచిన యధర్మంబున్ను గలదె యట్లు సేయువాఁడన కాక యని యా ధనంజయుండు ధనుర్ధరుం డై ధర్మనందనున కిట్లనియె. 90

ఆ. హరుఁడు దక్కఁ జాపధరుఁ డొరుఁ డెన నాకుఁ
ద్రిభువనముల లేఁడు దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ బెనుపారు
ధనము రాజసూయసదతిఁ గాలకు. 91

వ. దీప్తప్రతాపం బగుసంశప్తకసంచయంబు నడఁగించి కించిదవశిష్టంబుగా నష్టంబు సేసితిఁ గురుసేన నాచేతం గూలి యె ట్లున్నదియో యటుచూడు మని పలికి మొగంబు బిగు వుడిపికొని సవినయంబుగా దండప్రణామంబు సేసి నిలిచి చేతులు మొగిడ్చి యజాతశత్రున కప్పురుహూతపుత్త్రుం డి ట్లనియె. 92

క. నను సుప్రసాదదృష్టిం, గనుఁగొను మేనిపుడు గొన్ని కాఱు లఱచితిఁ
మనుజేంద్ర వానిఁ బెడచెవులను బెట్టుము వేఁడుఁగాఁ దలంపక దయతోన్.

తే. వినుము సత్యంబ పలికెదఁ దనువుఁ బ్రాణ
ములును నీపాలిగా మదిఁ దలఁతు నేను

నాదువృత్తంబు భవదధీనం బనంగ
నేల పనుపుము నను భీమాగ్రపాలి కధిప. 94

క. ఓపి యతనిరణభారము, వాపెదఁ గౌరవ్యసేన ƒ బవలువఁ జించి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద, మాపెదఁ గురురాజదురభిమానము బలమున్. 95

వ. ఎల్లభంగుల నేఁడు రాధేయుఁ బుత్రరహితుం జేసెద గాదేని గొంతిరైన నట్టిద
యగుం గాక. 96

చ. అన విని యుర్వ్యహీరమణుఁ ƒ డాతని కిట్లను మాకు నాకతం
బున బహుదుఃఖముల్ గలిగె ƒ భూరికులంబున కప్రియం బొన
ర్చిన యవినీతుఁ డాపదరు ƒ ద్రేయుఁ దగుం దల ద్రెవ్వ నీమనం
బునఁ గృప పుట్టె కాననను ƒ బోయెద నిప్పుడ యేను గానకున్. 97

క. ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం,బున నుండుము సమరభీతు ƒ భుజబలహీనుం
జనపతిఁ గాఁ జేయుట యొ,ప్పునె కట్టము పట్ట మనిలపుత్త్రునిఁ బ్రీతిన్. 98

వ. అని పలికి సెజ్జ డిగ్గి వనవాసగమనోన్ముఖుం డయినం గనుంగొని కమలనాభుం
డాభూపతిచరణంబులకుం బ్రణతుం డై యిట్లనియె. 99

సీ. నరునిప్రతిజ్ఞ భూవర మున్న యెఱుంగని, యంతియ [1]కా దేను ƒ నితఁడు నిన్నుఁ
డా డినమాటలు ƒ నంతరంగంబునఁ, బట్టవు పేర్చుకోపమున నీకుఁ
దను నెవ్వఁ డీఱక యన్యునకు గాండీవ మి,మ్మని ధిక్కరించె నాతని వధింప
బ్రతిన [2]వట్టినవాఁడు ƒ భావ్యంబు గానియ,ప్పలు కీవు పలికితి ƒ పరమధర్మ

ఆ. మైనసత్యనిష్ఠహానిఁ బొందుట కోర్వ, కునికిఁ జూచి యేన ƒ యుల్లమునఁ ద
లంచి యిట్లు పలుకఁబంచితి గురునిఁ గీ, టాడుటయ వధించు ƒ టగుటఁ జేసి. 100

క. శరణము వేఁడెదను భవ,చ్చరణంబులు పట్టికొని నిసర్గదయాని
ర్భరబుద్ధిని గావుము మ, మ్మిరువుర నీతప్పు సైఁపు ƒ మెల్లవిధములన్. 101

క. సూతసుతుని మెడ నెత్తురు, భూతలమున నిపురు నేఁడు ƒ భూనాయక నీ
వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని [3]యేన ƒ చుమ్ము పలికెదన్. 102

క. విను సత్యం బాడెదఁ బార్థునిచే నేఁ డెల్లభంగిఁ దునుమంబడు క
ర్ణుని డెనఁ జింతయు వంతయు, మనుజేశ్వర విడువు వంపు ƒ మమ్ముఁ దెలివితోన్.

—✿ ధర్మరాజు కృష్ణునివాక్యంబులం గలంక దేఱి ప్రసన్నుఁ డగుట ✿—

వ. అనుటయు ధర్మసూనుం డసంభ్రమంబుగాఁ గృష్ణు నత్తి యతండు ప్రాంజలి
యై యుండ నతని కిట్లనియె. 104

క. ఇది యట్టిద మానంబునఁ, బదిలుఁడఁగా కేను మున్ను ƒ వదిరిన కతనన్
హృదయము గలఁగిన నాకు, య్యదియును దోఁపమి వికారి ƒ నైతి మహాత్మా. 105

ఆ. ఇట్టి నన్ను ననునయించి బోధించితి, కరుణ పేర్మిఁ జేసి ƒ గారవమున

---

1. కాదు ని ♦ న్నితఁ డిప్పు. 2. పట్టినవాని. 3. 'యేను ♦ నుమ్ము' ప్రా. ప్ర.

నజ్ఞులైనయమ్ము త్రి । నాపత్పయోనిధి, మునుఁగఁ గుండఁ గాచి । తనఘమూర్తి.

వ. అనియె నప్పుడు వివర్ణం బగువదనంబు వాంచి యున్నవాసవిం జూచి వాసుదేవుండు నీ విట్లు విషణ్ణుండ వగుట గర్జంబుగా దిమ్మేదినీపతిముఖప్రసాదం బభినందించి యనుమతి వడసి చని రాధేయవధవిహారంబున నితనికిం బ్రియం బాపాదింతుగాక యింకఁ దడయ నేల యని పల్కి వెండియు. 107

ఉ. ఈతని నొవ్వఁ బల్కుటన । యీదురవస్థకు వచ్చి తక్కటా
ఘాతమహాసి నీనృపతిఁ । జంపిన నెల్లగుదో విపత్తికిం
బాతకఘోరవృత్తికిని । బాసితి దైవ మనుగ్రహించుటన్
నీ తెలి వాప్తబంధుజన । నిర్మితపుణ్యవిపాక, మర్జునా. 108

వ. అనిన నతండు గన్నీరొలుక నన్నపాదంబులపైఁ బడిన నప్పాండవాగ్రజుండును బాష్పప్లావితముఖుం డగుచు నతనినిమీఁద నెత్తిగా నిట్లయ్యిరువురు నొండొరులం బట్టికొని యేడ్చి రచ్యుతుండు మనువ నుడిగి తత్కాలోపగతసముచితపరిజనానీత జలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి తదనంతరంబ ధర్మనందనుం డమ్ముకుందుం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి చిఱునవ్వుతో మనల నింత వఱచునే కర్ణుం డని పలికి మఱియును. 109

ఆ. ఎల్లఁ జూడ సిడము । విల్లు నశ్వంబుల, సూతుఁ దునిము నన్ను । నాతఁ డలవు
నెఱయ గెలిచె నతని । నీ విష్టు సంపఁగ, యున్న నాకు బ్రదుకఁ । యుండఁదగునె.

చ. అనవుడు నమ్మహీపతికి । నర్జును డిట్లను నేను కర్ణు నె
ననిఁ బడ వైతు నీయనుగు । లాన తదీయసుహృజ్జనంబుతో
విను మటు సేయ కే మగిడి । వెల్వెల బాఱెదు మోముతోడ వ
త్తునె యిట కృష్ణసారథియుఁ । బూనునె మానవిహీనవృత్తియై. 111

వ. అని గోపాలదేవు నాలోకించి నీమనంబునం గర్ణుండు దెగటాఱు వలయు నని యించుక దలంపుము దాన నే నతని వధియింతు ననిన నమ్మహాత్ముం డట్టిపనికిం జాలుదు వని యుత్సాహవిస్ఫూర్తుం డై పలుకుటయుఁ బార్థుండు నిజరథంబు నవిశేషకల్పితంబు సేయించి రథ్యంబుల జలపానఖాద్య[1]ఖాదనంబులం బ్రబలంబులఁ గావించి పూన్పించి యగ్రజు వీడ్కొని గమనోన్ముఖుం డగుటయు నచ్యుతుం డవ్విభు నిరీక్షించి నీతమ్ముని గారుణ్యార్ద్రకటాక్షంబుల నిరీక్షింపుము దీవన యిచ్చి పనుపు మని చెప్పిన నన్నరవరుండు గిరీటిం దిగిచి బిగియార కౌఁగిటం జేర్చి నీవు కృష్ణునమపునం దగుమాట లాడి తత్తెఱంగు నేనును దెలిసితి నాయెఱుంగమి నిన్నుం బలికినపలుకులకు నుమ్మలింపకుమీ యనుటయు నతండు వికసితవదనుం డగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణతుం డయిన నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి కర్ణునిగెలువు

1. ఖాదంబులు.

విజయ నీకు విజయంబు శాశ్వతం బయ్యెడు మని దీవించిన నమ్మేటిమగండునాటో
పంబుగా దేవ నిన్ను నొప్పించినయప్పాపకర్మ మత్కార్ముకము క్షతశిలీముఖంబులం
బొలివుచ్చి యిదె వచ్చెద ననుచు నంజలిపుటంబు నిటలంబునఁ గదియించి
వీడ్కొనియెఁ దదనంతరంబ దామోదరుండును నన్నరుండును నరదం బెక్కి
యలరునుల్లంబులతో నరిగి శుభప్రదంబు లగునిమిత్తంబులకుం బ్రమోదంబు
నొందిరి పదంపడి రాధేయవధప్రకారచింతాక్రాంతుం డైనగాండీవితనువునం
బ్రస్వేదకణమ్ములు గ్రమ్మినం గనుంగొని కమలనాభుం డతని కిట్లనియె. 112

ఆ. అమరులకు నజయ్యు లగువారిఁ జెండ్రి, గెలిచి తివ్ర నీకుఁ గల యుదాత్త
దివ్యబాణములు నుదీర్ణధనుర్వేద,కౌశలంబు బలముఁ గలదె యెందు. 113

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండు భవన్మహాస్త్రది
వ్యమహిమలో నడంగిరి జయద్రథువా వధికాద్భుతంబు మ
ర్త్యమునన కాదు లోకముల నన్నిఁట నీ కెదు రెవ్వ రేల చి
త్తమునఁ గలంక యూడుము దర్పము నెక్కుడు నంతకంతకున్. 114

క. బలమును శౌర్యముఁ దేజముఁ, గల దని కౌరవులు నమ్మ కర్ణుని నీతోఁ
దలపెట్టిరి నీబాణం,బుల గూలెడు నతఁడు కీర్తివొందెదు నిన్నున్. 115

క. కురుపతియాశలు మాలఁగ, దురమున రాధాతనూజు నునుమాడి జయ
స్ఫురణంబునఁ గృతకృత్యతఁ, బొరయుము నీవారు మోదమునఁ దేలంగన్.

వ. అని వెండియు. 117

ఉ. కౌరవసైన్య మగ్గలము గాదె కడుం భవదీయసేన క
వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
వీరభటావళుల్ బహుళవిక్రమకౌతుకి వైసనీశరా
సారములం బసల్పడఁ గృశం బగు టిప్పుడు నీకుఁ దోఁపదే. 118

క. కురుసేనలకుం బతి యై, సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెన్
శరమహిమ నతఁడు నీచేఁ, బరిరక్షితుఁ డైనసైన్యపాలు మిగిలెనే. 119

చ. అతని శిఖండిబాణముల కగ్గర సేసితి ద్రోణునిం జమూ
పతియుఁగఁ జేసెఁ గౌరవనృపాలకుఁ డగ్గుకుఁడుం బటచ్చమూ
పతి పడఁగించెనే దివసపంచక మమ్మెయిఁ బోరి తావకా
ప్రతిహతబాహురక్ష యిరువాఁగును జూచెద పాండవోత్తమా. 120

క. భీమునిరథవిహరణ ముద్దామం బగు టెల్ల నీమదదర్పంబునఁ గా
దే మాఱు లేనిభవద,స్త్రామేయబలంబు దెలియ నంతయు నాకున్. 121

వ. కృపాశ్వత్థామకృతవర్మకర్ణశల్యులు నీచేతం బోయెడువారు కృపాశ్వత్థామల
దైనం గృప సేసి తేనియుం జంపక గెలిచి విడుము చుట్టం బని యరవాయి

గొనుట కర్జంబు గాదు కృతవర్మను నముఖుంపుము శల్యుండు మేనమామ యై నను బగవారిం గూడి వరాక్రమించు చున్నవాఁడు గావున నతని వధియించుట పాపం బని తలంప వలవదు కర్ణుండు జతుగృహదాహంబును గపటద్యూతోత్సాహంబును లోనుగాఁ గలదుర్యోధనుదుర్నయంబులకు మూలం బట్టుఁ గాక జూదం బునప్పు డాసభలోన ద్రౌపది నుద్దేశించి యుప్పాపాత్ముండు. 122

క. లే రిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి వి డిచిరి నిన్నుం
వారిజలోచన నీవెఁ, గూరిమి గలమగని వెదకికొను మొకు నన(డే. 123

తే. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రమానసములఁ బగ రాఁడఁ బెట్టి
నన్నుఁ బట్టింపఁ జూడఁడే యెన్నఁడైన, నాదికారణ మతఁడ మీయాపదలకు.

చ. వినుము సుభద్రపట్టి బలుకవిల్ మును వంచన వాఁడు డాసి త్రుం
చిన మఱి కాదె యందఱును జేరి వధించుట యీ పరాభవం
బనలముపోలె నున్నది యహర్నిశముం బరితాపకారి యై
మనమున నస్త్రవృష్టి నది మాన్పుము బంధులు మీద మందఁగన్. 125

క. ఆ సభ నాదుష్టాత్ముఁడు, సేసినదుర్నయము సూచి చిత్తమునఁ గనుం
[1]నోసినబంధులు వానిని, గాసిగ దగమి దోలువఁ గనుఁగొన వలదే. 126

వ. వాఁడు వడిసం దక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్టరని చెప్పి యిట్లు సెప్పు చు సమరసలంబున కనతిదూరంబుగాఁ జని యత్తెత్తిచూచి కర్ణుండు సంగరంబు సేయుసంరంభం బుగ్గడించి యుగ్గాండీవికిం జూపి పుండరీకాక్షుండు. 127

క. కేతనము రథముఁ దురగ, వ్రాతముఁ బొడిచేసి నీశరంబులఁ గర్ణుం
వే తునిమినఁ గని శల్యుఁడు, వాతెఱ యొంపంగఁ జూడవలదె కిరీటీ. 128

వ. పూనిక నెఱపి శోకం బుజ్జగించి లోకంబు సంస్తుతింప సుఖవి గమ్మనినం బ్రము దితహృదయుం డై. 129

శా. నీతోడ్పాటున నేఁ డ్రివిష్టపముల నెల్లంగ నూఁకింతు నా
చేతం గర్ణుఁడు రూపు మాలి చను మెచ్చింతుగా నిన్నుం జూడుమీ
దైతేయాంతక యంచు శేషనిభహస్తం బుద్ధతిం [2]జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంతకోదండమున్. 130

—•• అర్జునుఁడు, కృష్ణునివాక్యంబులచేఁ గర్ణునివధ కుత్సహించుట. ••—

వ. ఇట్లు గాండీవం బెత్తి మొక్క పెట్టి యున్నయుండు నేఁడు నా బాణాగ్నిబున బానాస నంబును, నరసంబునుం జూచి సుయోధనుండు శకునియుక్తసౌఖ్యము బలకయుసమ్మం దపంబును దలంపవలయుఁ దననమ్మినబం బైనకర్ణుండు నేనేయు కూపులతాఁకున రూపడంగినం గని యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమికి వగం బొంద వలయు ధృతరాష్ట్రుండు దనకుం గార్యదర్శనంబు లేమి యుగ్గడించి తన్ను నిందించికొన

1. మోసినని (మోసిన. 2. జాచి.

వలయు నతండు కొడుకులదెసను వారు రాజ్యంబుదెసను విగతాసులు గావలయు
నని పలికి మఱియును. 131

ఆ. రాజరాజుఁ బాసి రాజ్యసంపద ధర్మ,తనయుఁ జేరు పెంపు దారు దలియఁ
గాంచి సాత్యకియును గవలును భీముండు, గారవించువారు గాక యన్న. 132

క. సురగరుడోరగవిద్యా,ధరాదిభూతములు సూతతనయుని నేఁడేఁ
బోరి వ్రచ్చిన నముఁ బొగడుచు, నరుగుం గా కునికిపట్లకుం బుజనాథా. 133

వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం గృష్ణార్జునులు నిజసేనఁ జేరి రంతకు మున్న
యిరువాఁగునం జేయుం గలదొరలు దలఁపడినం బోరు ఘోరంబయ్యె నందు. 134

సీ. కర్ణసూనులలోన నొక్కరు నుత్తమౌజుని, చేతఁ జచ్చుటయు శోకాతురుండుఁ
గ్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని, తురగకేతనములఁ దునుము నాతఁ
డడిదంబు సేకొని యరదంబు డిగి కృపా,చార్యరథ్యంబులఁ జంపి భీష్మ
వైరి తేరెక్కె నాశారద్వతుం డట్లు, విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగి

ఆ. నతఁడు పాదచారి యని యాశిఖండి య,వ్విప్రు నేయఁ డయ్యె వేగ పొద్దు
ద్రోణి యతనిఁ దనరథంబుపై నిడికొని, యనికిఁ దొలఁగిచని యొక్క మనుజనాథ. 135

వ. అట్టియెడ. 136

చ. అనిలసుతుండు తీవ్రవిశిఖంబులు పర్వఁగ నేచి యంబరం
బినడుమఁ దేజరిల్లు రవిఁ బోలెను వేఁడిమిఁ గోహటించి నీ
మొన దెరలంగ నారథికముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం
గనుఁగొని మానసంబు దలఁకంగ రణోగ్రత దక్కె నిట్లనున్. 137

క. నరుఁ డన్నువర్తనము లెఱుఁ, గరయుట కై మదిఁ గలంగ నట చనినాఁ డ
న్నురపతిమూర్ధకి గని దు,స్తరశోకం బదరి తానుఁ బదవస్థుఁ డగుఁగా. 138

తే. అయ్యిరువురకు నొకటి యైనట్టి దైన, మనము కౌరవసంఘంబు మ్రగ్గఁ జేసి
గెలుపుగొంటిమ యేనియు ఫలము దాన, నేమి గల దనువగఁ జిత్తమెరియఁ జొచ్చె.

— భీముఁ డర్జునురాకఁ గోరి విశోకునితో విచారించుట. —

క. వినను నిప్పటిదుఃఖము, మానింపఁగ మనకు నొండుపమం బెయ్యది యీ
సేనల దొరలను గౌరవ,భూనాథుని నముయుఁ జూచి పోవుట దక్కన్. 140

వ. అని పలికి యవ్విశోకునకు మనదిక్కు సితంబులు సూపి యవి యెవ్వ రెవ్వరి
చిహ్నంబులు తేర్పడం జూచుకొనుము మనతేరంబులకొలఁది యెట్లున్న దరయు
మనవుడు నతండు వీ రెవ్వరై రేమి నీ వలిగినఁ బసక పాటుక నిలువం జాలువాఁ
డిం దెవ్వం డస్త్రశస్త్రంబులసంపద యనుగ వలదు నేఁడు తెచ్చినవానిలోన
నాతెల్లవ్రేఁగువడి పూని వచ్చుబండి యొక్కటి యుంచుక యూ వెలితి గాక యున్న
యది గాక యున్న నేమి భవద్బాహుదండబలమునకు మూలధనం బైన గదా
దండం బెల్లపనికిఁ జాలునని చెప్పినఁ బవమానసూతి యాసూతు చేసెతవప్పళించి.

ఉ. వేడుకఁ జూడు మీను బటుశ్రవిక్రమకౌతుకలీలఁ బేర్చి చెం
దాడెద వైరులన్ విదురుఁ ✽ డప్పుడు సెప్పఁడె చూడ మిట్లుగా
నాడెన రాజరా జకట ✽ యాప్రతినల్ గడతేర్పఁ గాక పొం
కాడునె ధర్మజావరజుఁ ✽ డంచుఁ దదాప్తులు వంతఁ బొందఁగన్. 142

వ. అని వెండియు. 143

ఉ. ఉత్తమకర్మ మిట్టిదని ✽ యొక్కరుఁడుం దగఁ జెప్ప [1]లేఁడ నా
కిత్తఱి నేన పోలుతెఱఁ ✽ గెల్లను జేసెద నట్లుఁ గాక నా
చిత్తము మార్గవర్తియుఁగ ✽ శిక్షక మయ్యెడు దైవ మంచు న
త్యార్తి భవద్బలంబుపయి ✽ నెల్లను జూపడరించె నేపునన్. 144

వ. ఇట్లు గలయం గనుంగొని యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి విశోకునితోఁ గౌరవసైన్యంబు మనము దఱుమకయ తాన కలంగెఁ గలనం గవ్వడి గదిసెనొ కాక యనుటయు వాఁడు నిపుణంబుగా నిరూపించి మోదంబునం బొదలుచు. 145

క. నరుఁ డదె కంటే కౌరవ,కరిసేనం గవిసెఁ గేతుకపిరుచు లంభో
ధరబృందముపైఁ గలయం, బరఁగు తటిల్లతలఁ దలఁపఁ ✽ బట్టయి నిగుడన్. 146

క. హరిమేనికాంతియును నరు,కిరీటరత్నాంశువులును ✽ గిఱిగొన రథ ర
థ్యరుచులు వెరసి విచిత్ర,స్ఫురణంబునఁ దేజరిల్లెఁ ✽ జూడు కుమారా. 147

వ. అనిన విని యంతరంగంబు సంతోషమయంబుగా సంగంబువోఁగ నేర్పడ సాలోకించి విశోకునకు వృకోదరుం డిట్లనియె. 148

తే. వరవుడుల నూర్వురను మేలికవాజు లిరువ,దింటి నూళులు పదునాల్గు ✽ నిత్తు నీకుఁ
జనదనము నీవు నాకు భీకభత్సు రాక, సూపి ముద మొనరించితి ✽ సూతవర్య. 149

వ. అనియె నప్పుడు వారణఘటావిదారణంబు సేసి వాసవి వాసుదేవుతో మన తేరు భీమసేనుఁ జేరం బోవ నిమ్మనుటయు. 150

క. అతఁడు హరులఁ దఱుమఁగ నుద్ధతిఁ జను నెడ మనబలంబు ✽ దర్పమహోగ్రా
కృతిఁ బొదివినఁ జతురంగ,ప్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్. 151

ఆ. మందరంబుచేత ✽ మథితమై తిరుగు సా,గరమునులివు గెలిచె ✽ ధరణినాథ
పార్థుఁ డురవణింప ✽ బలువడిఁ గలఁగెడు, కౌరవేంద్రసేన[3] కలకలంబు. 152

వ. కేతుచామరాతపత్రభూషణశకలంబుల నాశౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె నట్లు కర్ణువధంబునకు వేగిరపడి తఱుమ నేఱుక మన వెనువెండియు నొండొండ వయిం గ్రమ్మిన నమ్మేటిమగండు. 153

క. పేరు గలరథికముఖ్యుల, సారథిరథరథ్యకేతుసహితంబుగ దు
ర్వారవిశిఖ[4]విస్ఫురణవిహారంబున శతచతుష్టయము పొడి చేసెన్. 154

1. [illegible] 2. గడఁగెదు. 3. కలవలంబు. 4. 'విస్తరణ' అనియే. ప్రా. ప్ర.

వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ గర్ణుముందటిమహాహవం
బుత్సాహతీవ్రం బయి యుఱవణించినం గని యన్నరుం డురగనికరంబునకుఁ
గవియుగరుడునికైవడి నద్దెస కడరె నట్లడరుట యాలోకించి తనకట్టెదుటిమొన
కెట్టు దాఁకి. 155

తే. వాయుసత్త్వుండు వాయుజవప్రదీప్తతనుఁడు వాయుతనూజుఁ డుగ్రప్రవృత్తి
నేచి బాహాసముల్లాస మెసక మెసఁగఁ, గనుపుగొట్టె వాలమ్ములఁ గౌరవేంద్ర.

వ. అవ్వీరు నాటోపంబు సూచి కురుభూపతి ప్రధానసైనికులకుం జూపి యితండు సమ
సిన సక్కడ సకలంబు సమయు మీ రొక్కుమ్మడిం బొదివి పొరిపుచ్చుం డనిన
వారును వారణాదిచతురంగంబులయుగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి యస్త్ర
శస్త్రంబులం బొదువుటయు నతండు. 157

ఆ. వాని నెల్లఁ ద్రుంచి వల వ్రచ్చికొని లీల, నిగుడుచోఁ బఱవోలె వెగడువడక
తఱిమి రక్తనదులు వఱపె మస్తకకూర్మ, హస్తభుజగతతుల నతిశయిల్ల. 158

క. కురువిభుఁడు సూచి శకునిం, బురికొల్పిన నాతఁ డుగ్రముగ మార్కొని పే
రురమున నారాచంబులు, గురిసినఁ బవనజుఁడు సరకుగొన కారథికున్. 159

క. బలునారసమున నేసిన, నలఘులఘుత మెఱయ నాతఁ డది యిరుతూఁడ
మ్ములఁ దునియలు సేయుడు నతఁ, డలిగి యతని ధనువు దునిమె నల్లన నగుచున్

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని యుజ్జ్వలషోడశభల్లముల్ సమ
ద్దండత నేసె నీమఱఁది తత్తను వాడఁగఁ జావకేతువుల్
ఖండిత మై పడంగఁ దురగంబులు నొవ్వఁగ సూతుమేనఁ బెన్
గండలు నెత్తురుల్ దొరఁగఁ గౌరవపుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. 161

తే. అలిగి జముసాలుకయుఁ బోనియ్యకతులశక్తి, వాయుపుత్రుఁ డారథికుపై వైచె నతఁడు
వెరవు మైఁ బట్టి దాన నవ్వీరు బాహు, వుచ్చిపోవైవ మనమొన యుబ్బి యార్చె.

—శకుని భీమసేనుం దలపడి మూర్ఛితుం డై తన రథంబుమీఁదఁ గూలుట.—

చ. అనిలజుఁ డట్లు పెల్లినఁగుసనార్పులు సైఁపక మేటివిల్లు వే
కొని కనుదోయి గెంపుగ నకుంఠితవిక్రమ మొప్పఁ ద్రుంచె నా
తని ఘనకార్ముకంబు నిశితప్రదరంబులు మేన నించె నిం
చిన నతఁ డుర్విఁ గూలెఁ గురుసేనకు బెగ్గల మగ్గలంబుగన్. 163

తే. కూలి మూర్ఛ మునింగినఁ గురువిభుండు
దన రథంబుపై నిడికొని యనికిఁ దొలఁగఁ
బోవుటయుఁ జూచి తమతమపోరు మాని 164
దొరలు వెరలిన మూఁకలు మరలి వఱచె.

వ. ఇట్లు వెఱచఱచి యవిసినసకలంబుజనంబులు, దీవి సేరినయట్లు కర్ణుం జేరి కాలు
దన్ని నిలిచె నన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 165

తే. అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజుండుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గినియఁ జాల
రయిరి కిమ్మీరవైరికయ్యంబుకడఁక
యిట్టు లుండునె పదపడి యెట్టు లయ్యె. 166

వ. అనిన సంజయుం డమ్మహీపతి కిట్లనియె నప్పుడు కరూశ పాంచాలచేదిసైన్యంబులఁ దఱుముటయుం గని కర్ణుండు గడంగిన మనమూఁకలుం బురికొని పవనతనయుతో డం బోరి నప్పాండవసేనాసముదయంబు రభసంబున నారాధేయుం బొదివిన.

క. అతఁడు వివిధోగ్రవిశిఖ, ప్రతతులు నిగిడించి ఘోరభంగి నుదారో
ద్ధతి సూపినఁ జెడ్పడి త, చ్చతురంగంబులును గలఁగె జగతీనాథా. 168

చ. కనుఁగొని భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడు దాఁకిన సంగతి కన్నిరూపులై
తనువులు సించుచున్ హయవితానము నొంచుచుఁ గేతుదండఖం
డన మొనరించుచుం బెనఁగె దయ్యక క్రుయ్య కతండు గంపునన్. 169

క. నకులసహదేవులును వా, రికిఁ దోడ్పడి నిశితశరవిసరీతునిఁ జేయం
బ్రకటితబలశౌర్యుఁడు సూ, తకులోద్భవుఁ డేచి వారి దలఁకం జేసెన్. 170

క. పెక్కండ్రతోడఁ గర్ణుం, డొక్కఁడ పోరాడి యుక్కుసెక్కున వారిం
జిక్కువడం జేయుట గడు, నక్కజమై యుండెఁ గౌరవాధిప చూడన్. 171

వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయం గలుగల వెగ డందించిన పోర పొదువుపాంచాల చేదిమాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళప్రసారంబు లగుశరాసారంబులు నిగిడించినం గరిరథఘోటకభటావయవఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబులును చామరచ్ఛత్త్రకేతుభూషణభాగంబులును భూభాగంబునం దొరఁగం బెరిఁగి నెత్తురుటేఱులు వాఱె మఱియుం బాండవయోధవరులు వరుసం బోరి పోరి యంతకంతకు నివ్వటిల్లునాకర్ణుక్రొవ్వున నివ్వెఱపడిన నవ్వీరుండు గోవులం దోలు కోల్పులికైవడిం గౌంతేయబలంబులం బఱవం బాంచాలురు వెండియు దండితనంబున నతనిం దలఁపడిన నాతండు పంచవింశతిరథికులం దునిమి వైవస్వతు చందంబునం బేర్చినం దూర్యరవంబులు సెలంగం దత్పుత్త్రులును దుర్యోధన కృపదుశ్శాసనులు నశ్వత్థామశకునికృతవర్మలుం బైకొని యా ధర్మనందను సైన్యంబు నమయింప నది విచ్చిన నెలుంగిచ్చి పోనీక నిలిపి భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవసైనికులం గనుపు గొట్టం దొడంగినం బోరు ఘోరం బయ్యె నిత్తెఱంగున రెండుదెఱంగులమూఁకలు దెగటాఱు చుండ గాండీవి దమమోహారంబున కుత్సాహం బెసంగ నొక్కవలన మనమొనల నెత్తుటం దోఁచుచుం గదిసి దలమొత్తిచూచి శౌరి నుద్దేశించి.

సీ. కర్ణుని కేతువు గ్రాలెడుఁ జూచితే, భీమాదులైన యశ్వద్ధామరథిక
జనులు పెక్కండ్రతో ననిసేయుచున్నవాఁ, డితనిప్రాపున గురుసుతుఁడుఁ గృపుఁడు
కృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసి, కాని వీక పాంచాలకోటి బడలు
వఱచెద రురవడిఁ దఱిమి యా రాధేయుఁ, గీటడఁగింతము ఘోటకములఁ
తే. జటురయమునఁ బోనిమ్మని పలుకుటయును, శౌరి యట్టులు సేయంగ శల్యుఁడమ్మ
హోగ్రరథవేగమును నరునుజ్జ్వలంపు, ఛేపుఁ గని సూతపుత్త్రుతో నిట్టులనియె.
క. కేతనకపిభయదంబై, తోఁతేరఁగఁ జక్రధరచతురసారథ్య
ద్యోతితవల్గనచారు, శ్వేతహరులు మెఱయ వచ్చు వీనిఁ గంటే. 174
వ. అని మఱియును. 175
సీ. నవ్వాడు తలలను గ్రొవ్వారు చేతుల, బిరుదులు వెట్టిన చరణములను
వాతులు తెఱచిన వాజిమస్తకముల, గిరిశృంగములఁ బోని కరిశిరముల
నవయవభేదంబు లడఁగెనట్లుగఁ, దుమురైన బహుగాత్రసముదయముల
భయదంబులై మహిఁ బడువిమానములట్ల, యఱవఱలైనట్టి యరదములను
తే. నేలఁ గప్పుచుఁ దనబాణజాల మడర, నెవ్వరడ్డము సొచ్చిన నించుకయును
దవులఁబడక సముద్ధతిఁ దివిరి మనలఁ, జేరి చూచుచుఁ బార్థుఁ డీదిక్కుఁ గవిసె.
క. తోడై డాపట వలపటఁ, గూడి తఱుము వారు లేరు కోపంబున నీ
తోడిబవరమున కడరెడుఁ, గ్రీడి మనతలంపు గూడఁ గెలువుము గడఁకన్.
ఆ. పాయ వడియె సేన పరవన మలరంగ, మార్కొనంగ మేటిమగఁ డొకండుఁ
గలుగ నోపఁ డేపు దలకొన మనము యిబ్బలియుఁ దలఁపడంగవలయుఁ గర్ణ.
వ. అనిన విని కర్ణుండు గవ్వడిబాహాబలంబును శౌర్యసారంబును దపఃప్రభావం
బును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాదిదివ్యాస్త్రంబులు
వడయుటయును బురందరప్రముఖబృందారకులకు నజయ్యు లగు కాలకేయుల
నిర్జించుటయు విరాటుపసులం బట్టించుకొనుటయు లోనుగాఁ గలవిశేషంబు లుగ్గ
డించి కృష్ణుమాహాత్మ్యంబు వొగడి యిట్టివారల నే నొక్కరుండన మార్కొని
మదం బడఁగించెద మద్రనాయక మనతేరు వారియరదంబునకు సమ్ముఖంబుగాఁ
జనిమ్మనిన నతం డట్ల చేయఁ గనుంగొని కురుపతి పురికొలుపఁ గృప కృత
వర్మ గురుపుత్త్ర గాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు
దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యా ఫల్గునుం బొదివిన నమ్మహాభుజుండు
హరిణకులంబు గనిన సింగంబువిధమున విజృంభించి యా రథికులపైఁ గలయ
వివిధవిశిఖంబులు నిగిడించి ధనువులు దునిమియు ఘోటకంబులఁ గూల్చియు
సారథుల నమయించియు దత్సేనాతురంగంబుల బడలువఱచియు నబ్బలి
మగలం దెరల్చి యొత్తరించి కెలనన దురంబు సేయుచున్నమ్మహత్త్రసయుం దేరం

జని బహువిరోధిజనపయోధిమగ్నుం డగుచున్న యతని నుద్ధరించి సంప్రీతుం డగునతనికి నగ్రజకుశలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి నీ విఁక దప్పి యార్చితో మ్మని పలికి రాధేయరథసోత్సాహసహితం బగునీబలంబు మీఁదం గవిసిన. 179

కురుకుమారులు పదుగు రర్జునుం డాఁకి మృతు లగుట.

చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టు ముట్టుటయు వారలసూతహయధ్వజంబులం
బొడి పొడి సేసి యాతఁడు రిపుల్ వెగ డంద వెసం దతూవులన్
మెడలు దెగంగ సేసి రణమేదినికిన్ బలి సేసె నత్తలల్. 180

వ. అట్టియెడ. 181

తే. నవరికౌరవరథికులు గవిసి కడిమిఁ
బొదువుటయు నన్నిశరముల భూరిరయము
మెఱయ నందఱఁ దెగటార్చి తఱుము నతని
దాఁకె వేయుమున్నూఱు సంశప్తకావళములు. 182

వ. ఇట్లు దాఁకిన యాభీరాదిమ్లేచ్ఛనికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల విరియిం పం బైపైఁ గరితురగసుభటరథసమూహమ్ములు, గ్రమ్మినం గని కడంగినవడ ముడితోడ్పాటునం జెప్పడియు నవి పోక పొదివి పెనంగిన గద గొని యరదంబు డిగ్గి యగ్గలిక నప్పవనతనయుండు దారుణరణవిహారంబున నెఱయ మెఱయుం దఱ చుగా మెఱుంగు వాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగం బులయుం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగని యట్టిది లేకయుండె నట్లు గార్చిచ్చు పొదివినకాననంబుచందం బయి యాసైన్యంబు రూపఱ విఱిగి కర్ణ కర్ణ కావు కావు మను నెలుంగులతో నతని వెనుక కొదిఁగిన నిక్కొముకు లబ్బలుమగని బలసి నిలువ నావీరుండు దీనికై వడి సముద్రార్ణవంబున మునుంగనీక యుమ్మోహారంబు నుపరించి మార్విఁ దాటించి కిరీటిదెసకు నడరె నంతకు మున్న యరదం బెక్కి యప్పవనతన యుం డాధనంజయునిం గూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రా సూతనందనుం దలఁపడుటయు. 183

తే. ద్రౌపదీనందనులును సాత్యకియు లోను
గాఁగఁ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియెఁ బాంచాలురఁ గురువరేణ్యు
యందఱకు నమ్మిరూపులై యతఁడు పెనఁగె. 184

వ. అప్పుడు. 185

సీ. జనమేజయునిసూతుఁ దునిమి రథ్యంబుల, నో సేసి భీమసేనసూను నకుల
సుతులచాపములు ఖండితములు సేసి ధృష్టద్యుమ్నునూపుల నయముఁ జూడి

మెయి వెంచి సాత్యకి హయములఁ గూల్చి కేకయకుమారుని జముకడకు ననువఁ
దజ్జనకుం డల్గి తన్ను నొప్పించి[1]ప్రసేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు

తే. టయును బుత్త్రశోకంబుఁ గిన్కయు మనంబు
నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకి
శినివరుం డొండువాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి తత్సుతుఁ బొడిచె నధిప. 186

వ. ఇట్లు సూతుపౌత్త్రుం డగుసుషేణుం బొడిచి శినిపౌత్త్రుండు. 187

చ. హయములఁ జంపి ముప్పదిశితాస్త్రములం దెగటార్పఁ జూచి తం
డ్రి యమునిచంద మై [2]తెగితిక్రరే శినివీరుఁడ యంచు నేయుడు
న్భయదమహోగ్రతన్ నిగుడుఘనారవమ్ముల్ నడుమన్ శిలీముఖ
త్రయమునఁ ద్రుంచి మేనఁ బ్రదరత్రితయంబు శిఖండి గ్రుచ్చినన్. 188

తే. కనలి యా సూతపుత్త్రుఁ డాతనిసితంబు
ధనువుఁ దునుమాడి పార్షతతనయుఁ డగుసు
దేవుఁ దండ్రులు కనుఁగొనం గా వధించి
యేసె సుతసోముఁ డడరిన నేవు దఱుఁగ. 189

వ. వెండియుఁ బాంచాలరథికసంఘంబులు రాధేయుమీఁద నురవణింప సమీరణ
సుతసహాయుం డగుసవ్యసాచి వానిం గడచి యక్కర్ణునరదంబున కడరెనట్టియెడ
నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు ధృష్టద్యు
మ్నుండును నతనిం దలమిగిలి యబ్బలుముగనిం బొదివి యింద్రియంబులు దృఢా
త్మునిం గలంపం జాలనిచందంబున నాసూతినందనుఁ [3]దెరల్పం జాలరైరి వారల
కేతుచ్ఛత్రసూతతురగధనుస్తూణీరంబులు రేణువులు సేసి బహుబాణంబులఁ
దనువులు నొ నేసి సింహనాదంబు సేసినయయ్యంగపతిపై సునంగతులై ద్రౌపది
కొడుకులు గవిసిరి వారిం గూడికొని శినివరుం డా సేనాపతి వారి నేయుసాయకం
బులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగినకౌరవపతియంగంబున నెనిమిది
సునిశితవిశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. 190

క. అలిగినయన్నరనాథుని, కలఁకుల వెసఁ దఱిమి కర్ణకృపకృతవర్మల్
బలుతూపుల నేయఁగ న,న్నలువుర స్రుక్కించె నతఁడు నారాచములన్. 191

తే. దొరలఁ గడచి బలంబు లుద్ధురత నిగుడ
వారిమొనలు సెదిర్చిన ఘోరతుముల
సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ
ద్రాఁక దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. 192

---

1. 'సుదేవుఁ దాఁ జూడఁ గా వధించు' వ్రా. ప్ర. 2. 'తెగితడి' అ. ప్ర. 3. గదల్ప శక్యం.

దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుట.

తే. సారథులయుబ్బువాజులచటులతయును, మఱియు నొప్పారుతేరుల మీఁదఁ బొలిచి
రవుడు గయ్యంపువేడుక నార్తఁడును న,తంతుఁ జూపఱకన్నులపండు వగుచు.

క. ఒండొరులమీఁద నుజ్జ్వల,కాండము లడరించు చట్లు గదిసినయెడ భీ
ముండు ప్రమాదభరితచి,త్తుం డయి తగ నిట్టు లనియె దుశ్శాసనుతోన్. 194

ఉ. ఆసభలోనఁ గొన్నబుణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో
బాన కొకింతయుం దొలఁగఁ బాఱకు తీర్చెద నిప్డు నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు నేర దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా. 195

వ. అనిన విని యతఁ డితని కిట్లనియె. 196

సీ. ఎఱుఁగుదు మఱచితివే లక్కయింటఁ జి,చ్చిడి మిమ్ముఁ బఱచినవిధ యిఁకను లవియుఁ
[1]గాకయునమ్మయి గాంధారరాజు మీ,యన్నతో వెడజూద [2]మాడి రాజ్య
లక్ష్మిఁ జేకొని కాననలకుఁ బోవ నడచితి, మందుఁ బెక్కాపద లనుభవించి
యజ్ఞాతవాసార్థ మవ్విరాటునిప్రోలి, కరిగి యత్యంతదైన్యంబు నొంది

ఆ. యట్లు మీర లునికి యప్రసిద్ధము యివి, యేల రిత్తమాట లేటు పోటు
తలకువచ్చియును దరహాసమునఁ గెంపు,గదురఁ బవనసుతుఁడు గనఁగి దాసి.

క. భల్లములు మూఁట సిడమును, విల్లు నఱికి సూతకంఠవిదళనమున శో
భిల్లి నిటలమునఁ బటుద,ర్పోల్లసితుం డగుచు నాటె నొకనారసమున్. 198

వ. దాన బీఱు వోవక దుశ్శాసనుండు. 199

క. తురగములఁ దాన నడపుచు, వెరవు రయము నెఱయ నొంపవిలుఁ గొని గాఢ
స్ఫురణమున భీముతనువునఁ, బరఁగించె మెఱుంగు లడరఁ బండ్రెండమ్ముల్. 200

క. తోడన కోదండము దును, మాడెను సూతుమెయి గ్రుచ్చె నాఱమ్ములు సం
క్రీడయపోలెను మువ్వది, యాడించెను మఱియుఁ దూపు లనిలజు మేనన్. 201

మ. ధను వొం డుగ్రత నెత్తి యేఁబదిశితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబున గ్రుచ్చినం గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మయుగళస్ఫారాహతిన్ వాజులం
దునిమెం జూపఱు పిచ్చలింప విలసద్దోర్గర్వదుర్వారుఁ డై. 202

వ. ఇట్లు విరథుం డై వృకోదరుండు మెయి వెంచి. 203

మ. గద లీలం గొని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యా
న్మదయానంబునఁ గిట్టి ఘోటకములన్ మ్రందించి బాహాబలం
బు దలిర్పన్ భవదీయసూనునరదంబుం ద్రెళ్ళఁ ద్రోవంగ వె
ట్టినవుం దోమర మెత్తికొం చతఁడు గాఁకతోన్ నేలకున్ గ్రక్కునన్. 204

1. గ. గాకయే మమ్మెయి. 2. జ. మాడి రాజ్య.

వ. అట్లు దాఁటి పట్టి వైచినయుత్తమాంగం బురం బాడ నేచి యక్కుచకారాతి పదు
మూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్లి
నుద్దండగదాదండంబున దుశ్శాసను వైవ నతండు నెత్తురు గ్రాఁగ ధరణిం బడిన
బెబ్బులి లేడిఁ గొఱవమం బాదువుపోలికం బాదివి మెడ ద్రొక్కి యెక్కుమనంబున
నక్కుమారునితో నిట్లనియె. 205

క. మును సభఁ బలికిన గానం, బని వోవక యిచ్చటికి వెసఁ దెచ్చితి[1] యే
మనియెదు దనుము నీమాటలు, వినుటకు నాకిపుడు చాల వేడ్క వొడమెడున్. 206

వ. అని యమ్మహాబలనందనుండు మహోగ్రలోచనప్రభలు నిగుడ మనబలంబులం
జూచిన. 207

క. నిగుడుదవాగ్నిజ్వాలల, వెగడందినమృగకులంబు విధమున నతిభీ
తి గదిరి నలుగడ విచ్చిన, జగతీశ్వర యతఁడు మెఱసెఁ జక్కనిబయలన్ 208

వ. అప్పుడు నీయందుఁ జేయుంగలసైనికులు సూచి తత్తేజోవిశేషంబునం జూడ్కులు
మిఱుమిట్లు గొన వెఱచఱచి యంతంత ఱిచ్చవడి యుండ. 209

శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
శీలత్వం బలరింపఁ ద్రిప్పఁ జదలం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలం ద్రోచు మొగంబు వ్రేయు దెస లుగ్రస్ఫూర్తి పీడించు మోఁ
కాలూఁదుం బయిఁ గ్రమ్మఱంగ మెడ [2]చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్. 210

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి భీమవిక్రముం డగునాభీమసేనుం డయ్యువ
రాజనాననం బాలోకించి. 211

క. ఏ నురము వ్రచ్చి నెత్తురు, దేనియ [3]యిదె త్రావెదం గ్రదిసి నన్నుఁ గడిమిన్
మానుప దిక్కు గలిగిన, న్రాని [4]మ్మెలుఁగింపు మీ మొఱ్ఱనం గలవారిన్. 212

వ. అని పెలుచం బలికి కుఠారంబు వెతికి యతని మొగంబుమీఁద జళిపించి. 213

భీమసేనుఁడు దుస్ససేనునియురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట.

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణిన్ రౌద్రం బుదగ్రంబు గా
నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్మురుధిరమ్ముల్లాసి వైదోయిట
న్వార వారం గొని త్రావు మెచ్చుఁ జవికిన్ మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. 214

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి. 215

తే. తల్లిచన్నులపాలును ద్రావ నెట్టు, లాననేవలు తెఱఁగులు తేనియలును
ఖండశర్కరతోడిదుగ్ధంబు లనుభ,వింపఁబడవే యవి యీనింతయింపు గావు.

చ. అని యెలుఁగెత్తి పల్కు నలి నాడు మహోద్ధతిఁ దుళ్ళి నార్చుఁ బె
ల్చన భుజ మప్పళించుఁ దమసైనికులన్ మనవారు రక్కసుం

1. జ. తే, మనియెద వను. 2. క. చక్కం ద్రొక్కి. 3. క. వలెఁ ద్రావెదం, 4. క. మ్మెలిఁగింపు.

దని పెలుచఁ గందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారు నై రణవిరామముఁ బొంద మదోత్కటాకృతిన్. 217

వ. పదంపడి. 218

మ. గద చేతం గొని యంత్యకాలయమరేఖం బేర్చి రక్తంబుచా
య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచి యు
న్మదమాతంగములీల దోఁప మనసేనం బొల్పఱం దోలి వే
పొదివెం గ్రమ్మఱ దున్నసేన వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తి యై. 219

వ. చలంబు నెఱయ నతని కాలు నేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కుమార్గ
వైరి యి ట్లనియె. 220

క. ఏమిర పసు లని యార్చవు, నీమాటలు నిలువఁబడియెనే పసరము మి
మ్మేము మగుడ నిదె యార్చెద, మీమాటకు మాఱు పల్కు రెవ్వరుఁ గంటే.

ఉ. సెట్టన యగ్గిరం దగుల నీళ్ళను ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగభీషణదంష్ట్రలపాలు సేతయుం
జుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడ సభన్ నెఱి మాలి యమ్మెయిం
దిట్టిన కోర్చు టెందుఁ గలదే విను గెల్వరె జూద మెవ్వరున్. 222

క. అని పలికి క్రమ్మఱఁగ మన, మునమీఁదన్ బ్రమరివాఱి ముద్గరలలితం
బునఁ గేలుపొలియఁ జని తన, కన[1]లడఁగ దుస్ససేనుఁ గనుఁగొని పలుకున్.

ఉ. పై వడి పోయెఁ గాక ధృతరాష్ట్రునకు గన్నది యేమి యా సభం
దా వల దన్నఁ గీడుమగవా పతి లేఁ డనఁ బద్ధకాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతియేడ్తెఱ నొప్పఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లు కామినులు సేడ్పుచు రి ట్లపతిత్వదీనతన్. 224

క. విను మేను జేయఁ బూనిన, పనులం దొకటి గడ కెక్కెఁ బాపాత్మ సుయో
ధనుఁ బొరిఁగొని తలఁ దన్నుదు, నను రెండవపనియుఁ దీర్చ నరిగెద నెలమిన్. 225

చ. అని యెలుఁగెత్తి చెప్పి యతఁ డాతని గీ టడఁగించి యార్చెఁ గ
ర్ణునకును లోను గా మనవరూథినియోధులకున్ మహాభయం
బున మనముల్ గలంగఁబడి పోక నూల్కొన నీని యిచ్చపా
టున నకలాంగకంబులు గడున్ శిథిలంబులు గా మహోగ్రుఁ డై. 226

క. జనపతియుఁ గృపప్రముఖులుఁ, గనుఁగొన ని ట్లనిలసుతుఁడు గ్రోర్వి మొదల్ గై
కొనినట్లు పేర్చి దుశ్శాసనుఁ జంపుటఁ జూచి రోషసంరంభమునన్. 227

వ. నీకొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుం
డును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుం
డును గూడి కవిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకు మున్న దుశ్శాసన

1. క. అడఁగ,

రక్తపానకౌతుకాధీనమానసుండైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో
యని కన్నిడి యుండి యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకు [1]ఫల్గునుండు
ప్రీతచిత్తుండై యుండె నంత భీముండు భల్లదశకంబున నక్కుమారదశకంబు శిరం
బులు దునుమాడె [2]నట్టిభీముని యాటోపంబున కోటఱి నీసైన్యంబు సమరవిముఖం
బయ్యె నానూతనందనుండు భీతుండై వదనంబు వెల వెలఁ బాఱ నూరకుండె
నప్పుడు శల్యుం డతని నాలోకించి యిట్లనియె. 228

తే. ఉగ్రుఁడై దుస్ససేనుని యురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావు మరుత్తనూజుఁ
జూచి చేడ్పడి చయ్యేదఁ జూచితే సు
యోధనుని నీవు నట్టి నొప్పు నెట్లు. 229

క. బలియు రగురాజులును గాల్, నిలువక తెరలంగ వీర నీప్రాపున శ
త్రులఁ దాఁకఁ దలంచి కృపాదులు నిలిచిరి కూర్పుకొని మ్మతుల ధైర్యమునన్. 230

చ. కడువెగ డంది యున్న నినుఁ గన్గొని [3]వీఁడె యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెను నరు నీవు దాఁక వలదే రణఘోరము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు దానిఁ దలంపు మిత్తఱిన్. 231

వ. అనిన విని యతండు సమరోన్ముఖుం డయ్యె వృషసేనుండు భీమసేనుపై నురవణింప
నకులుం డడ్డపడి యక్కుమారుని సిడంబును గొడుగును గోదండంబును ఖండించిన

చ. అలిగి యతండు వేఱొక శరాసన మెత్తి రథమ్ము ఘోటక
మ్ముల నిలఁ గూల నేయఁ బొలివోవని ధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటి బెట్టుగో
త్తలఁ జని తత్సహాయభటదారుణకేళి యొనర్చి పేర్చినన్. 233

ఆ. కర్ణసుతుఁడు వలక ఖండించి కృష్ణసర్పంబుఁ బోని పటుకృపాణ ముఱక
నఱకి నారసములు నాటించె నయ్యర్జునానుజన్మమేన నల్లనగుచు. 234

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండును యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండి
యు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల
కైవడి వృషసేనుపయిం గవిసినఁ గృతవర్మకృపద్రౌణి దుర్యోధనులును శకునియుఁ
దత్సోదరులు గొందఱును గ్రందం దఱిమి దుర్వారవిశిఖవర్షంబుల వారలం
గప్పినం గని గజసాధను లగు కళింగు లురవణించి. 235

క. కృతవర్మ సిక్కువడ భూపతి నేడ్పడ శకుని వెగడుపడఁ దదవరజ
ద్వితయము ధరఁ బడఁ దీవ్ర, [4]ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్. 236

---

1. క. గ. ఙ. ప్రీతచిత్తుం డదో ఫల్గునుండు భల్లదశకంబున. 2. క. గ. చ. సాభిమానుల ఘాటోపంబున. 3. గ. వెంత బ. 4. ద్ధతి...టంకృతులు సెలఁగన్.

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి. 287

క. ఆ మువ్వురుఁ జలమున నుద్దామద్విపసహితచిత్రదళనంబున సం
గ్రామతలము రక్తాక్తం, బై మెఱయ బలాధిపత్రయముఁ బోరెఁగొనినన్. 288

క. తక్కటిరథికజనులు పేరుక్కున నయ్యూథచయంబు నొదిఁగించియునుం
జిక్కువఱచియుం దునిమియు, నెక్కుడుమదమొప్ప మెఱసి రఖిలపురనాథా. 239

వ. మెఱసినం జూచి. 240

ఆ. అరద మెక్కి తఱిమి యనిలతనూజుఁ డవ్వీరులతోన పాండవేయసేనఁ
జేయఁ గలుగుదొరలు శితశరాసారంబు, లడర వారిమీఁద నడరుటయును.

వ. రణంబు దారుణం బయ్యె నందు. 242

సీ. కర్ణునియగ్రభాగంబునఁ గరిఘటల్, దునుమాడు నకులనందనునిఁ గిట్టి
వృషసేనుఁ డమ్ములవెల్లి పైఁ బరగించి, శితభల్లమున నూతశిరము ద్రుంపఁ
గనుఁగొని యక్కర్ణతనయునిమీఁదఁ బార్థాదులు గవిసిన నతఁడు పార్థు
ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి, యాశతానీకుని నట్లచేసి

తే. నకులు తనువున బాణసంస్తరము సానిపి, శార్ఙ్గధరుమేనఁ బండ్రెండుసాయకములు
వఱపి పేర్చినఁ గౌరవప్రతతి మెచ్చి, పార్థువేఁడిమి యూహించి భయముఁ బొందె.

చ. కలఁకులయోధులం గడచి క్రీడి వడిన్ వృషసేనుమీఁద న
మ్ములు నిగిడింప నా రథికముఖ్యుని మూఁపున నక్కుమారుఁ డే
వఁరఁగ వాఁడితూపులు రయంబు మెయిం బడి బెట్టు గ్రుచ్చి య
గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి మట్ట నార్చుచున్. 244

వ. ఇట్లు విజృంభించిన. 245

—•• అర్జునుఁడు వృషసేనుని మృతిఁబొందించుట. ••—

మ. భ్రుకుటిస్ఫూర్జితఫాలభాగుఁ డగుచుం బొంగారి యానూతపు
త్త్రికు కోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్లవిలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళాదుర్దముఁ డన్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్. 246

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి కర్ణుండు శోకవ్యాకులచిత్తుం
డై కన్నీ రొలుకం గోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహారథుని తేరికి
సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి యర్జున యర్జున యని యాహ్వానంబు
సేసిన నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె నట్టియెడ దురం
బు దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొను చుండ నయ్యిరు
వురు రామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు
నాకారంబుల నుల్లసిల్లి రి వారలయొక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున
సురపితృవిద్యాధరసంయమిసంఘంబులును శచీపతిప్రజాపతిపశుపతులును లోను

గా ననేకదివ్య్వ తేతెంచి నభోభాగంబున నిలిచి రప్పుడు బ్రహ్మ రుద్రున
కిట్లనియె. 247

## కర్ణార్జునులద్వంద్వయుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రుల ప్రశ్నోత్తరములు.

క. ఇరువురు నతిరథులు సమ,స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీరిం
దొరువులతోఁ బెనఁగఁగ న,శ్వర మగు జగ ముడుపరాదె సమరం బనఘా. 248

క. అన విని యాదేవుఁ డ,వ్వనజభవున కిట్టు లను నరవారోద్ధతు లీ
ఘనభుజులు వీరిరణ మి,ట్లును జెల్లుం దప్ప దప్పకలుకు విడు మింకన్. 249

వ. అని యిట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ నాకర్ణించి పాకశాసనుండు సప్ర
ణయంబుగా బ్రహ్మ కిట్లనియె. 250

చ. తపము సుదాత్తశౌర్యము సుశదగ్రబలంబును గల్గుకిరీటి
య్యవునెర వెక్కుడై గెలుచునట్లుగ నీవు దలంపవే పురా
ణపురుషు లైనకృష్ణులు రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కు లైన నిల్వకరుగ బ్రదు కమ్మయిఁ గల్గనేర్చునే. 251

వ. నరనారాయణులకు నెందును జయంబు ధ్రువంబని తొల్లియుం జెప్పితి రిమ్మహా
త్ములు జయించుట లోకహితంబు గర్ణుండు ద్రోణభీష్మప్రాప్తం బైనపుణ్యలోకంబు
వడయుఁ గిరీటి చిరకాలం బిడుములం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు
లనుభవించుం గాక యనిన నప్పరమేష్ఠి వీరల జయాపజయంబులు నిశ్చయించి
పలుకనేల యనుటయు నీశానుం డతని నాలోకించి నిశ్చయించుట మేల కాక
మొ గ్గమి నిశ్చయింత మని కలిసికొని యతండునుం దానును వాసవువలను విలో
కించి కృష్ణార్జునుల నుద్దేశించి. 252

తే. మహితమును లగువీ రెండు మూఁడు లోక, ములఁగువారయి కాదె జన్మించినారు
వినుము నీచెప్పినట్టుల వీరి నోరులు, ధిక్కరించుట లోకహితంబుగాదు. 253

వ. వీరికి జయంబు ధ్రువం బని పలికి యంత నిలువక వీరి జయంబు ధ్రువం బయ్యెడు
మనవుడు నయ్యమరవిభుండు సురముని ప్రభృతులం గలయం గనుంగొని దేవ
దేవు లిరువురు నేకమతంబుగా నిశ్చయించిన లోకహితం బగునానతి యాక
ర్ణించితిరే మీచిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గావలయు ననిన నందఱు
నది యట్టిదకాక యొం డగునే యని రనిమిషులును గుసుమవర్షంబులు గురియిం
చుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలంగించి రయ్యవసరంబున నఖిలభూతంబు
లును విస్మయోత్ఫుల్లనయనంబు లగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించు
వేడుక నొండుతలంపులు దక్కి యుండె నట్లు దార్కొనిన మహనీయరథంబులు
రెంటియందును సన్నాహసముజ్జ్వలు లై యొప్పువాసుదేవార్జునులును గర్ణశల్యు
లును దమతమశంఖంబు లొత్తి రప్పుడు. 254

తే. రెండుసేనలశంఖభేరీముఖంబు, లైనబహువాద్యములపటుధ్వాన మడరి

నింగి [1]వ్రేంగారె నత్యంతనిశ్చలంబు, లయ్యె సైనికనికరంబు లద్భుతముగ.

సీ. కపికేతనము హాస్తికక్ష్యయు నమ్మహా, బలు లిద్దఱును దపోబలమువలనఁ
గన్నవి యై బుద్ధి గల్గి శోభిల్లు ను,ర్వీశ యప్పుడు కపి యొరఁగి హాస్తి
కక్ష్యపై నడరినఁ గయ్య మారెంటికిఁ, గలిగె నం దాహాస్తికక్ష్య దెరలె
నంబుజాక్షుండు మద్రాధినాథుండును, దృక్కులహంబునఁ దేజరిల్లి

తే. రర్జునుండును గర్ణుండు దర్జనంబు,లైనచూడ్కు లొండొరువులయాననములఁ
బఱపి రాకృష్ణపార్థులబలువు శల్య,కర్ణచిత్తదౌర్బల్యముల్ గానవచ్చె 256

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి. 257

తే. అర్జునుఁడు నన్నునోర్చినయట్టులైన, నెట్లు సెప్పుమ యనుడు మద్రేశుఁ డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర,బహుళశరజాలములపాలుపఱుతు ననియె.

ఆ. అట్లు సవ్యసాచి యడిగిన మురవైరి, నగుచు నినుఁడు గూలినను ధరిత్రి
పఱియలైన మేరు వ్రాఁగినఁ గర్ణుచే, నీవు గోలుపోవు టేల కలుగు. 259

వ. అని వెండియు. 260

ఉ. [2]అట్టిద లోకపర్యవసన మా దురవస్థకు స్రుక్క నేర్తునే
కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం గరతాడనంబులం
బెట్టుదుఁ నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ ధర్మజుం
గట్టుదు బట్టమన్న నగి గాండివి యద్దనుజారి కిట్లనున్. ,261

ఉ. నవ్వుల కంటెఁ గాక యని నాకు నశక్యమె కర్ణశల్యులం
ద్రొవ్వడఁగించు టే ద్రుపదకూఁతురు గొల్వున బడ్డపాటున
నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁ గాని యింక నా
మువ్వురుఁ జూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్. 262

మ. అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులుఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి ని
ష్ఠురభల్లం బొకటన్ సురోహనునిచూడ్కుల్ నీఱుగా నిడ్డ యు
ద్ధురగర్వోన్నత మైనకర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్. 263

ఆ. కర్ణమద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు చెన్ను మిగిలి
నగుచు నేఁడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతుని చెవులఁ దనువు నినుపు. 264

క. సంతసపువార్త వుచ్చుము, కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట, యంతయుఁ గన్నారఁజూ దిశయమ్మ్యత మొలమిన్.

వ. అని పలికె నా సమయంబున నుభయసైన్యంబులజనంబులకు నంబరంబున నున్న
దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లునప్సరోగణంబులుం గాన
నైన నద్భుతంబున వారు ననిమిషులై యుండి రప్పు డేకనిశ్చయము లగుకర్ణుం

1. గ. వ్రేంగారె 2. ఇట్టిద లోకపర్యవస మే దురవసకు నరి యుండు అని తోఁచెడిని.

డును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక దురంబుమీఁదిభరంబునం
బొలిచి రిరువాఁగుసైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబు గాఁ దల మిగులఁ దగ
దనుబుద్ధిన భయంబునను దద్రథంబులు రెంటిని బలిసి నిలిచి రమ్మహావీరులు ధను
ర్ద్యుతులను బాణప్రభలను దీవ్రతేజంబులను బ్రదీప్తులై కల్పాంతసూర్యులచందం
బగుచు నొండొరుల నొర్చు కడంకలఁ బేర్చి రయ్యవసరంబున నశ్వత్థామ కురు
పతిఁ జేరం జని కరంబు సేఁతం దెమల్చి సాంత్వన[1]స్వరంబున నిట్లనియె 266

—.. అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట. ..—

చ. కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి రంగరాజు వా
రల కధికుండె యాతని దుస్తరంబున నోర్వఁ గలండె పూని యే
వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు నిల్చు నీతనిన్
నిలుపుము నీవు ధర్మసుతుఁ గనిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్. 267

వ. తెలిపిన దామోదరుండునుం దెలివి నొందు. 268

క. భీముఁడుఁ గవలును ధర్మజుచే మరలెడువార లేను జెప్పెడిపలుకుల్
భూమీశ కురుకులమునకు, నీ మొనరాజులకుఁ బ్రజకుహిత మూహింపన్. 269

చ. వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప భీష్ముఁడును ద్రోణుఁడు లోఁగ మెఱుంగఁగా నవ
ధ్యుల హరికల్మి సారథికదోర్బలలీల నడంగి [2]పోరయ
చ్చలమొ ఫలంబొ [3]యింక నయిన సంధి యొనర్చుట మేలు వారితోన్. 270

చ. హరి నను దెంచినప్డు మన యమ్మెయిఁ బల్కితి మింక సంధికి
న్నెర వగు వేళ గల్గు నని నీవు దలంపకు మాంబికేయ భూ
వరుఁడుగఁ జేయు ధర్మజుఁ డవశ్యముఁ బాండునృపాలుపాల యే
పురకు సమర్పుఁ గాని చనప్రుఁ వెలిముచ్చును నొల్లఁ డేమియున్. 271

తే. పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు బ్రదుకు తెరువు
పట్టు బ్రదికిన నెల్లశుభములుఁ గలుగు
నీసు మానుము చచ్చిన నేమి గలదు. 272

క. పెడతలఁపు లుడిగి సంధికి, నొడఁబడుము మిది తెన్ను దీని నొడఁబడమి గడుం
జెడు తెరు విప్పటి[4]పదనుగ, గడవఁబడుట ద్రాటఁ దప్పుకరణియ సుమ్మీ. 273

చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను నిప్డు దుస్ససే
నుని వని దీర్చి మారుతతనూభవుఁ డాడినమాట యేర్పడ
న్వినియును సంధి సేయుటకు నీ వభిలాషము సేఁత యొప్పునే

1. క. పూర్వంబున. 2. క. పోవక చలమొ. 3. క. యింకను. 4. జ. పదనం, గడవఁబడుట.

పెనఁకువ కర్ణుఁ డే లుడుగు § కేలవె మానుము ద్రోణనందనా. 274

శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ డపరిశ్రాంతుండు గర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీకతం డాతనిన్ వహ్ని య
త్యంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాభుల్ వడం గాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం § గోల్పాటు వాటిల్లునే. 275

వ. అని పలికి యజ్ఞసవతి తనసైనికుల నాలోకించి సమరసముత్సాహపోషణంబు లగుభాషణంబుల ముఖరుం డగుటయు సకలతూర్యంబు లొండొండ మ్రోసెఁ బాండవబలంబునను భేరీపణవాదులరణనంబులు నిగిడె నప్పుడు కర్ణుండును నర్జునుండును. 276

క. కరి కరి గిరి గిరి నంభో,ధర మంభోధరముఁ బెలుచఁ § దాఁకినక్రియఁ దాఁ
కిరి కడఁగి గగనతటియును, ధరణియు మ్రోయుచు వడంక § ధరణీనాథా. 277

క. మెఱయ వెలిమావులును గడు, మెఱుఁగారెడునరదములును § మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జ్యా,వఱ నొత్తోలుకాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా. 278

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలఁపడి పెనంగం దొడంగిన నుభయ సేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి రట్టియెడ. 279

మ. భరితోత్సాహతఁ బేర్చి దీప్తు లడరన్ § భల్లమ్ము లొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రములలోఁ § బార్థుండ వేత్రుంపు మి
క్కురుభూపాలకురాజ్యకాంతు [1]దోరయే § కోదండపాండిత్యవి
స్ఫురణం గర్ణుఁడు నీకు నీబలువు నేవుం జూపు మత్యుగ్రతన్. 280

వ. అని పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు సేసిరి కౌరవులును గర్ణు దగ్గఱి.

చ. కడఁగుము నీదుబాణములఁ § గవ్వడి గూలినఁ జాలు నంతతోఁ
జెదుదురు పాండవుల్ రణము § సేయ నుదగ్రత యొల్లఁ దక్కు పే
రడవుల కేఁగి సాధుమును § లై చరియింతురు కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు § పొంపిరివోవఁగ నేలు లీలతోన్. 282

వ. అని తఱిమిరి ప్రొద్దునుం జాల వ్రాలెఁ గాలాంతకప్రతిము లగునప్పార్థకర్ణు లన్యోన్యజయార్థులై పెనంగునప్పుడు. 283

కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁ బూనుట.

సీ. కర్ణుండు పదిచండకాండంబు లర్జును,తనువుఁ జొనుప నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణుమైఁ, బరఁగింప నయ్యంగపతి దశోగ్ర
చక్రమార్గణముల § నరభసంబున నొంచె, నన్నరు నాతండు § నట్టి వన్ని
శరములు రాధేయు § నురమున నాటించె, నతఁడు దొమ్మిదివాలుఁగలమ్ము లతని

తే. వక్షమున గ్రుచ్చి సాయకద్వయము శౌరిమేన నిగిడింప బీభత్సుఁ డేను మెఱుఁగుఁ

1. జ. దోరయాం. 2. గ. నురము నాడించిన.

చూపు లా సూతపుత్త్రు నెత్తుట మునుంగ, నేసె బాణాసనముల్లాసమున కమునఁగ.

చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువం బరాక్రమకుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వొలసి ముఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథరథ్యకేతుసూ
తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్. 285

క. అతఁడును దురగసారథి, కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడియుపోలెన్
శాతశరవృష్టి నన్నరు, నీ తెఱఁగున మఱియుఁ బెనఁగి [1]రిద్దఱుఁ గడఁకన్ 286

శా. ఆ యుగ్రాహవకేలి నిట్లు నిపుణుండై యొప్పునప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరిఁ బోసి దారుణమహోగ్నిజ్వాలికల్ భీషణ
స్థాయిద్భంగి నభస్స్థలిన్ నిగుడ దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగోద్దహనాభిలాష మెడఁదన్ దీపింప బెట్టేసినన్. 287

ఉ. అంతకకోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు మి
న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా
వంతయు శంక లేక సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు గర్ణుఁడు మాకు నుబ్బుగన్. 288

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన భూనభోంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు, నాతమంబు విరిసె నాక్షణంబ.

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచితభక్తి [2]ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప స
త్ఫూర్జితశక్తి నేయుడు ముహుఃగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలి యై యది కర్ణుఁ గిట్టినన్. 290

క. అతఁ డభిమంత్రితబాణ, ప్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థునిమీఁదన్
శితశరములు నినిచిన మారుతపుత్త్రుఁడు గనలి యన్నరున కిట్లనియెన్. 291

ఉ. సూతసుతుండు నీయెదుర సుక్కక నిల్చుట గాక నీశర
వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁ దొడంగె ఖాండవం
బేతెలి వొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా
నాతెలి వార్మ నూల్కొలిపి యగ్గలికం దెగటార్పు మీతనిన్. 292

చ. తెగి మనయగ్గమై యురుగుదెంచినవాఁ డితఁ [3]డుల్కి యింక నొం
దుగడకుఁ బోవకుండఁగ గదుర్మ వెన దగ్గఱి యేఁ గపాలముం
బగులుతునో గదానిహతిఁ బార్థ భవత్ప్రకటప్రతిజ్ఞకై
తగ దని మాన్చె దేని నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్. 293

వ. అని పలికె నప్పుడు. 294

1. గ. రిద్దఱుఁ దగన్. 2. క. దలంచి. 3. చ. డున్కి.

సీ. పుండరీకాక్షుండు x గాండీవితో నీదు,దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలపోవుటయు బలీమాపుల నాతండు నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు
నుత్సాహ మెడలి నీ x వునికియుఁ గని కురు,సంతతి యార్వఁ బాంచాలకోటి
పిఱునని పోవంగ x నెఱుఁగవో యెఱిఁగియుఁ,దగఁ జేయునది లేక x వెగడువడితొ
తే. చక్రమిచ్చెద నితనిమ x స్తకము దునుము, మనిన నగుచుఁ గిరీటి బ్ర x హ్మాస్త్రమధిక
నిష్ఠమై నేయ నది బహు x నిష్ఠురప్ర,దీప్తశరమూర్తిఁ గర్ణుని x కెదనకు నడరె. 295
క. ఆ రథికుఁడు దలఁకకే నియ,మారూఢప్రౌఢభావుఁ x డగుచుఁ దదస్త్రో
దారతరబలమునన త,ద్దారుణసంరంభ ముడిపె x ధరణీనాథా. 296
తే. ఉడిపి తోడన కవ్వడి x యొడలఁ గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె x మెఱుఁగుదూపు
లన్నరుఁడు గర్ణతనువు x శల్యాంగకములఁ
జించెఁ దొమ్మిదితొమ్మిది x శితశరముల. 297
ఆ. మొనసి క్రీడి మఱియు x మూఁడు నెనిమిదియు, రెండునాల్గు పదియుఁ x జంటమార్గ
ణములఁ గ్రుచ్చె సూత x నందనుపై నతఁ, డుఱక యతనిమార్వి x యూడ నేసె.
వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బోలి వోవక పార్థుం డాగుణంబు సమా
హితంబు సేసి పెల్లేసినరయంబున రాధేయుం డతనిశింజిని శిథిలంబు గాద కాక
యని తలంచె నాథసంజయుం డతనివింటినారి విగలంబుఁగా జేసి. 299
క. చిఱునగవుతోడ మైమఱు, వఱువుల్లఁగఁ జేసి యతని x యంగము దోఁగం
బఱపె రుధిరంబు వెసిదవు,మెఱుఁగువెడఁదయుంపగమి x నమిత్రులవలఁకన్. 300
చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ x దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి మం
దరధరు నస్త్రపంచక x నితాంతహతిం గను నొంచె నాశరో
త్కరము వరప్రభావక x లితం బగుటన్ మగుడంగ వచ్చె ని
ష్ఠురరథనం బెలర్ప మధు x సూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. 301
క. అలఘుపటుభల్లపంచక,ముల రెంటం గ్రీడి చిత్ర x ముగ నయ్యస్త్ర
మ్ములుమూఁడుమూఁడుశకల,మ్ములుగాఁ దునుమాడ జనులు x పొగడ నరేంద్రా.
క. కర్ణునిమొయి నాలోకన, కర్ణాంతాకృష్టచండ x కాండము లధిక
దీర్ణక్రోధంబున న,భ్యర్ణగతుం డగుచు గ్రుచ్చె x నతఁడే పలరన్. 303
చ. మఱియు నరుండు సూతసుతు x మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్మనమ్ముల వి x నిశ్చలధైర్యము పేర్మి నాతఁ డు
క్కఱక పెనంగె దానఁ గన x లగ్గలమై వెన నమ్మహాభుజుం
డఱిముఱిఁ జికటుల్ గవియ x నట్లుగ రోదసి నించెఁ దూపులన్. 304
తే. వెగడువడిచక్రరక్షకుల్ x వెనుకదిక్కు,గా చురథికులఁ బార్శ్వ x సంగతులుం దమ్ము
విడువఁ జాలక లజ్జ వో x విడిచి రవుడు, గర్ణువారలు వాఱుట x గవి విభుండు. 305

క. అదిక్కువారు భీముం, డాదిగ వని సేయు కుండుఁగనన్నియతి మొదం
దా దైన్య మొందె తప్పం, గాదని యూహింప నీవ్విశలఁకకతమునన్. 306

దుర్యోధనుఁడు తనయోధుల నర్జునుం దలపడఁ బురికొలుపుట.

వ. ఇరుగెలంకులమూఁకలం గలయం గనుంగొని మఱియుం గ్రొత్తి. 307

క. తోడరుఁడు పొదువుం జేయుఁడు, పొదువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పో నీక వానం
బడ నైవుం డొక్కమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా. 308

క. విను మతఁ డిమ్మెయిఁ బురికొల్పిన రథకరితురగసుభటబృందములు రయం
బున నురవణించె నర్జునుపైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్. 309

వ. ఎదిరిసైన్యంబు సమరంబు దొడంగి యుండుట యెఱింగి కడంగుట పాడి గాదని
దొరలు దురంబునకుం జొర కుండిరి గాండీవికోదండగుణరణనభరితభూనభోంత
రుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబులవేఁడిమి నూపిన నే పఱి వెఱచి య
మ్మూఁకలు పఱచిన నక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 310

క. బీరమును లావుఁ గల్గిన,మీ రందఱుఁ గర్ణు నొకనిమీఁదన యిమ్మైఁ
జో రెల్ల ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే. 311

వ. అనిన విని యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కమ్మడి నుర
వడించిన. 312

మ. భరితక్రోధమహోగ్రవృత్తి నిదముల్ భంజించుచున్ సూతుల
న్నరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు న్నశ్వంబులం జంపుచుం
నరుఁ డాభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వె న్నిచ్చి వి
చ్చిరి వా రందఱు దివ్యసంఘము నుతింపంచెం జూచి యుర్వీరునిన్. 313

చ. కురుపతి వెండియుం దఱుమఁ గొల్తలు సేయర క్రమ్మఱంగ నె
వ్వారు నతిభీతి నిట్లు మనవా రెడ గాఁ జని చూచు చుండి ర
వ్వురుసున నానమిద్ధరణిభాగము తూన్యతఁ బొందఁ గర్ణుఁ డ
న్నునుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యె భూవరా. 314

చ. క్రమమున నోలు చుండియుఁ బరాక్రమనంపదసొంపు మీఱ దు
ర్దమవివిధాస్త్రజాలతిమిరంబుల నొండొరుఁ గప్పికప్పి శౌ
ర్యములును బాహువీర్యములు రాజుల వచ్చెరు వందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్. 315

వ. అట్టియెడఁ దక్షకునపత్యం బై తత్సోదరుం డగునైరావతుండు పెనిచి యుప
లాలింప నుల్లసిల్లి నయశ్వసేనాభిధానుం డగునాగకుమారుండు నర్పముఖశరా
కారంబు గైకొని తనయొద్ద నుండఁ దానుఁ బసిండిపొఱం బెట్టి యనుదినంబును
గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు
వాఁడై యున్నయట్టియమ్మహానీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి

కొని తల డెగ వ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణ జ్వాలాజాలంబు లంబరంబునం
బర్వఁ జూపఱ హాహాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగవాపినం
గని [1]యారథికుచూపు కంఠంబుచక్కటికిం గాక తప్పియుపాంగప్రదేశంబుకొలంది
యగుటం జేసి యది సెవంబుగా శల్యుం డతనికిఁ జిత్తవైకల్యం బాపాదింపందలంచి
యీసంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు నిపుణంబుగా నిరూపించి
యొండుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గడలుకొన
సమ్మద్రపతిం జుఱచుచుం జూచి. 316

క. ననుఁ బోఁటిజోదునుం గా, దని పలుకఁగ నేర్పు నీకు నంత గలదె య
ట్లును గాక వినుము కర్ణుం, డిను మాఱొక శరము దొడుగునే పరులు నగన్. 317

వ. అని పలికి కలుషం బగుచిత్తంబుతో నెలుం గెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తంచు నేసిన. 318

క. పలుదెస మంటలు ప్రబ్బఁగ, నలఘుస్ఫురణమున నిగుడునయ్యస్త్రంబున్
జలజాక్షుఁడు గని పంచాంగుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్.

క. సురగరుడఖచరవిద్యా, ధరఖేచరు లంబరం బునదాత్తధ్వనినం
భరితముగఁ బొగడి రమ్మురహరు దివ్యప్రసవవిరచితార్చనతోడన్. 320

సర్పముఖశరంబున నర్జునకిరీటంబు భూమిపైఁ బడుట.

మ. కురువంశోత్తమ వారిదిక్ప్రజ సంక్షోభింప నప్పాఁపతూ
పు రయం బుగ్రము గాఁగ బిట్టడరి దంభోళిప్రభగ్నక్ష్మా
ధరశృంగాకృతి గా హరించె బహురత్నస్ఫీతరశ్మిచ్ఛటా
స్ఫురితం బైనకిరీటమున్ విజయునొప్పుం దేజమున్ గుందఁగన్. 321

తే. జనులు విహ్వలు లగునట్టిఘనరవంబు, దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ
గర్ణుఁ డట్లు ఛేదించె దిక్పతులచేత, నైనఁ జెడనికిరీట మయ్యహిశరమున. 322

క. సురపతి దపంబు సేసినఁ, బరమేష్ఠి ప్రియంబుఁ బొంది బహుమానపుర
స్సరముగ నిచ్చినయది యా, కిరీట మరిభీమణత్వకీర్తిదము నృపా. 323

ఆ. వనధివాసు లగునివాతకవచు లను, దనుజు లాపురందరున కజయ్యు
లైన నతఁడు పనుప నర్జునుఁ డోర్చిన, మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప. 324

చ. వినుము నరేంద్ర చూడ విన విస్మయ మిట్టిది [2]పాఁపరమ్ము వా
త నెగయుఘోరరూపభయదప్రథమానవిషాగ్నిజిహ్విక
ల్గనికినఁ దెల్చ మండుచు శిలాస్థలి డొల్లె నినుండు పశ్చిమాం
బునిధి నితాంతదృశ్యరుచి పొల్పునఁ గం బడుభంగి దోఁపఁగన్. 325

వ. అప్పుడు. 326

ఉ. శృంగము లేనినీలగిరిచెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ

1. గ. యాపాదపురావశరంబు. 2. గ. పాముటమ్ము. ఙ. పాముఱమ్ము. 3. ఙ. తంష్ట్రిభరాన.

య్యెం గనుపట్టె నెల్లతలఁ దొల్లియ మౌళి దృఢంబుగా నను
ర్చెం గురునాథ పూర్ణశశిచెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్నయందము ప్రతీతము గాఁగ నటించుచాడ్పునన్. 327

వ. అట్లు రాధేయశరప్రముక్తం బై కిరీటంబు నిర్దహించి నేలం గలపిన యమ్మహో
రగంబు గ్రమ్మఱం గవిసినం గని కమలనాభుండు గవ్వడితో మనమీఁద మగుడ
నిమ్మహాసర్పంబు నడచుచున్నయది యనిన నతం డిది యెక్కడిపా మిట్లు వచ్చు
టకుం గతం బేమి యని యడిగిన దీని నెఱుంగవే ఖాండవం బేర్చునప్పుడు దన
తల్లిని రక్షించికొని యనలంబునకుం దప్పిపోవం బోవ నీక నీ వేసిన నన్నాగాంగన
మృతిం బొందె నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మాయి నున్నయశ్వసేనాభిధాన
భుజంగంబు. 328

తే. అతఁ డేయఁ గిరీటంబు నపహరించి
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు నన్న నెఱిఁగి
యాఱుపటుభల్లములఁ దును మాడె నతఁడు. 329

వ. అత్తెఱంగున. 330

సీ. ఉరగంబుఁ దునిమి వేగమ రలి కర్ణునిమీఁదఁ, బదియుఁ బండ్రెండు నుగ్రపటుశరములు
నిగిడించి యుజ్జ్వలం బగుదోడ్డనారసం, బేసిన నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుచ్చి చనిన దం,డాహతం బైన మహాహిపోల్కె
నానూతనందనుఁ డత్యుగ్రుం డయ్యె, నంతకుమును ¹పాఁపఱమ్ముచేత

తే. నర్జునుఁడు పావమికి వెఱఁగంది యాతఁ, డటులు గెరలి పండ్రెండువాఁ డలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి, తొంటితగా నూఱుశరములను నాటనొంచె.

క. వెండియు బలువిడి నయ్యా,ఖండలసుతు నురము గ్రూరకాండంబుల నొం
డొండ కడు నొవ్వ నేసి య,తం డుబ్బున నార్చె గగనతల మద్రువఁగన్. 332

ఆ. అర్చి వెలుచ నట్టహాసంబు సేసిన, నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పొలుపఱ నఱకి యు,ల్లసితమకుటకుండలములు దునిచె. 333

వ. దునిచిన నబ్బలుమగండు. 334

క. శిరమునఁ గర్ణంబుల నె,త్తు రొలుక బరిమేనితోడఁ దూలక బాహు
స్ఫురణంబు మెఱయ సాయక,పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్. 335

తే. వానిఁ దును మాడి యాపాండుసూనుఁ డలఘు
ఘోరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱవ గైరికనిర్ఝరప్రకరశోభి

1. గ. పాఁపఱమ్ము; చ. పాముటమ్ము.

శాచలము వోలి పొలిచె నయ్యంగరాజు. 336

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవహ్నిదంతకాం
డమ్ములు పెక్కు సత్వరదృఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతని తేరును గూడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్. 337

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నప్పుడు. 338

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రత న్మెఱయ భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండలకాంతిపూరము
న్మొత్తపుదీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచున్నవన్. 339

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బోలివోనిబంటుతనంబున జంటమెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబులు రేణువులు గాఁ జేయు చుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె నయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున. 340

బ్రాహ్మణశాపంబునఁ గర్ణరథచక్రంబు భూమిం గ్రుంగుట.

క. భూసురశాపంబున నిదె, యీ సూతజురథముచక్ర మిలఁ గ్రుంగెడు నీ
కాసుఁ దగు నిటఁ దని సేనాసముదయముగ్మతిము విజనం బలికె నృపా. 341

వ. పరశురామదత్తం బయినభార్గవాస్త్రంబు పెక్కిటి మహానిమిత్తసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింపకుండ డాపటికల్లు [1]గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె నట్లు జామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱచుటయును సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం బగుటయును దనమనంబున నొవ్వ నరి యక్కర్ణుండు గరంబులు విముచ్చుచు. 342

తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన,చిత్తు లగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకు గావించె నతులధర్మ,శీలుఁ డగునాకు ధర్మవృత్తి సెలవు లేక.

క. అని ధర్మంబును దూఱఁగఁ, దను నర్జును బాణవితతి [2]దద్దయు వడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదంబున వెండియుఁ బెద్ద దూఱు భూవరముఖ్యా. 344

క. కన లధికమైన లావె,క్కినయయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశితశరములు మఱియుం, జొనిపెను దనధైర్యమహిమ సుర[3]లగ్గింపన్. 345

వ. అలిగి యర్జునుం డాశీవిషంబులుం బోనివిశిఖంబు లాఱుకర్ణుమీఁద నుద్బిచన నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 346

1. క. డింపిన: చ. డించిన. 2. క. దాఁకిన నొవ్వారినఁ గర్ణుండు. 3. క. లు మెచ్చింపన్.

క. అమితబలం బగుబ్రహ్మా,స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ జి
త్తమున విషాదము దనుకఁగఁ, గమలాక్షుఁడు గారవమునఁ గాండివితోడన్. 347

వ. నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచేత విధ్వస్తం బయ్యె నిట్లుగా నేల యన వుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయసాధనంబు బాధితంబు సేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటిమగండు గాండీవంబు మౌర్వి కోటిఁ బాసి పో నేసిన నాసవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగిడించిన రయంబున నాసూతపుత్త్రుమాడ్కి నమ్మౌర్వి యూడుట దోఁప కుండ నవ్వీరుండు వివ్వచ్చువిశిఖంబులు వారించి యతని నొంచిన వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి. 348

క. నిను నొంచువాఁడె కర్ణుం, డనితరసులభప్రకార § మగుభుజవీర్యం
బున [1]ననమానోజ్జ్వలఖే,లన మునుఁ దెగటార్పు శరవిశాలాస[2]నిరూఢా. 349

వ. అనునప్పుడు విషవిస్ఫురద్భుజగభంగికం బైనబాణంబు రౌద్రమంత్రసహితంబు సేసి కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నప్పళించి సంధింప మున్న కొండొక క్రుంగినచక్రంబు [3]కుండ మునుంగం దిగఁబడిన నొడ్డగెడవై యరదం బేటునకు ననువీక తక్కిన నుక్కఱి యక్కర్ణుం డప్రతీకారంబు లగురోషవిషాదంబులఁ గన్నీరొలుక రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు నిట్లనియె. 350

సీ. అరదంబుచక్రంబు § ధరఁ జాలఁ గ్రుంగిన, నెత్తెర నంతకు § నేయ కుండు
మేను భూమిస్థుఁడ § నీవు రథస్థుండ, వియ్యెడఁ దగ వగు § నేయ కునికి
విరిదలవానిని § విరథుని నాయుధం, బిడినవానిని శూరు § లేయ రెందు
మహిని శూరుఁడ వనుమాత్ర గా దుత్తమ,కులుఁడవు రణధర్మకోవిదుండ

ఆ. విట్టినీవు దగినయట్టిభంగిన యని, సేయ వలయు నిట్లు § సెప్ప వెల్లఁ
బాడి యేర్పడంగఁ బలుకుట గాని గో,విందునకును నీకు § వెఱచి కాదు. 351

వ. అనిన విని యచ్యుతుం డతని కిట్లనియె. 352

క. ఏమీ తగవును ధర్మము, నీమనమున నేఁడ పుట్టెనే గర్వము ను
ద్దామదురభిమానము నే,లా మఱచితి కర్ణ యా చలం బెట వోయెన్. 353

ఆ. పరమధర్మపరులు § పాండుభూవల్లభ,సుతులు వారి నతులశుభము లొందు
ధర్మహీను లైనధార్తరాష్ట్రులకుఁ బా,టిల్లు నివ్విధమున § నల్లచేటు. 354

వ. దీనికి నీవు కటకటంబడినం బోవునే యని పలికి వెండియు. 355

సీ. గొంతియు నందఱుగొడుకులు సుప్తులై, యుండంగ లక్కయిల్ § మండఁ జేసి
కపటంపుజూదంబు § ఘటియించి ధర్మాత్ముఁ, డగుధర్మసుతుసిరి § యపహరించి
యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స,భాస్థలి నమ్మాయి § భంగపఱిచి
యమ్మహాత్ములఁ బంప § నడవికి ఘోరమయా,త్రావిధానమున § దాడివెట్టి

---

1. గ. అనమానో. 2. గ. నిరూఢిన్. 3. చ. కుంటు; జ. గుండు.

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు తలఁపఁ
గాని యిప్పాపముల కాదికర్త వీవ
యున్నయెడలను నీపాడి యెందుఁ బోయె. 356

వ. అని యిట్లు కృష్ణుండు కర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగినయుద్ధసంజయామనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతివిస్మయప్రదంబై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్రపరాక్రమంబునం గురియు పటుబాణాసారంబు వారించి యవ్వీరు నంగంబున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతం బయ్యె నత్తెఱంగున నీడంబోక పెనంగు నతం డతిరయంబున నన్నరునిం బదిదొడ్డనారసంబుల నొప్పించిన నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుం బోలె మండి శత్రుసంత్రాసనంబును మిత్త్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగు నతని కేతనంబుఁ గనకపుంఖప్రభాభాసితం బైనభల్లంబునఁ బడ నేసినం గౌరవులు నిజయశోబలదర్పప్రియంబుల మొత్తంబులు వడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయుని దెస నిరాశులై రట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించి [1](స దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు గృష్ణార్జునుల మీఁదం గురిసి వెగడుపఱిచి యరదంబు పిఱిందికొమ్ముక్రిందికి మూఁపు సాఁచి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి కులపర్వతకాననసముద్రసహితం బాఱంగుళంబు తెగసె నట్లు కర్ణుండు రథంబు నిలిపి మీఁదికిం జని యొప్పటి బాణంబు సంధింప వెసియుఁ జక్రంబు క్రుంగినఁ గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్తె నమరె నయ్యవసరంబునఁ గృష్ణువనుపునం) గ్రీడి దోడన. 357

మ. కులిశప్రస్ఫురణాపహాసనవిభాగ్యగుచ్ఛంబులం గల్గి యూఁ
కలిమై వచ్చుకృతాంతువక్త్రమున నుగ్రంబై మురారాతియు
ద్ధులచక్రంబును శూలముం దెగడుచుం దీవ్రంపుటొప్పారు నం
జలికం బైనమహాస్త్రముం దొడిగి కర్షంబుబ్బునం జేయుచున్. 358

క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుండ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర మనియెన్. 359

క. అని తెగ నిండఁ దిగిచి యేసిన యయ్యస్త్రంబు రోదసీకుహరంబుం
దనమెఱుఁగుల నించుచు నిరు, మొనలజనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్.

—అర్జునప్రయుక్తం బగుఘోరశరంబు గర్ణునిశిరంబుఁ ద్రుంచుట.—

చ. నినదసముద్భటస్ఫురణ నింగి పగుల్పఁగ సర్వభూతకం

---

1. (.........) ఈపాఠము పెక్కుప్రతులఁ గానిపింపదు.

వన మగు చమ్మొయిఁ గిగిడి ✽ పార్థివసత్తమ యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ ✽ దోఁగుచుఁ గర్ణునియట్ల వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధ✽రాధరముం [1]దలఁపింపఁ బట్టుగన్. 361

క. చరమగిరినుండి పడియెను, తరణికరణి సూతపుత్త్ర✽తల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం,దరమును నగుకాయ మట్లు ✽ ధరణిం బడియెన్. 362

తే. అధిప యంతన కను విచ్చి ✽ యఖిలజనులు
గనుఁగొనంగ నయ్యుజ్జ్వల✽తనువు విడిచి
చని సముద్దీప్త మైన తే✽జంబు వారి
జాప్తబింబంబు సొచ్చె న✽త్యద్భుతముగ. 363

వ. అట్టియెడ. 364

క. వినుము మహీసురశాపము, మనుజేంద్రా సూతపుత్త్రు✽మరణాంతం బై
యునికిని రథచక్రము మే,దినిఁ గ్రుంగుట లేక తొంటి✽తెఱఁగున నుండెన్. 365

తే. దారుణాస్త్రజాలాంశుల✽వైరిసైన్య, తాప మొనరించి యాసూత✽తనయతరణి
పార్థదుస్తరశాలవై✽భవము గడవ, ననువు లేమి నవ్విధమున ✽ నస్తమించె. 366

క. సూతతనూజుఁడు పడినం, బ్రీతిం బాంచాలు రార్వఁ ✽ బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ సమ్మో,దాతిశయము నొందెఁ బాండ✽వానీకంబుల్. 367

క. నిడుఁగేలుఁ బలుతొడలు, న్వెడఁదయురము నై రణావ✽నిం గర్ణుఁడొగిల్
పడి యున్నఁగని విషాదం, బడరి తొలఁగుమూఁకఁ గ్రుంకె ✽ నర్కుం డంతన్.

తే. నిర్గతప్రాణు రాధేయు ✽ నిజకరములఁ, గరుణ పెంపున నంటుట ✽ కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ ✽ బోవునట్లు, నపరజలనిధిలోనికి ✽ నరిగె నినుఁడు. 369

వ. అప్పుడు. 370

తే. కాముఁ బాసినకమలంబు✽కరణిఁ బొలుచు
కర్ణుతల యిలఁ బడియు న✽దీర్ణకాంతి
నొప్పునట్టియుఁ జూచి శ✽ల్యుండు సిడము
ద్రెస్సి మోడైనయరదంబు ✽ ద్రిప్పె నధిప. 371

క. బలితపువిన నాభోతుం, బులి గొనినం బసులు వాఱు✽పోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁ డగుపార్థుఁడు కర్ణునిఁ, బొలియించిన నీదు సైన్య✽ములు వెఱఁ బఱచెన్.

తే. దీనవృత్తి శల్యుండు నీ✽సేనజనులు, నల్లు పాంచాలు రుబ్బున ✽ నార్వసిగ్గు
వడక పాండవమధ్యము✽సిడము మరలి, మరలి చూచుచుఁ బాఱిరి ✽ మనుజనాథ.

ఉ. గాండివముక్తబాణమునఁ ✽ గర్ణుఁడు గూలుటయుం దలంకి శ
ల్యుం డరదంబు దోలుటయు ✽ నొక్కమొగిన్ భవదీయసేన లొం
డొండొకలంగి పాఱుటయు ✽ నుల్లసితుం డయి చూచి వాయుపు

1. గ. జ. దలఁపించునట్లుగన్. 2. క. కలంగఁ బాఱుటయు.

త్రుంపు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. 374

క. ఆ నినదంబునఁ బాండవసైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్
మానవనాథ భవత్సుతమానసములు శోకఘూర్ణమానము లయ్యెన్. 375

వ. ఇవ్విధంబున నరదంబు దోలికొని యరిగి యమ్మద్రపతి బాష్పాకులలోచనుండును దీనాననుండును నుదీర్ణతరనిశ్శ్వాసుండును నై యున్నకౌరవేశ్వరుం జేరం జని యతనితో ని ట్లనియె. 376

చ. నరవర యొండుఁ జూడకు రణంబులఁ గర్ణుఁడు నర్జునుండు నం
గర మొనరింతు రే యెడల క్రౌర్యగిరూఢికి దివ్యు లొంది ర
చ్చెరు వడి యట్టు లుండె విను చెప్పెద నెంత యు భీతిఁ బొంది రా
హరియు నరుండుఁ గర్ణువశి [1]కంత విధాత్రుఁడు దప్ప వానికిన్. 377

వ. అని వెండియు. 378

మ. ధరణీచక్రము నీవ యేలుటకు నుత్సాహంబు వాటించి పో
రిరి ప్రాణంబులు డాఁపమిం బడిరి వీరిం జూడు మంచుం దురం
గ రథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబు లై యుండ నొ
ప్పి రణోర్విం బడి యున్నభూపతులఁ జూపెం జూపి యా రాజుతోన్. 379

వ. మఱియు నమ్మద్రపతి యింద్రయమవరుణకుబేరులఁ బోల్పం దగినయింతలింతలు మేటిమగలు మనకార్యంబున కై శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి ధైర్యంబు వోక డొందం బెనంగుట విఫలం బగుట విధికృతంబు దీనికి వగవం బని లే దని చెప్పి ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్ర చామర గజఘంటాతురంగకింకిణులతునియలం గంకణకేయూరహారమకుటంబులతునుకల్ల నభిరామభీషణం బగురణాంగణంబు సూపి నీకయి పెనంగి నమసినసైన్యంబు నాలోకింపు మనునప్పు డసురాంతపార్థులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చునమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంతవికలంబు లయి వినిపాతితరావణనందనుఁ డగుసుమిత్రానందనుసింహనాదంబున భయం బంది పఱచుదానవసేనలచందంబున నీకొను కున్ననెలవు విడిచి వలియం బాఱిన పెలపెలం బాఱునక్కురుపతితో నాశల్యుండు సంధ్యాసమయం బయ్యె నేటికిఁ గయ్యంబు సాలింపుము వేగుటయుఁ జేయువలయుకర్జంబు సూచికొంద మనియె నట్టియెడఁ గృపాశ్వత్థామకృతవర్మశకునిసుశర్మప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబు నొందినయాననంబులతో నిశ్శ్వాసంబులు నిగుడ నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటలతెఱంగు నూహించి మరలి కర్ణుం జేర్కొని విలాపంబు సేయుచు హాకర్ణ హాకర్ణ యనునెలుంగులతో [2](బలంబులఁ

1. క. గ. ళ. వంత. 2. (...) ఇది కొన్నిటఁ గానరాదు.

దివియ నియమించినం 'దివిసి) కౌరవులు దోడం జనుదేర నిజశిబిరంబునకుం బోయె నప్పొవ్వుట జూదంబున నోడి పాండునృపకుమారులు పురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి నై యుండె నయ్యవసరంబున. 380

చ. తనువులఁ గర్ణబాణములు లుగ్రదా త్తగతిం జెలువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ శౌరియును గవ్వడియుం వెలుఁగొంది రొక్కెడ
న్వనుతమరీచులై పొడిచి నిర్భరసంతమసంబు నగ్గడం
జన నభిరామమూర్తు లగుచంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్. 381

వ. ఇట్లొప్పి యమ్మొఱుంగుటమ్ములు వెలికి వైచి యొండొరులయాననంబు లాలోకించి రాత్రిముఖం బయ్యె విరోధుల వెనుకొనుటకు సమయంబు గాదని సంభాషణంబులు సేసి తమసేనలం దివియ నియమించి. 382

తే. బలునిఁ దెగటార్చి మరలుగోపతియుం హరియుఁ
బోలెఁ గర్ణుని నమయించి లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. 383

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు నిజనివాసంబులకుం జనిరి పాండవసేనాజనంబులు సంతసంబునఁ దేలుచు ధనంజయుం గెలంగి పొగడుచుం బోయి రివ్విధంబున జయంబునం బొంకిరివోవుచుఁ బాండవులు విడిదల కరిగి ధర్మనందనునగరిమొగసాలఁ జొచ్చి రట్టియెడ. 384

క. చెన్నునఁ బాంచాలురు మును, మున్నానృపుకడకు నేఁగి ముదితాత్ముం డై
యున్నయతనిఁ గని దీవన,ల న్నతులను నమ్మదానులాపములఁ దగన్. 385

వ. గారవించిరి విప్వచ్ఛుండు వేగంబ యరదంబు డిగ్గి చని యజ్ఞసపతిచరణంబులకుఁ బ్రణతుం డైన నతం డత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె భీమనకులసహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి పార్థుం గౌఁగిలించిరి కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన నమ్మహీవరుం డభివందించె నప్పుడు కృష్ణుం డతని కి ట్లనియె. 386

—•• శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట. ••—

క. భువనము లన్నియు నొక్కటఁ, గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగానోపు నె భూ
ధవ భవదీయక్రోధా,గ్ని విహతుఁ డై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్. 387

ఆ. రథికవర్యుఁ డైనరాధేయుపొలిసిన,యపుడ [1]యొల్లఁ బొలిసె నని తలంపు
కౌరవుల కడంగె వైరంబు నీ కింక, నెదురు లేదు ప్రీతిఁ బొదలు మాధవ. 388

చ. అన విని యమ్మురాంతకున కానృపుఁ డి ట్లను నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము శ్రీధర నీదగుకూర్మి కేను భా

1. క. ఱుముగఁ బొలిసె - గ. మెఱయఁ బొలిసె.

జన మఱి నాకు దుష్కరము । శత్రుజయంబు భవత్ప్రసాదజీ
వనులము మాకు సంపదలు । వచ్చు నవశ్యము నింత నమ్ముదున్. 389

ఆ. అఖిలరక్షకుండ । వగునీకు భక్తుల, మైనమమ్ముఁ గాచు । టరుదె తలఁప
భయము సెవ్వగయును । బాసి నాకంటికి, నిదుర వచ్చు నేఁడు । నీరజాక్ష. 390

వ. అనవుడు నచ్యుతుండు. 391

చ. మనమునఁ గూర్తు గాన తగుసమాటల నాకుఁ బ్రియం బొనర్పు టొ
ప్పును విను మీజయంబునకు । భూవర యేను నిమిత్తమాత్ర మీ
యనుజులు నీమఱందులు మహోద్ధురవిక్రమశీలు రిట్టిని
న్నొకఁడు పోర మార్కొనఁగ । నూల్కొని రూపఱ కుండ నేర్చునే. 392

వ. అని యిట్లు మధురసల్లాపసౌఖ్యంబు నొంది ధర్మనందనుండు పాలికలను సూచు వేడుక దనకుం బుట్టినఁ గృష్ణునితోడం జెప్పియతం డనుమతి సేయం గాలవాలంబులు దంతవర్ణంబులు నగురథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి యారోహణంబు సేసి కరదీపికాసహస్రంబులు వెలుంగ సమస్తబంధుమిత్రసోదరపరివృతుం డై యరుగునప్పుడు కృష్ణు నాలోకించి. 393

ఆ. సకలధరణివలయసామ్రాజ్యమునకు నేఁ, డేను భర్త నైతి । నెల్లపెంపు
గలిగి నీదుకరుణఁ । గడిఁదిమగం డగు, నగతుఁ డశ్రమమునఁ । దెగుటఁ జేసి. 394

క. అని కీర్తించుచు నరుఁ గనుఁగొని యగ్గించుచు ముదంబు । గూరినమదిలోఁ
జని కర్ణునిశిరమును ద,త్తనయులగాత్రములుఁ జూచె । ధరణీనాథా. 395

వ. చూచి త న్నప్పుడు గ్రమ్మఱ జన్మించినవానిఁగాఁ దలంచి యాపదలకుం బాసి సంపదలకు భాజనంబ నైతి నని యూఱడిల్లి యుల్లాసంబున మరలె నిట్లు కర్ణసాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది రని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 396

చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యాక్రతువు । విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన । నొందు నరుం జిరసౌఖ్యసంపదల్. 397

వ. అనుటయు. 398

చ. ప్రకటమహార్థసారభవరాశరనందనవాక్యమంజరీ
ప్రకరసమర్చితా పరమపావననామ జగత్త్రయీవిధా
యకపరిరక్షకప్రతిసమాహృతికారకచిత్తవృత్తిభా
వక భవబంధమోచన దివాకరచంద్రకృశానులోచనా. 399

క. వినతదురితనిరసనశుభ, జనకకలాకల్య[1]చరణసంభావన పా
వనతటినీమాల్య నమ, స్తనిగమసంవేద్య పరమసంయమిహృద్యా. 400

మాలిని. కరణఫలపరిత్యాగ వ్రతో[2]దాత్తచేతః
పరిణత[3]సుఖశీతశ్రీభ్రాజమానా నతాంహో
నిరసనచర[4]ణాబ్జోన్నిద్రతా రాజమానా
నిరవధిపరిణాహా ఽ నిర్భరానందదేహా. 401

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన శ్రీమహాభారతంబునఁ గర్ణపర్వంబునందు సర్వంబును దృతీయాశ్వాసము. 402

శ్రీమదాంధ్రమహాభారతమునందలి
కర్ణపర్వము సమాప్తము.



1. క. దివ్యాభరణసుసంభా, వనతటినీ. 2. గ. వ్రతోపాత్తచేతః. 3. క. ముఖశీత_గ. సుఖదేహ_ఘ. ముఖశీత_భ్రాజమానా:_ఙ. సుఖశీతభ్రాజితాభిమానమానా, 4. క. [illegible]



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శల్యపర్వము, ప్రథమాశ్వాసము.



గిరిజాసమవాయమ
హాగురుతరశుభగసంపదాలంబనదా
యోగిజనక్షేమసమా
హాగర్భితదివ్యచిత్త హరిహరనాథా. 1

క. దేవా జనమేజయధాత్రీవల్లభుఁ డుత్సుకత్వరేఖాసౌమ్య
శ్రీవిలసితుఁ డై యిట్లనుఁ, దా వైశంపాయనున కుదాత్తవినీతిన్. 2

క. దురమున నమ్మెయిఁ గర్ణుఁడు, పరిమార్పంబడిన నల్పపరిజనుఁ డై యా
కురుపతి యెదయ్యె లగున, య్యరులయెడం బిదప నెట్లు లయ్యె మునీంద్రా. 3

తే. ఏను మును విన్న యక్కౌరవేంద్రపాండు
విభుతనూజులచరితంబు వేడ్కఁ బెంచెఁ
జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్పు మనఘ
వారి దైన యనంతరప్రవర్తనంబు. 4

వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లనియె నట్లు కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరులు పరివేష్టింపఁ గొంచెపుమూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దేర్పవిషాదం బుడిగి సముత్సాహదోహలి యై శల్యునిం దనకు సేనాపతిఁ గావించి వేగుటయు బలువును బొలుపును వెలయఁ బాలికలనికి నడచెఁ బాండవేయులును [1](బలంబులతోడం) బన్ని యేతెంచిన[2](నయ్యిరువాఁగునకు) సురాసురసమరంబునుం బోనిసంగ్రామం బయ్యె నంత మధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బదంపడి భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కు దక్కి యక్కురువిభుం డనిపని సాలించి వెఱఁ బొండెనుడెందంబుతో నొక్కరుండును దొలంగం బాఱి యొక్కమడువు సొచ్చి దాఁగి యుండె నట గెలుపునుబ్బునం బొంపిరివోవుపాండవేయు లతం డరా

(1) (2) ఇవి వ్రాఁతప్రతుల లేవు.

దునికి యెఱింగి యయ్యెడకు నరిగి నలిరేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వశముని తోడి పెనంకువం బెద్దయుంబ్రొద్దు పెనంగి యా భూనాథుండు ప్రొద్దు సొలవ్రాలి నప్పుడు [1]భీముగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ కృపకృతవర్మలు దనకుం దోడుగా ధర్మనందనస్కంధావారంబుఁ బొదివి పాంచాలప్రభద్రకమాత్స్యప్రభృతిశేషసైన్యంబుల సమయించె మఱు నాఁడు సంజయుండు కురుక్షేత్రంబునందుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి. 5

చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రుపడ సంభృతశోకత రాజవీథి నె
వ్వరిఁ గని మైన హా మహితవైభవ హా ధృతరాష్ట్రపుత్త్ర హా
కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్. 6

క. జననయనచకోరానం, దనుఁ డగు నృపచంద్రుఁ డనుచితం బయినవిధం
బున నస్తమించె నంచుం, [2]దనుడోలనభరితభూరిదైన్యం డగుచున్ 7

వ. చని ధృతరాష్ట్రుమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారియుం గోడం డ్రును విదురుండును మఱియును దగుమట్టంబులును బరివేష్టింపఁ గర్ణులేమిఁ బ్రేముడించుపలుకులు సెల్లనుల్లంబు దురపిల్ల నున్నయన్నరనాథుం గని డగ్గుత్తిక పెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి పాదప్రణామం బాచరించి యేడ్పు వెరయ నెలుంగుతో ని ట్లనియె. 8

సీ. జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీటడఁగె నులూకుండు మడిసె సకల
సంశప్తకులు గడచనిరి కాంభోజశకానీకములు తెగటాఱె యవన
పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్దిక్కులమన్నీలుఁ దక్కఁగలుగు
నరనాయకులును జచ్చిరి కుమారులు గల మనవలుఁ దెగిరి కర్ణాత్మజులును

తే. బొలిసి రయ్య వృకోదరుపలుకు దప్ప, కుండఁ దద్గదాదండప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ బెలుచఁ, గూలి రూపఱి రారాజు ధూళిఁబ్రుంగె.

వ. మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ గలపాంచాలురును జేరి మాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులు లోనుగా నవశిష్టజనంబులును నిమ్మనుమలైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును సకలరథసామజ ఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొంది రిట్లు కౌరవశిబిరంబును బాండవ స్కంధావారంబును విధివశంబున [3]వనితావశేషంబులయ్యె నిందుఁ గృపకృతవర్మ లు నశ్వత్థామయుఁ గా మువ్వురును నంమఁ బాండవు లేవురును గృష్ణసాత్యకులు గా నేడ్వురును భవత్సుతుం డయినయుయుత్సుండును శేషించి రివ్విధంబునఁ బమనొ

1. క. తానుబడియె-జ. తాను వ్రాలె-నంత. 2. గ. తనశోకన-ఙ తనువోహాల-భరిత. 3. గ. నిరవ శేషంబు లయ్యె.

కందు నే డక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ గావింపను జంపనుం బూని కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు నొందెనని చెప్పుటయు నమ్మహీపతి మూర్ఛిల్లె విదురుండును వివశుం డై రొలిగెఁ గాంధారియుఁ గోడండ్రును జె య్యోది పుడమిం బడిరి తక్కటిచుట్టంబులు మొగంబులు మొగుడం జిత్రరూపంబులచందంబై రి సంజయప్రయత్నంబున నందఱుం గ్రమంబున దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్త్రహీనుండ ననాథుండ నగుట యెఱింగితే దమ్ముండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మఱియు నిగుడుమూర్ఛాతిశయంబునం బరవశుం డయిన నతండును నారీజనంబును శీతాంబుసేచనంబులను లలితవ్యజనవీజనంబులను గొండొకసేపునకు సేద దేర్చినం గూర్చుండి యక్కురువిభుండు కుంభనిక్షిప్త భుజంగంబుచందంబున నిశ్శ్వాసంబు నిగుడ్చుచు నూరకున్నం గనుంగొని యక్కాంతా సమూహంబును సంజయుండును రోదనంబు సేసిరి పదంపడి యవ్విచిత్రవీర్యనందనుండు. 10

ఆ. అనఘ వశముగాదు ♦ మనసు శోకసంభ్రమీఁ, బడినెఁ జుట్టములను ♦ సదనములకు
బుచ్చుమనియె [1]బలుకులచ్చుపాటడఁచుక, గ్గదికదైన్య మొనఁగ ♦ విదురు తోడ.

క. అనుటయు నాతం డందఱ,కును మొలపునఁ జెప్ప వగలఁ ♦ గుందుచు నల్ల
ల్లన తమనిలయంబులకును, జనిరి మఱియు నేడ్చుచుండె ♦ సంజయుఁ డలఁతన్.

వ. అమ్మేదినీశ్వరుం డేది గతి యని దుఃఖాతిశయంబునఁ జేతులు విదిర్చి యా సూతనందను దిక్కు మొగం బయి. 13

క. చావరు నొవ్వరు పాండవు, లేవురు నని నీవు చెప్ప ♦ నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే,తోవృత్తి దహింపఁ జొచ్చె ♦ దుర్భరభంగిన్. 14

క. తనయు లని నందఱుం బడి, రనఁగా విని పెక్కువక్కలు ♦ లై పోవక యి
ట్లునికి యరయ వజ్రమయం,బని తలఁపఁగఁదగు మదీయ ♦ హృదయంబున్.

ఉ. కన్నులు చీకు లై సుతనికాయముఖాంబుజవిహారలీలలుం
జెన్నగుప్రాయ మొందిన విలాసిల్లుతెఱంగును జూడఁ గాన కి
ట్లున్నను బంధుకోటి నయనోత్సవతలాలనఁ బల్కు పల్కులన్
విన్నవి వీను లిప్డు గొఱవిం దమిఁ జూడిన యట్లు పొక్కెడిన్. 16

వ. అని దుర్యోధను నుద్దేశించి. 17

సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్పు కొడుక మీఁ, దమ్మ రాజ్యశ్రీవశ్యవృత్తు
లగుదు మమ్ము విడుచుట ♦ దగునె యోగతిఁ బోవు, వారము పెఱ్ఱు యి ♦ కౌరవేంద్ర
యంధత్వవికలుల ♦ నరయుక యిట్టుపేక్షించితి నాయనఁ గృపణులఁ బ్రియము
నెక్కడ పోయె భూప మీవు గోలుపంగ, నుండు [2]సేవ ట్లొంటి యున్నవాఁడ

1. [illegible]

తే. నధికబలదర్పివారుండ । వైనసీకుఁ, బాండుపుత్త్రులచేత నక్కటాటఁ జావు
వచ్చెనిచ్చలు భక్తిమై । వచ్చి కొలిచి, గారవింప నింకెవ్వరు । గలరునాకు. 18

వ. కయ్యంపుమాట పుట్టిన యప్పుడు నీవు నాతోడ. 19

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాలపుత్త్రులెదురిం । దెవ్వాఁడు దృప్యద్భుజా
వ్యాపారుం డనిఁ గర్ణుఁ డొక్కరుఁడు మార్కయుం జేయు మద్బాణవి
ద్యాపారీణత గెల్తు నొక్కఁడన యే । నయ్యేవురన్ వ్రేల్మిడిన్. 20

తే. మున్ను చెప్పినవారు గా । కెన్నఁ గలరు, సుమ్ము బాహ్లికభగదత్త । సోమదత్త
శకునిభూరిశ్రవశ్శల్య । శల్యసింధు, రాజవిందానువిందాది । రథికవరులు. 21

క. ఏనును గర్ణుఁడుఁ దమ్ములు, నానలువురు వీరు లైన । నటు సూను పృథా
సూనుల నెట్లు జయించెద,నో నమ్మకము నాబలంబునను గలితనంబున్. 22

క. అని యూఱడిల్లఁ బలికిన, విని భవదీయానివార్యవిక్రమమునఁ బాం
డునరేంద్రసుతులు దెగుదుర, యని తలఁచితి నీవె తెగితె । యవ్వీరులచేన్. 23

క. అమరనదీతనయుఁడు సిం,హము గాక నరుండె పార్థుఁ । డట్టిమహాత్ముల్
సమయించె నట్టు జంబుక,నముని శిఖండిఁ గొని విధి క । సాధ్యము గలదే. 24

చ. శరగురుఁ డట్టియోధుఁ డటు । చచ్చె నరిన్ దొర గానివానిచే
నెరవున లావునన్ జనులు । వెక్కస మందఁగఁ జేయు సింధుభూ
వరుఁ డటు రిత్తపోయె నని । వార్యుల బాహ్లికసోమదత్తులం
బరు లవలీలఁ జంపి రటు । పల్కెదు నే మని యేను దైవమున్. 25

క. నీనమ్మినభూరిశ్రవుఁ, డేనికలా పతఁడు నెందు । నెన లేనిమగం
డై నభగదత్తుఁడును [1]వ,మ్మైన తెఱంగట్టె యేమి । యందుఁ గుమారా. 26

ఉ. నచ్చిన కర్ణువిక్రమము । నం బరవీరులయుం దొకండునుం
జచ్చుట లేదు దుర్దమము । శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి దందు నొక । మేలు వినంబడ దమ్మహాత్ములన్
ముచ్చులఁ జంపినట్టులు ప । రుల్ దెగటార్చిరి దైవ మిచ్చినన్. 27

తే. కొడుక తమ్ములు దోడ్పడఁ । గడఁగి శత్రు,వరుల గెలిచెదనంటి వొ । క్కరుఁడు నక్క
టుండ నీతమ్ముఁగుఱ్ఱలు । నూఱుచుట్టు, గానియెనే విధి యేగతిఁ । జనుమఁ జెపుమ.

క. కదిసి పవనజుఁడు బెట్టుగ, గద వ్రేసినఁ దొడలు విఱిగి । కయ్యపునేలన్
మద మఱి పడినప్పుడు నీ,మది నేమని తలఁచితో కుమార యెఱుంగన్. 29

వ. అని పెక్కుభంగుల విలపించి. 30

చ. తలపఁగ భాగ్యవంతుల కుదాత్తసుఖం బగుఁ గాక పుణ్యహీ
నుల కది గల్గ నెక్కునె తనూభవు లాఱడి వోయి రింక గా

1. క. వమ్మైన తెఱఁగు అట్టి దేమి. గ. వమ్మైన తెఱఁగు వింత దేమి.

నలఁ జరియింపఁ బోవుటయు । నా కుచితం బటు గాక చండి నై
నిలిచితి నేని మాటలను । నిచ్చలు భీముఁడు చూచుచుండఁడే. 31

క. విను దుర్యోధనదుశ్శాసనులఁ బలికి పలికి నిచ్చ చావుగ నప్పా
వని యులఁచుఁ గాన యడవికిఁ, జనుటయ మేలైన తెఱఁగు । సంజయనాకున్. 32

వ. అని పలికి యత్యంతదుఃఖమాపితస్వాంతుండగుచు నమ్మహీకాంతుండు నిట్టూర్పు నిగిడించి యా సూతనందనున కిట్లనియె. 33

క. సురసరిదాత్మజుఁడును శర,గురుఁడును గర్ణుండుఁ దెగుట । కుం దలఁకక యె
వ్వరిబాహుబలము గొని యే, మరి కోలల సేసికొన్కొ । మన వారనికిన్. 34

వ. అని తనకొడుకుచలం బూహించి. 35

చ. మను విదురుండు సెప్పె నతి । మూర్ఖుఁ డనోగతి యైనయీసుయో
ధనుచరితంబు గీడఖిల । ధాత్రిజనంబులకుం బొనర్చు నా
తన మని దానిఁ గొందఱవి । చారులు పాటిగఁ బట్టరైరి నా
కును మది వారి కట్లటుల । కుత్సిత మయ్యె విధాత త్రిప్పునన్. 36

క. అప్పు డటు లతఁడు సెప్పఁగఁ, దప్పఁ దలంచినఫలంబు । దగఁ గుడువక పోఁ
జొప్పడు నె సూతనందన, చెప్పు మనికి నెవ్వఁ డమరె । సేనాపతి యై. 37

చ. దురమున నర్జునప్రకట । దోర్విభవంబు నెదుర్పఁ జాలు ను
ద్ధురుఁ డొకరుండు గల్గెన వి । ధూతవిరోధిబలుండు శల్యుఁ డా
వ్వరిభుజశక్తిఁ జిక్కఁ గురు । వర్గమునంతయు మిట్లు సెల్లె దు
స్తరబలభాసిభీమునిగ । దం బడియెం గురుముఖ్యుఁ డమ్మెయిన్. 38

వ. కృపకృతవర్మాశ్వత్థామ లెబ్బంగి బ్రతికిరి ధృష్టద్యుమ్నశిఖండిప్రముఖపాంచాలురును జేది మాత్స్యప్రభద్రక ప్రభృతిబలంబులును నామనుమ లైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును దక్కనుం గలుగు యోధవీరులు నెవ్విధంబున మృతిఁ బొందిరి పాండవు లేవురును బద్మనాభసాత్యకులును యుయుత్సుండును నెత్తెఱంగునఁ దెగటారక తప్పిరింతయుఁ బరిపాటిఁ దేటపడం జెప్పుమనిన వినిసంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 39

ఉ. సూతసుతుండుఁ జేయఁ గల । శూరులు దర్పసమగ్రభూపతి
వ్రాతముఁ జెక్కుదంతిరథ । వాజిభటావలులున్ భుజాబల
స్ఫీతులు పాండునందనుల । చేఁ దెగటారిన నోడి పీటికిన్
సీతనయుండు హీనరథి । నీయుతుఁ డై యటు లేఁగి నవ్వగన్. 40

(కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట.)

వ. మందిరంబుఁ బ్రవేశింపక రొక్కబయల నిఖిలబంధుమిత్రపరిజనపరివృతుండై నిలిచి యయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుం డై కృపాచార్యుం డన్నరేంద్రున కిట్లనియె. 41

క. సమరము మీ మొఱఁగొంట్లకు నా, త్మమధర్మం బిదియ తొంటిరథాత్రికులు కృ
త్యముగాఁ గొని యాచరించిరి, తమకు సుగతి గోరి కీర్తిసంస్ఫురణమునన్. 42

క. [1]ఐనను నొకపలు కడ్డము, గా నొడివెద దాని తెన్ను గా విని యది మే
లైనను జేసెదు గాదే, న్మానెద వేర్పడఁగ వినుము మనుజాధీశా. 43

చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుఁడుం బరా
క్రమమహనీయు లాహవధురంధరు లట్టి తక్కఁగల్గుభూ
రమణులు బంధుమిత్త్రులు దురంబున నందఱఁ బాండునందనుల్
సమయఁగఁ జేసి రట్లు భుజశక్తియు దైవబలంబు నెక్కుడై. 44

చ. వెరవును లావునుం గలుగువీరులు పోరులఁ బడ్డ హీనతం
బొరసితి మస్త్రశస్త్రహతి భూవర చిక్కినవారు నొల్లఁ బో
యిరి విను పాండురాజసుతు తేవురు గంటికి రెప్పచందమై
హరి తమఁ గావఁ గా వెలసి రతులదేహవిలాససంపదన్. 45

క. శ్వేతాశ్వపాటవం బుద్ద్యోతితమై మెఱయఁగాఁ జతుర్దంతరుచి
స్ఫీతమగుగజము క్రియ నరుఁ, డాతతకురుసైన్యసరసియందుఁ జరించున్. 46

క. జ్యారవము నాదముగ నతి,ఘోరత వైరు లనుకరటికోటికి రయదు
ర్వారం బగునర్జునకంఠీరవము శితాస్త్రనఖవ్యాపటిమతఁ జూపున్. 47

తే. అర్జునోదగ్రదవశిఖ హరిమహానిలంబు ప్రేరేప వైరిబలప్రకీర్ణ
గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ, దేఱిచూడను రాకున్కి యదెల్ల మధిప.

ఉ. ద్రోణుఁడు సూతనందనుఁడు ద్రోణతనూజుఁడు నేను శల్యుఁడుం
బ్రాణపరాయణత్వమున దర్పము సూపఁగ నీవుఁ దమ్ములున్
బాణపరంపరల్ గురియ ఫల్గునుఁ డందఱ మీఱి సైంధవ
ప్రాణము నాఁచికోలు నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే. 49

ఉ. ఇంతకమున్న పెల్లెఁ బదియేడువినంబులసంగరం బతి
శ్రాంతతఁ గుంది రిందుఁ గలసైనికు లద్దెనఁ గల్గుయోధు లా
క్రాంతవిరోధిదర్పుఁడు పురందరనందనుబల్మికల్మిని
శ్చింతత సల్లసిల్లెదరు చెక్కు చెమర్పక కౌరవేశ్వరా. 50

క. బలవిక్రమధను లగుదొర, లిలిగిన మనసేన మేదినీశ్వర విను క
న్నులు సెడిన ట్టున్నదియా, కొలఁదిం బోరింగొనుట నరునకున్ సుకరమగున్. 51

వ. అని చెప్పి కృతవర్మశల్యగురుపుత్త్రులను దన్ను నెన్ని. 52

క. దామోదరుతమ్ముండును, భీముఁడు నిరుగెలఁకులందుఁ బేర్చి తఱిమి ను
గ్గాడగతి నడరుకవ్వడి, కే మిందఱఁ దలఁప నొక్కయెత్తు కుమారా. 53

చ. అనిలసుతుండు పూన్కి బలుపారఁగ, గొండొక దీర్చి నేవు నొం

1. గ. ఏ నొకపలు కడ్డముగా, నే నొడివెద దాని తెన్ను విని మది యందు.

దినభుజసంపదం గొఱంత దీర్పఁగ నింకఁ గడంగ కుండునే
మనకు నజాతశత్రునిసమంచితమార్దవ మూఁది సంధి సే
యఁ నుచిత మైనకాల మిది యాగ్రహముం జొరనీకు చిత్తమున్. 54

క. సమరము నిష్కారణమై, రమునం బాటిల్లె నెల్లరాజులు భరతో
త్తములును మడిసిరి విదు రో,వము దీర్ఘక్రోధుఁ డైనపతి కీ డొందున్. 55

క. తమకు బలం బెక్కువలనఁ, ననుచిత మగువిగ్రహంబు శత్రుల కుత్సా
హము మీఱినపుడు కర్తవ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్. 56

క. తలవాకిల్లను దెగి నీ,తలన నిలిచెఁ గార్య మధిప తగ నొడఁబడు మి
ట్టల మగునాత్మవినాశము, కలుగుట యది విపులపాతకం బండ్రు బుధుల్. 57

క. తనవై కాదే మది నెల్లను గోరుట వినుము దాఁ బ్రళయ మొందెనయే
నిని వారనియుద్యోగం,బునకు ఫలం బేమి రాజపుంగవ చెపుమా. 58

క. నినుఁ గాచికొనుము నీ వు,న్నను సర్వము గల్గు ధర్మనందనునిఁ దగం
గను మతఁడు రాజ నని తన,మనమున నెక్కొంచుకొనఁడు మదగర్వంబుల్.

తే. రాజ్యభాగంబు దగ ధృతరాష్ట్రునకును, నీకు నన్నదమ్ములకు నానృపతియునఁగు
నాతఁడెపుడు శుశ్రూషసేయంగఁ గోరు, గురుజనములకుఁ గావునఁ గూడుటొప్పు.

చ. హరియును గా దనండు కరుణాన్వితు లై తగ నమ్మహాత్ము లె
ప్పరుసునఁ గార్యనిశ్చయము పల్కినఁ గీచకవైరియుం బురం
దరతనయుండునుం గవలు దానికి మార్పలుకంగ నెమ్మియుం
జొర రగు సంధి యిట్లు నసనూయత నాల్కొని చేయు మిత్తఱిన్. 61

ఆ. ఇంత చెప్ప టనికి నే నోడి ప్రాణర,క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య మనియుఁ దలఁచిపల్కితి విను విన, వేని నొచ్చి తలఁచెదిట్టులగుట. 62

వ. అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుండు వేఁడినిట్టూర్పు నిగిడించి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యూరకుండి ప్రాల్చనకనుదోయి విచ్చి యవ్విప్రవరుమొగంబు సూచి యిట్లనియె. 63

చ. చెడుటకు నోర్వ కీ విటులు చెప్పితి నాకు హితంబు, నెయ్యు మె
క్కుడు గలయట్టిచుట్టమునకుం జయశీలు దగుం గదా భరం
పడి బవరంబులం బెనఁగుసభంగిని గార్యము దెల్పఁ జాలిన
వ్వాఁడు నిను రక్షకార్థి వని భూసురసత్తమ యే నెఱుంగుదున్. 64

వ. నీకూర్మిపేర్మిం జేసి కీడు దొలంగింపం జూచి సంధికర్తవ్యం బని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లం టేని. 65

సీ. కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబు, గొని ధర్మజునిమది గుందఁ జేసి
నభ నేకవస్త్ర రజస్వల నమ్మెయిఁ, బాంచాలి, ముందల వట్టి యీడ్చి

సంధి సేయఁగఁ బూని శౌరి యేతెంచిన, నవ్విధంబున కప్రియం బొనర్చి
పలువురు గూడి సౌభద్రు నొక్కని బాలుఁ, గిట్టి యుత్తలఁగున గీటడంచి
తే. నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తు రనిలసుతుఁడు మదమునఁ ద్రావుటఁ జూచి కొలఁది
ప్రతినదీర్చు నతండని భయముఁ బొంది, పొందుఁ గోరిన నది యేల పాసెఁ జెపుమ.
ఉ. రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి
భ్రాజితవృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు శత్రుకోటికి
న్దైజము [1]దప్పఁ జేయుచు [2]నతిప్రమదంబున నున్ననాకు నిం
కాజియొ కాక యొక్కని దయం గనురాజ్యసుఖంబు లేటికిన్. 67
వ. నిశ్చయం బిట్టిద యగుటం జేసి. 68
ఆ. పొడుతు నెట్లు పాండుపుత్త్రులతోఁ గయ్య, మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమి గాఁగఁ దలఁపకు ముచితంబు, తెలుఁగు ధీరజనుల కెఱుఁగరాదె.
చ. విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు
త్త్రభటసమానవృత్తమున దైన్యము నొందుట కోర్వ రాదు వీ
తభయతఁ బోరఁ [3]బేర్కొని యుదాత్తపదంబున కేఁగి భీష్మకుం
భభవజయద్రథాదు లగుబంధుల మిత్త్రులఁ గూడు టొప్పగున్. 70
వ. అంత వలవ దిమ్మాట మగపాడి కాదిదిం గాని. 71
ఆ. ఏను దెంపు చేసి యీయున్నరథికజనంబుతోడఁ గడఁగి నడవఁ బెట్టుఁ
దఱిమి పాండురాజతనయుల మర్దింతు, ననఘ నీవు మెచ్చునట్లు గాఁగ. 72
చ. అన విని చుట్టు నున్ననృపు లందఱు నంతన మంది యన్నరేం
ద్రుని వినుతించి యోటమికి రోయుట నొందినచింత వంత యె
ల్లను దిగఁ ద్రోచి సమ్మదములన్ రణకౌతుక మావహిల్లనా
ననములు దోఁప దర్పవచనంబుల సేనకు నుబ్బొనర్చుచున్. 73

—✿ దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీతీరంబు సేరుట. ✿—

వ. చెలంగి కృప కృతవర్మాశ్వత్థామ శకుని శల్యులు గార్యంబు విచారించి కౌర
వేశ్వరు నాలోకించి మన మీరాత్రి శిబిరంబున నిద్రించుట యొప్ప దెట్లనినఁ
గర్ణుం డెగటార్చుటం జేసి పేర్చినయుబ్బునఁ బాండవులు పైకొని పరాక్రమింప
నప్పళింపఁ గలుగుదు రో యని తలంచెదము వినుము వంచనఁ దొలంగి యుండి
మనకుం గలచతురంగంబుల నాయితంబు సేసికొని పెనఁకువం బన్ని వారికి వెఱ
గగునట్టి పెట్టిదంపుటురవడిం గదిసి రణంబు సేయుద మట్లైన జయంబు గొనవచ్చు
నని చెప్పిన నవ్వసుమతీపతి ప్రీతుండై యది లెస్సవెర వట్ల చేయుద మనినము
చితభంగిం దగువారల కెఱింగించి కదలి యచటికి రెండామడ యగుసరస్వతీ
ప్రాంతం బయలికి బలంబులం గొని చని సకలజనవాహనసహితంబుగా నమ్మహా

1. గ. తప్ప సేయుచు. 2. క. అనింద్యపరాక్రమమతిం నున్ననా, కాజియొ. 3. జ. పేర్కొని.

నదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి వలయుతెఱంగున వెనుక నడ
తెంచినవివిధాహారంబులం దుష్టిం బొంది యిష్టాలాపంబులు సెల్లుచుండ నున్న
సమయంబున ముఖ్యాకర్ణంబు నడపినద్రోణులును జిత్రసేనాది భవత్కుమారులును
గర్ణకొడుకు సత్యసేనుండును లోనైనయా ప్రజనంబు లమ్మనుజనాథున కిట్లనిరి.

చ. వెరవును లావునుం గలిగి విక్రమసంపద సొంపు మీఱి భూ
వర భవదీయమైనబలవర్గము నొద్దన మేర్పడీక మైఁ
బురికొలుపంగ నిర్భయతఁ బోరెదునట్లుగఁ దాను [1]ముందరై
తిరముగఁ జేయఁ జాలు నొకధీరు నొనర్పుము సైన్యనాథుఁ గన్. 75

వ. అనిన విని వృషస్కంధుండును బీనదీర్ఘభుజార్గళుండును భర్గవరలబ్ధజన్ముండును
దివ్యాస్త్రవేదియు నవ్యాహతవిక్రమోద్దాముండును నగునశ్వత్థాము నాలోకించి
యాదరభరితుం డగుచు నా ధరణీవరుం డతని కిట్లనియె. 76

ఆ. అనఘ నీవు నాకు నాచార్యునట్టుల, నేడుగడయుఁ గాన హితము సెప్పఁ
దగు బలాధినాథుఁగఁ జేయ నెవ్వని, నెల్ల వినఁగ నిశ్చయింప వలయు. 77

చ. అనుటయు నాతఁ డిట్టు లను నజ్జనపాలున కాజినైపుణం
బును మహనీయశౌర్యమును భూరిబలంబును [2]సర్వసత్త్వవే
ధనముఁ బరాక్రమోద్ధతియు ధైర్యసమగ్రతయుం గలండు శ
ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా. 78

క. నినుఁ బట్టి పాండుపుత్త్రులఁ, దనమేనల్లురఁ దొఱఁగె ధరణీశ్వర యీ
తనిఁ గడచినపరమహితులు, మనకుఁ గలరె యితఁడు లోకసమాన్యుఁడు గాఁడే. 79

తే. కార్తికేయుం డధీశుఁడుగా సమర్థు, లెలమిఁ బురికొని దైత్యులఁ గెలుచుకరణి
మద్రవిభుఁ డగ్రణిగ నేఁడు మనము నడచి, కడఁదిపగఱ జయింతము కౌరవేంద్ర. 80

వ. అనిన విని సమస్తజగతీశులును జయజయశబ్దంబులతో శల్యుం బరివేష్టించి సంగ
రోత్సాహంబునం బొంగిరి కురునాథుండు గద్దియ డిగి సవినయంబున నమ్మద్రవిభున
కభిముఖుండై యిట్లనియె. 81

ఉ. పాటవము లేనిసైన్యమునఁ బూని విపద్దశ నొంద కుండఁగా
నెచ్చెలిఁ గావఁ జూచుమహనీయున కిట్టిద కాల [3]మిప్పుడీ
వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున నద్భుతంబుగా
ల్పిచ్చి కృతార్థుఁ జేయు మను నే నినుఁ జెందియుఁ దూలఁ బోము నే. 82

క. పూనుము చమూపతిత్వము, నానమ్మినవారు నేను నరపతిబలసం
తానంబుతోడఁ బరిజన, మై నడచెద మాక్రమింపు మరివర్గంబున్. 83

చ. అన విని శల్యుఁ డిట్లనియె నమ్మనుజేంద్రున కిప్పు డింత ప్రా
ర్థన మొనరింప నేల వసుధాధవర యే నినుఁ జేసినట్ల నా

1. క. ముంగలై. 2. ఖ. సర్వశస్త్రకోవిదనము. 3. గ. మిప్పుడు వచ్చు.

ధనమును బ్రాణముఁ బలవిక్రమానము నీకు సమర్పణంబు సే
సినయది గావె నీవనువుఁ జేసెదఁ గౌరవసేనఁ గాచెదన్. 84

మ. భుజవీర్యంబున నచ్యుతార్జునులు వర్గఁ బోలంగ లేరల్క వ
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాకచే నొత్తురే నేఁడి య
క్కజపుం జేవయు లావుఁ జూపువడికిం గౌంతేయులే యొత్తు రా
ప్రజయంబున్ నీ ప్రజయుం గలంగఁ జెలఁగం బాటింతు నాటోపమున్. 85

చ. అతిముఖ బాణజాలములఁ నక్కడి సైనికులం దెరల్చెదన్
గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసినవీరవర్గమున్
నతిశదఁ జూచు ఖేచరగణంబుల కచ్చెరుపాటొనర్చెదన్
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన రూపడంచెదన్. 86

శా. గంగానందనుపోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ
జుం [1]గీడాడుచు నీతఁ డెవ్వఁడొకొ యంచున్ శల్యుఁడే యిట్టివా
నిం గయ్యంబుల మున్ను గాన మనుచు న్వ్యేథంగులం జూవ తె
ల్లం గీర్తింప ధనుఃకళానిపుణలీ[2]లాఖేలతన్ జూపెదన్. 87

—✿ దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట. ✿—

వ. అని పలికిన నీసుతుండు ప్రీతుండై కనకకలశంబుల సరస్వతీజలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునఁ దగురాజులుం దానును సేనామధ్యంబున భద్రవిధానోపేతంబుగా నమ్మద్రవిభు నభిషేకించి బలాధిపత్యపట్టబంధంబు నిర్వర్తించిన శంఖభేరీప్రముఖమంగళతూర్యరవంబులుం జెలంగ సైనికసింహనాదంబు లుల్లసిల్ల నప్పు డాశల్యు నుద్దేశించి దీవనలం బొగడ్తల నఖిలజనంబులును ముఖరులయి రిట్లు సంతసిల్లి సపరివారంబుగాఁ గురుభూమీశ్వరుండు విశ్రామంబు నొంద నట్టియెడ మున్ను సమరజయంబునం బ్రమోదభరితుం డగుచు నిజశిబిరంబునకుం జనినపాండవాగ్రజుండు బంధుమిత్రపరిజనంబులుఁ దమశిష్టనికలకుం బోవం బనుపక యుచితప్రదేశంబునఁ బేరోలగం బుండి మనవారివలనివిశేషంబు లరయఁ జారులం బనిచినవాఁడై వారలు మగిడి వచ్చునంతకు నేమేని వినోదంబులం బ్రొద్దు పుచ్చి యక్కడియుత్సాహంబు తెఱంగంతయు విని యచ్యుతునాననం బాలోకించి యి ట్లనియె. 88

చ. కురుపతి మద్రరాజుఁ దనకున్ బలముఖ్యునిఁగా నొనర్చి సం
గరమున కుత్సహించె నధికప్రమదంబున వారిసేన యుం
దిర మయి పేర్చి యున్నయది దీనికి నెయ్యది సేయువార మీ
వరయుము కార్యవృత్తి హృదయంబునఁ బాండవరక్షణోత్సుకా. 89

---

1. గ. గీటాడుచు. 2. చ. లాశీలతన్ _ జ. లాలోలతన్.

వ. నీ వెట్లు నిశ్చయించి పలికెద దట్ల చేయుదు ననిన నమ్మహీకాంతునకు మురాంతకుం డి ట్లనియె. 90

సీ. శల్యు నెఱుంగుదు శౌర్యధైర్యంబు లగ్గల మాతనికి బాహుబలఘనుండు
గాంగేయకుంభజకర్ణుల మిగిలెడుఁ, గాదేని సముఁ డగుఁ గాని [1]యనదు
గాఁ దలంపఁగరాదు కౌరవపతి మాన్యుఁ, జేయుట నధికవిజృంభణంబుఁ
జూపు భీమునకు నర్జునునకు [2]నెనయంగ, రాదు సాత్యకి కోర్వరాదు పార్ష
తే. తునకుఁ దత్సోదరులకు మార్కొని పెనంగి, బ్రదుకరాదు నీవీట నాబల్లిదునకు
నెదురరథికునిఁ గాన ననేకహేతి, నిపుణశార్దూలవిక్రమ నీవు దక్క. 91

క. ఒరు లయినఁ జెక్కు [3]దినములఁ, బోరిఁ గొను నీబలము నెల్లఁ బోరి పోవ నతం
డరిభంజన నీవైనం, బరమోత్సాహమున నెల్లి పడఁ డైతతనిన్. 92

ఆ. అతఁడు మేనమామ యనుకృప దక్కుము, రాజధర్మమును బురస్కరించి
యతులవిక్రమక్రియాపాటవంబున, నవ్విరోధినాము మడఁప వలయు. 93

క. గాంగేయునిఁ గుంభజుఁ గర్ణుం గడచితి మింక నుద్ధురుం డగు మద్రే
శుం గూల్పు మంతతోడఁ దెగుం గురుపతిపని జయుంబు గొనుము కడంకన్.

వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కి ట్లనియె. 95

ఆ. అనఘ నీవు చెప్పినట్టులు సేసెద, మున్ను పలికినాఁడ నన్న రెండు
కడిమి నాకుఁ బాలు గాఁ బూని యుద్యోగ, వేళయందు నెల్ల వినుచునుండ.

వ. సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని పలికి పద్మనాభునిఁ దనతమ్ములను ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖులను దక్కటిపరిజనంబులను నిజమందిరంబులకుం బోవం బనిచి వీతశల్యం బైనమాతంగంబుచందంబున శయ్యాతలంబు సేరె బలం బంతయు నత్యంతసంతుష్టం బై విశ్రాంతి నొందె నా రాత్రి యే నిట వచ్చి నీకుఁ గర్ణువృత్తాంతంబు సెప్పి నీవు వనుప మగిడి చని తెల్లతెల వేఁగునప్పుడు కౌరవసేనాసన్నివేశంబు సేరితి నా సమయంబునన్. 97

క. కురుపతి పనవాళ్యం దగు, దొరలకడకు నత్వరముగ దురమునకు భటో
త్కరము ననువు సేయుటకై, బరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా. 98

వ. పనిచిన నెల్లవారు నుల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్ల దమతమ చతురంగంబులకు నవరణలు సంఘటింపం దొడంగినఁ దూర్యంబులు సెలంగ నొండొరులఁ బిలుచునెలుంగులు నింగి ముట్ట రథనేమిగజపదతురంగఖురపుటభటచరణసంఘట్టితం బగుధరణీతలం బద్రువ బహుళం బగునులివు చంద్రోదయసమయసంపూర్ణమానం బగుమహార్ణవంబునినదంబు ననుకరించె నట్లాయితం బై శల్యశకునికృతవర్మాశ్వత్థామలును దక్కనుంగలయోధవరులును నొక్కెడ సముదనహాతుం డై యున్నమనుజపతిసన్నిధిఁ గూడి యతండు వినఁ దమలో ని ట్లనిరి. 99

1. క. గ. ఘ. యనుదు. 2 గ. నెనయంగ. 3. గ. విధమున.

క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ, కక సైన్యోపేతగాఢగతి నందఱు నొ
క్కట తల గాఁ దలఁపడి వా, రి కడంక యడుపఁగవలయుఁ గ్రీడ యుపోలెన్.

వ. మన యొక్కొక్కరుఁ బ్రాపగుచు నేపారి పోరినం జుల్కన గెల్వఁ గొనవచ్చు నిత్తెఱంగు మనకు సమయంబు సుండీ యట్లుఁ గాక యొంటి వెనంగిసివాఁడును వెనఁగడివానిఁ గని కూడుకొనినవాఁడును బంచవిధపాపంబుల నొందఁగలవాఁ డని యొండొరులకుం జెప్పికొని కదలి యుద్దామసామర్థ్యంబున సముద్రపతి మ్రింగలి యై పడవం జనునప్పుడు. 101

—— కౌరవసైన్యంబు యుద్ధసన్నద్ధం బై వెడలుట. ——

సీ. చంచరీకావళిఝుంకృతు[1]ల్ గల్పించు, కర్ణఝళంఝళాకలనములును
ధరణీపరాగసంతానంబు గబళించు, కరశీకరచ్ఛటాస్ఫురణములును
ఘంటికాటంకృతికాంతి సంభావించు, నిర్భరబృంహితనిస్వనములు
నంబరభాగంబు నల్పంబు గావించు, నున్నతగాత్రసముద్ధతులును
తే. చారుభీషణ రేఖలు భూరిమదభ, రాభిరామయానంబులు నాహవోచి
తోగ్రకల్పనాభంగులు నుల్లసిల్లఁ, గరులు ధాత్రీతలంబు గ్రక్కదల నడచె.

చ. గతిబహుతాలనతురవిఘట్టిత మేదిని జీవి తేశక
ల్పితనఖరేఖలం జెలువు పెంపు వహించుపురంధ్రిఁ బోల ను
ద్ధతదృఢబంధురాంగలతికంబులు నూర్జితకింకిణీఝణ
త్కృతిపటుహేషలుం దగ నుదీర్ణము లై నడచెం దురంగముల్. 103

సీ. మిన్నొరసినయుబ్బున [2]మీఁదికిఁ గాలులు, సాఁచురథ్యంబులచటులతయును
[3]లలిఁ బెండ్లికిఁ బోవు చెలువున విలసిల్లు, సూతజనంబువిస్ఫూర్జితంబు
జతనంబు మీఱమిఁ జారుఘోరము లగు, నవయవంబులవిధవాతిశయము
బిరుదుల నుద్భటస్ఫురణంబు లై క్రాలు, కేతనంబులసముద్ద్యోతితంబు
తే. సొంపు మిగులంగ యోధులయుజ్జ్వలముల, దీప్తులును శితశస్త్రసందీప్తులును
[4]హారిరశ్ములఁ గీడ్పర నగుచు వెలుఁగఁ, దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర. 104

చ. కడఁకయు లావునుం గరఁగి కట్టిగఁ గూర్చి యొనర్చినట్టి పే
రాడములఁ దాల్మియుం గడిమియుం గలయం బచరించి యామ నే
ర్పడుకొని గాఢభంగి రచియించినచందము నెమ్మనంబులం
గడుఁ జెలు వొందఁ నుబ్బి పడిఁ గాల్బలు మేఁగెఁ గరం బుదగ్రతన్. 105

వ. ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరం బోవునంతం బాండవబలంబునుం జను
దెంచె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 106

తే. సురనదీసుతుచావును గురునిచావుఁ, గర్ణుచావును వినినయాకర్ణములకు
శల్యుచావు దుర్యోధనుచావుఁ జెప్పి, యధికతరముగ సంతోషమావహింపు.

1. ఱ. అల్పించు. 2. గ. మిన్నంటి. 3. ఖ. లలి. 4. జ. హారరశ్ము.

క. అమ్మనుజవిభుని ధర్మజు, డెమ్మెయిఁ బరిమార్చెఁ గౌరవేంద్రుని భీముం
డెమ్మెయి గీటడఁచె రణం, బెమ్మెయిఁ బరిపాటిఁ జెల్లె నేర్పడఁ జెపుమా. 108

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లను వగచుకొలంది కడచనియె ధీరుండవై వార్త లవధరింపుము. 109

క. గంగాసుతగురుకర్ణుల, సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా
రం గనియు నీతనయు లాసం గూరిరి వారిఁ జంపు గెల్వం దనుచున్. 110

వ. దుర్యోధనుండు దిక్కుమాలియుండియు నశియానం జేసి తన్ను సంపన్నునింగాఁ దలంచుచు. 111

చ. అనుజులు దాను కర్ణునిఁ బ్రియాతిశయంబునఁ జేరఁ బోవ నా
యన మును గర్ణుఁ డర్జునశరాహతిఁ గూలిన సుబ్బి భీముఁ డా
ర్చిన నడ లొంది తల్లడిలుచి గ్రమ లూఁటెటు నొంద వారలం
గనుఁగొని పల్కులం బ్రతిసుఖం బొనరించె సుదగ్రమూర్తియై. 112

వ. ఇట్లు సమరోత్సాహసముగ్రుం డయిన మద్రపతి సర్వతోభద్రవ్యూహంబు వన్నించె నందు ముఖంబున మద్రపతి కర్ణపుత్త్రప్రముఖపరివృతుండై తాను నిలిచె వలపట శకయవనసమేతుండై కృపాచార్యుండును దాపటఁ ద్రిగర్తసహితుండై కృతవర్మయు వెనుకఁ గాంభోజసహాయుండై యశ్వత్థామయు నడుమఁ గురువీరపరిరక్షితుండయి కౌరవేశ్వరుండును నతనిముందటఁ గరిఘటాగ్రభాగవర్తియైనబహులచతురంగంబులతోడ శకునియు నిలుచునట్లుగా నొనర్చి పేర్చి యురవణించె నంతట నున్న పాండవులు మూఁడుమొగంబులుగా మోహరించిరి ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకు లగ్రేసరులుగా భీమార్జును లగ్రజునగ్రభాగంబున శోభిల్లి సీతారూపవిద్యోతితం బైనకల్యకేతనంబు నూచి తోఁచి నడచి రనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ బాండవులకుం గలసేనాంగంబులకొలంది యెఱింగింపు మనవుడు సంజయుం డాజనపతి కిట్లను మనకుఁ బదునొకండువేలు రథంబులును బదివేలునేడునూఱు గజంబులును రెండులక్షలు హయంబులును మూఁడుగోట్లు పదాతులును వారికి నాఱువేలు రథంబులును మూఁడువే లేనుంగులును లక్షగుఱ్ఱంబులును గోటికాల్బలంబులును గలిగియుండె నయ్యుద్ధసంబు లొండొంటి గెలుచునగ్గలిక దగ్గఱియె నట్టియెడ. 113

ఉ. ఒండొరులం జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి య
ప్పాండవకౌరవుల్ పెనఁగుకథంగి గనుంగొనువేడ్క నొక్కొ యా
తండు మహాద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగుబింబకాంతి న
ర్కుం డభిరాముఁ డై పొనుపుగొండవయిం బెలుఁ గొండెఁ జూడఁగన్. 114

చ. అరసి యనాగతం బెఱుఁగునట్టిమనంబులు గల్గుపాండుభూ
వరసుతబంధుమిత్త్రకురువర్గసుహృజ్జనకోటు లత్తఱిం

మోరసె నతిప్రమోదమును । భూరివిషాదము నాఁగ నంబుజో
త్కరము వికాస మట్లు ముకుళదంబులు మీలన మొందె నంతయున్. 115

సీ. కుంజరనికురుంబ।కుంభస్థలీసంగ,సిందూరరుచులతోఁ । జెలిమి చేసి
కేతనవ్రాతసం।కీలితమాణిక్య,రశ్ములగడ విహా।రంబు సలిపి
సైనికనికరవ।క్షస్థలవరిలిప్త, కాశ్మీర[1]దీప్తులఁ । గాఁగిలించి
దండనాథోత్కర।చండభావోద్వృత్త, చక్షుఃప్రభలఁ దారు । సరసమాడి
తే. యంశుజాలంబు లుభయసై।న్యంబులందుఁ
బరఁగి బహువిధశస్త్రాస్త్ర।కిరణతతుల
గెరసి [2]పరభాగలక్ష్మి దీ।పించి మెఱయ
గాల్యరమణీయుఁ డగుచిత్ర।భానుఁ డొప్పె. 116

కురుపాండవుల పదునెనిమిదవనాఁటి యుద్ధప్రారంభము.

వ. ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దాకొని భేరీప్రముఖతూర్యనిస్వనంబులు
నింగి పొంగం జెలంగ. 117

క. ఒండొంటిఁ దాఁకి హేతులు, మండఁగ ధచ్చూర్ణతతులు । మహిఁ రాలఁగ ను
ద్దండతఁ గలయం బెరసెను, రెండుమొనలుఁ గ్రూరతర।విస్ఫురణము లై. 118

వ. ఇత్తెఱంగునఁ దలపడి. 119

క. అరదంబులు నరదంబులఁ, గరులు గరుల హరులు హరులఁ । గాల్వురుమఱి గా
ల్వురఁ దాఁకి [3]పెనఁగెఁ గడుభీ,కరభంగులు మెచ్చుదేర । గగనచరులకున్. 120

చ. పెనుపును నాకసం బవియ।బృంహితముల్ దను నుగ్రగర్జిత
స్వనములతోడిమేఘముల।చందము గా నొనరింప మీఁదిరో
ధనికర మేయుసాయక।వితానము భీమవృష్టి గా రయం
బునఁ బయికొన్నయేనుఁగుల।పోఁగునఁ దేరులు దేలె నెత్తుటన్. 121

తే. కరులగమి పొదివి [4]రథముల్।గాలుకొనఁగ, నీక మరలినఘోట।కానీకములను
విరుదుమగల మొత్తములను।బిండిసేఁచు, నేయుబలితంపునేర్పుల।చ్చెరువుఁ బెనుప.
పటురయమున నాశ్వికు లొ,క్కటఁ బెక్కం డ్రెక్కి రథని।కరములు ఝడిలి
త్రుటితాకృతులుగ విహరిం,చుట మొక్కడు వేడ్కసేయ।సురగణమునకున్. 123
పలువురనొక్కఁడు నొక్కనిఁ, బలువురుఁ దెగటార్చుటయును।బలుదెఱఁగులమూఁ
కలు పలుదెఱఁగులఁ దలఁపడి,పొలియించుట పొలియుటయును।బోరినక్రమమున్.
చలమునఁ జొక్క పెనఁగుకా,ల్బలమువయిం దురగములు ని।భంబులు నరదం
బులుఁ గూడి కవిసి యింతిం,తలు దునియలు సేఁత యనుచి।తకార్యము గాన్.
తెల్లనిసవరణ మెఱయ న్త్రముల్లసితము లగుతురంగ।ముల మొత్తము చం

1. ఙ. దీధితుల్. 2. ఙ. ప్రాగ్భాగలక్ష్మి. 3. పెనఁగెడుభీక......మెచ్చునేర. 4. గ. రథముల్.

చల్లలితవత్సముల కో,భిల్లుగతుల నొప్పనంచఁ బ్రాపింపం బోలన్. 126

వ. అయ్యిరువాఁగును బేరు వాడునప్పుడు. 127

క. గుణనినదము రథనేమి,క్వణనంబుం దురగఖురరవముఁ గరిఘంటా
రణనమును హేతిసంఘ,ట్టణనాదముఁ దూర్యఘోషనంపదఁ గడచెన్. 128

సీ. నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడువీరు, లలరిన నవ[1] మోదుగులవిధంబు
గ్రక్కునఁ దెగి పడి కదలెడుబాహుదం,డములు మహాభుజంగములభంగి
యవని రక్తార్ద్రంబు లై యున్న[2] యట్టిబ,ల్లలు గెందామరకొలనివగిది
దఱచు గా నేలఁ దప్ప నొఱిగినగజములు, కులిశభగ్నాచలకులమునట్లు

తే. దునిసి తోఁగినజోదులతోడలు సాధు
జములకరములు నొండొంటిఁ జందములు గ
నుంగొనఁగ వింత లగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు నయ్యె. 129

తే. ఏమి చెప్పుదు [3]రౌద్రంపుఁ బెనకమందుఁ
దఱచుమొదళులు కొంపులు నఱుములైన
యెమ్ములిసుకయు సితచామరమ్ము లంచ
లయ్యె రుధిరంపుటేఱుల కప్పు డధిప. 130

క. విను మర్త్యేయులలో వా,హనములె యోడలు గఁ జూడ నక్కజ మగున్మ
క్కున నుద్దామవిహారం, బొనరించిరి వీరయోధు లుర్వీనాథా. 131

వ. ఇవ్విధంబునం బోరు ఘోరంబై చెల్లుచుండ నుల్లసితవిక్రమవిజృంభితు లగుభీమపార్థులు నలిరేఁగి నారాచప్రముఖనానావిశిఖంబుల మనమునఁ గనుపుగొట్టినది బెగడొంది మగిడిన నమ్మాటిమగ లుబ్బి పాంచ్రదేవదత్తంబుల నొత్తుటయుఁ ధృష్టద్యుమ్నుండును శిఖండియుఁ గౌంతేయాగ్రజు మున్నిడికొని తఱుమఁ దొడఁగవలును గడంగి రథ్లాటోపదీపితు లైనపాంచాలయులయురవడికి నోటఱి సీబలంబు హాహాకారంబులతోఁ బలుదెనలఁ బఱవం దొడంగినం గనుంగొని శల్యుండు సారథి కి ట్లనియె. 132

ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణి తేరు సితాశ్వయుక్తమై
తెల్లని మొల్లి నొప్పినది తీవ్రత మార్కొని యా నృపాలుకో
భిల్లుట మాన్పఁగా వలయు భీమణభంగి రథంబు వోవ ని
మ్మెల్లజనంబు నాకడిమి యేర్పడ నేఁ డెఱుఁగంగఁ జేసెదన్. 133

ఆ. సురలనైన గెలుతు దురమున వినునాథుఁ, బాండుపుత్త్రులెదురె భండనమున
నేర్పు బలువుఁ జూపి నిన్ను మెప్పింతు నా, చేతిబలువు నూడు మాలవర్య 134

వ. అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురు గా నరదంబు నముచితరయంబున

1. గ. క్రొమోదుగులు. 2. జ. వట్టుపల్ వలలు 3. క.గ.జ. రౌద్రంపుబెను

నడపె నమ్మద్రపతి సముద్ర సముద్రేకంబు చందంబై నయ్యాసైన్యంబు సరభసత్వంబు
చెలియలికట్టయుం బోలి యుడుపుట యచ్చెరువై యుండె నట్లు శౌర్యధైర్యంబుల
నుల్లసిల్లుశల్యుం జూచి మనమూఁకలును మగుడ నిగిడిన సంగ్రామంబు భీమం
బయ్యె నందు నకులుండును కర్ణపుత్త్రుం డగుచిత్రసేనుండునుదలఁపడి యొండొరు
వులకుఁ గృతాస్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం బెనంగు నెడ నా
సూతపుత్త్రుండు. 185

—:కర్ణకొడుకులు చిత్రసేనసత్యసేనసుశర్మలు నకులునిచేతఁ జచ్చుట.:—

చ. నకులునిచాపదండము ఘనప్రదరంబున దున్మి భాస్వరాం
బకములు మూఁడు దీవ్రగతిఁ ఫాలతలంబున నాటి త్రుంచె ఘో
టకములఁ గేతనం బిలఁ బడఁగ విదళించి వధించె సూతు ఖే
టకమును ఖడ్గముం గొని కడంగఁ బయిం బరఁగించె భల్లముల్. 186

క. ఆ నిశితభల్లములు దన, మేనికి రాకుండఁ బలుక మెఱయ జడియుచుఁ గా
వే నిగిడి కదిసె మాద్రీ,సూనుం డాసూతసూతిసూనునరదమున్. 187

తే. కదిసి వీఁడికి లంఘించి కడుద మెలర్ప, గళము దునిమిన నమ్మస్తకంబు డొల్లెఁ
కర్ణపూరకిరీటసంకలితవివిధ,రత్నరోచులు మెఱయ ధరాతలమున. 138

వ. ఇట్లు చిత్రసేనుండు పడినం గనుంగొని కౌంతేయసైనికు లార్చినం జేర్చినశోక
రోషంబులు మానంబుల ముప్పిరిఁ గొన వానిసోదరులు సత్యసేనుండును సుశర్ముం
డును సప్పాండుపుత్త్రుపైఁ గవిసిన నతండు వేఱొక్కతేరెక్కి బలువిల్లెత్తి
దండధరప్రచండమూర్తి యైమార్కొనిన నబ్బిరుదుమగ లయ్యరదంబు భల్లం
బుల పఱకం దొడంగిన నుఱక చిఱునవ్వు నవ్వి. 189

చ. కడువడి సత్యసేనుతురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జ
క్కడిచిన నొండుతేరికి రయంబు మెయిం జని యన్యచాప మె
క్కిడుటయు నక్కుమారునిశితేషుయుగంబున నొంచి నొంచెఁ గ
వ్వడియనుజన్ముఁ డుగ్రుఁ డయి వానిసహోదరు రెండుతూఁపులన్. 140

తే. అతనిధను వాసుశర్ముఁ డుద్ధతి దలిర్పఁ
ద్రుంచుటయు నొండువింట జిల్లఁదూపు లొడలఁ
బఱపి వానిశిరంబును నఱకి సత్య
సేనువిలుఁ ద్రుంచె నా పాండుసూనుఁ డధిప. 141

శా. ఆ రాధేయతనూజుఁ డవ్యథను వుగ్రాకారుఁ డై యెత్తి దు
ర్వారప్రక్రియ నేసె నా విశిఖముల్ వారించి యాతం డతి
క్రూరస్ఫారశరత్రయం బతనివక్షశ్శోభిత్తిఁ గీలించి పే
నారాచంబులు రెండు దమ్ముని మెయిన్ నాటం గడుం బెట్టు గన్. 142

క. వా రలిగి యొక్కయుమ్మడి, సారథిఁ జెగటార్చి యార్చి చాపముదునియం

చేరు వికలము గ మేను విదారితము గ నేసె రథ్యసంగ్రస్ఫురణన్. 143

వ. ఇవ్విధంబున. 144

మ. విరథుండై వినికృత్తచాపుఁడు శరార్తవిద్ధుండునై మేదినీ
వర సీపుత్రుఁడు చంచదుగ్రతరజిహ్వాంబైనచండాహి నాఁ
గర మాభీలతఁ బొల్చుశక్తిఁ గొని యుగ్రోల్కాభ సత్యారుం డయ్యు సు
స్థిరసంరంభత సత్యసేనుఁ బడ వైచెం జూడ నగ్గింపఁగన్. 145

ఆ. అన్నపాటు సూచి యనుజుఁ డుల్లంబున, నడలు కనలు గదుర సంపవానఁ
గప్పినకులునంతఁ గాంచి భీముకుమారుఁ, డెడుద నడచి యురవ్యమెక్క నతఁడు.

వ. ఇట్లు ద్రౌపదేయుం డగుశ్రుతసోముసియురవం బెక్కి బలువిల్లుఁ గొని యక్కుమారుండును దోడుపడ నాసుశర్మునిఁ బటుశరపరంపరలం బొదివినఁ బొలివోక యతండు. 147

తే. వాఁడితూఁపులు నకులుమై మూఁడు నాటి
యిరువదింటఁ దత్పుత్రునియురము నొంప
నర్ధచంద్రబాణాహతి నవ్విరోధి
శిరము దునిమె నప్పాండుభూవరసుతుండు. 148

శా. మాద్రీపుత్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం జూచి పే
రోద్రేకం బెసలంగ నీసుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన
న్మద్రాధీశుఁడు సింహనాదము రణన్మోర్వీసముల్లాసముల్
రౌద్రప్రక్రమసూచకంబులు గ సంరంభస్ఫురన్మూర్తియై. 149

తే. హస్తతల మెత్తి నిలునిలుమని యనల్పఁ, బోక తిరిగియుమ్మాకలు పోకమరఁ
బాండవేయుల మొనలు సుద్దండవృత్తి, నురవణించిన సంగరము గ్రమమ్మె.

చ. అడరి ధనంజయాదు లగుసనక్రషిచివిదులు విక్రమింప ని
క్కడ భవదీయనందనముఖప్రభవోద్భటయోధవర్గము
ల్వడిఁ దఱుమంగ నప్పుడు బలవ్యాయముల్ విశిఖాళి [1] వేర్పు యె
క్కుడమునభీతి నొందె రణఘోరత భూవర యేమి చెప్పుదున్. 151

వ. ఇట్లు మథితం బయ్యును బౌరుషంబు పెంపున నియునాఁగు వేగంబు గుందక వింతచందంబునం బెద్ద క్రందు గగనచరులకుఁ గన్నులపండువు గా బృంహిత ధ్వనులను ఘంటానినదంబులను నేమినిస్వనంబులను గేతుకింకిణీక్వణనంబులను [2]ఝంఝారవంబులను హేషాఘోషంబులను భుజాస్ఫాలనంబులను సింహనాదంబులను దిక్తటభేదనం బొనర్ప నమ్మహోత్సాహంబున నాహవక్రీడ సలుపుచుండ సుండరీకాక్షరక్షితు లగుపాండుపుత్త్రులబలశౌర్యసంపదలసొంపునం జెం పౌరవు ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖు లైనదండనాయకులు మూఁకొని కయ్యము దారుణ

1. క. కేర్పి. 2. జ, ఝంఝారవంబులను.

నైపుణంబున బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు గవిసినం గలఁగుమృగకులంబు
కైవడిం గౌరవసైన్యంబు దైన్యంబు నొందిన. 152

క. పెనుకొంపిలోవలను బ్రుం,గిన ధేనువు నెత్తుపోల్కిని శల్యుం డ
మ్మెయ్యిఁ దనభుజబలమునఁ గలఁ,గనియట్లుఁగ నిలిపె శౌర్యగర్వము మెఱయన్.

వ. నిలిపి పేర్చిన సమయంబున మనదిక్కున నుల్కాపాత ప్రముఖంబు లగుదుర్ని
మిత్తంబులు వొడమిన నీకొడుకులు గూడికొని చేయం గలసైనికులం గూర్చికొని
తిరం బయి పెనంగి రట్లు పెనంగునెడఁ గడంగి తలకడచి మిగిలి మద్రపతి
మార్గణాసారంబు వఱఁగించుచుఁ బాండవాగ్రజునగ్రభాగంబున నున్నభీమసేన
సాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయమాద్రేయులఁ దాఁకి పదివది ప్రదరంబుల
నొప్పించి కదిసి యన్నరపతిని బదితూఁపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాల
ప్రభద్రకబలంబు లాజెట్టిబిరుదుచుట్టు ముట్టిన. 154

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం
గూలుగజంబులుం గెడయుఘోటకపుతండముఁ ద్రెళ్లు తేరులుం
గీలెడలించినట్లు పడుకేతువితానము సుగ్గునూఁచ మై
రాలుపదాతివర్గములు గ్రక్తపుటేరులుఁ బ్రేవుప్రోవులున్. 155

వ. మఱియును. 156

క. పేరూపు లయిన రూపఱి, ఘోరాశనులట్లు శల్యక్రూరాస్త్రంబుల్
కౌరవులు పొంగఁ బాండుకుమారులసేనపయిఁ దొరఁగె మనుజాధీశా. 157

వ. అట్లు దొరుగుదారుణమార్గణాసారంబున వెగడుపడి యా బలంబు పాండవా
గ్రజు వెనుక కొదిఁగిన నమ్మహీపతి పురికొలిపికొని శల్యుమార్కొని నిశితవిశిఖ
వర్షంబునం బొదివిన నమ్మద్రవిభుండు క్రూరనారాచం బతనిమే నుచ్చిపో నేయ
నా ధర్మనందనునకుం దలకడచి యేడమ్ముల నవ్వశమునియు సహదేవుం డయిదు
తూఁపులను నకులుండు నవశరంబులను బ్రతివింధ్యాదిద్రౌపదేయులు బహుబాణ
పరంపరలను నవ్వీరు నేయ నప్పుడు గృపాచార్యుండును గృతవర్మయు శకునియుఁ
దత్సుతుండు నులూకుండును నీకొడుకులుం గవిసిరి గురుపుత్త్రుండు మందహాసం
బుతో సమందగతి వచ్చి వారిఁ గూడికొనియె నక్కడి సైనికులును రభసంబున
నా రథికవరులఁ దాఁకి రట్టియెడ. 158

క. కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు, నుపమాతీతాతిఘోరయుద్ధంబున బా
హుపటుత్వమ్ములు సూపి రథిప రొండొరులకు [1]సముత్సవదీప్తాకృతులై. 159

క. ఒకని నొకనిఁ బదివదిసా,యకముల నొప్పించి వీరు లగుపాండుకుమా
రకు లేవుర నంతట ద్రోణకుమారుఁడు మిగుల చిత్రకనగవున నొప్పన్. 160

ఆ. వాయుతనయు [2]ఋక్షవర్ణాశ్వముల మద్రపతి ధరిత్రిఁ గూల్చె నతఁడు దేఱ

1. క. సమగ్రదీప్తా. 2. గ. చిత్రవర్ణా.

డిగ్గి నిజగదాప్రకటస్థితిఁ జూపెఁ గౌ,రవ్యసైన్యమునకు రాజముఖ్య. 161
క. అనిలజనియుక్తములఁ గూ,ల్చినయప్పుడు శల్యు[1]నిం గ్రలితనము మెఱయం
తనయంపవెల్లిచే ముం,చె నకులుతమ్ముండు నీయుగ్రసేన దలంకన్. 162
తే. అతనిహయములు నమ్మద్రపతిశరములఁ
బడిన నప్పాండవునిఁ దలఁకడచి బలము
పొదివె నయ్యోధముఖ్యుఁ డత్యుత్తుఁ డవుడు
గదిసె నానహదేవుపైఁ గడిమి మెఱయ. 163
చ. కవిసిన దట్టకాం పడయక న్నలతోడఁ గృపాణపాణి యై
యవనికి దాఁటి యాతనిశరావలి ద్రుంచుచుఁ గిట్టి తేరిపై
కి వడిఁ జలంబుమై నరిగి కేళియపోలె శిరంబు ద్రుంచి పో
యె వెసఁ బొగడ్త కెక్క ధరణీశ్వర యొండురథంబు నీఁదికిన్. 164
వ. ఇవ్విధంబున. 165
క. సుతుఁ డీల్గిన మద్రమహీ,పతి శోకక్రోధవేగభరితాత్ముఁ డై
శితశరపరంపరల నుద్ధతిఁ బాండవసైనికులమదం బడఁగించెన్. 166

శల్య భీమసేనుల గదాయుద్ధము.

క. ఉరవడి రథికజనంబులఁ, దెరలిచి యేపారుతనదుక తేరు మెఱయు ను
ద్ధురగతిఁ గౌంతేయాగ్రజ,నరదమునకుఁ గవిసె వాలుగరమ్ములు నిగుడన్. 167
సీ. కనుఁగొని భీముండు కన్నుల నిప్పులు, రాల కుండలకీలాలరంజి
తంబును రిపుసైన్యదైన్యప్రదంబును, నాత్మీయవాహినీహర్షకరము
నై శతధారామ్రనాభుజగతుమా,ధరశృంగసమత నుగ్రదగ్ర మగుచు
నెనిమిదియంచులనెసఁగు మెఱుంగుల, దారుణం బగుగదాదండ ముగ్ర
తే. రేఖ సారించి రౌద్ర మ్యుద్రేక మందఁ, గదిసి మద్రాధిపునితురంగములఁ జదియ
[2]మోఁదె నాతండు దోర్మదమునఁ దదీయ,విపులవక్షంబు ఛేదించె నృపవరేణ్య. 168
క. ఉరమున నాటినఘనతో,మరమును దా చేతఁ బెఱికి మారుతి మద్రే
శ్వరుసూతు వైచె దానన, ధరణిని బొరగిలఁబడ నుగ్రదగ్రస్ఫురణన్. 169
మ. విరథుం డై పాలివోనిదర్పమున నవ్వీరుండు ఘోరంపుము
ద్గరముం గేల నమర్చి తేరు డిగి దుర్వారాంతకాకృతిఁ వజ్రభా
సురశక్రుండును దండచండయముఁడుం శూలోగ్రఫాలాక్షుఁడుం
నరి సేయం దగువారు గాఁగఁ బొలిచెన్ సంస్తుత్యసంరంభతన్. 170
వ. ఇట్లు వష్టంభవిజృంభితుం డైనయాసేనాధిపతిం జూచి యేచి భీముఁ డుద్దామరభ
సంబున నతనికిసమ్ముఖంబుగా నడరినఁ బణవాదివాదిత్రనిర్భరనినదంబులు సెలంగ
నప్పు డయ్యిరువాఁగు నిరువురనేనికపోరు చూచువిధంబునఁ గనుఁగొనుచు గదా

1. గ. శోకలితములు. 2. ఖ. మోఁదు.

రణంబునకు శల్యుండు దక్క మారుతి మార్కొనఁ జాలు మేటిమగలు నివ్వసుమతి వెలిగా నిమ్మద్రపతి మీఁదఁ గవియ నట్టి జెట్టిబిరుదులుం గలరే యనుచు నచ్చెరు వొందు చుండ. 171

ఆ. మండలప్రచారసమహితాకృతులు గర్జ, నలుగఁ బొలిచి మాఱుమలసి యంకె
లెనఁగఁ బోరి కమరి యేపారువృషభయుగంబునట్లు వారు గవిసి రధిప. 172

చ. మదమున నిమ్మెయిం గదిసి మద్రవిభుండును భీమసేనుఁడున్
గదలమెఱుంగు లాకసము గ్రమ్మఁగ నుద్భటభంగిఁ ద్రిప్పి వె
ట్టిదముగ వ్రేయ నిప్పులు వెడిం దొరఁగించె సమగ్రవిస్మయ
[1]ప్రదరవభంగు లై యవి పరస్పరఘోరవిఘట్టనంబునన్. 173

వ. ఇట్లు దొడంగి. 174

క. ధిక్కారంబులు చరణదళత్కారంబులును మెఱయ బలువు వెరవు పె
రుక్కును నెక్కుడు వేగము, నక్కజములు గా నుదీర్ణు లై పోరునెడన్. 175

చ. వెరవున నంగముల్ నుసులు వ్రేటులు పమ్మఁగఁ [2]దాఁకినప్పుడి
క్కరిరదనప్రహారములఁ గంపము నొందక యుండు మేదినీ
ధరములఁ బోల్పఁ బట్టగు నుదగ్రపుమూర్తుల కిద్దఱందు ని
ష్ఠురరభసంబు శౌర్యముఁ బటుత్వముఁ ద్రాసునఁ బెట్టినట్లుగన్. 176

వ. ఒక్కొక్క[3]మా ఱుబ్బున. 177

క. ఎనిమిదియడుగుల కొలఁదిని, వెనువెనుకకుఁ బోయి నిగిడి వేగంబునఁ గి
[4]ట్టినతగళులకై పడి దాఁకు నగంబులభంగిఁ దోఁచుఁ గురుకులముఖ్యా. 178

వ. ఇత్తెఱంగున నెనంగి నెత్తుటఁ జొత్తిల్లిన యంగంబులు పుష్పితకింశుకంబులఁ బోలఁ బరిశ్రమంబు నొందియుఁ బొలివోవనిదర్పంబున. 179

గదాయుద్ధమున మూర్ఛితుఁ డైనశల్యునిఁ గృపుఁడు తొలంగం గొనిపోవుట.

క. ఇరువురును [5]సందు సూడక, వెర వెడలినయాగ్రహముల వ్రేసినగద లొం
డొరులమెడలకెలఁకుల బ, ల్లురములు దాఁకుటయు వారిలం బడి రధిపా. 180

వ. ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛిల్లుటయు నుభయసైన్యంబులును హాహాకారముఖరు లై రట్టియెడఁ గృపాచార్యుండు శల్యుకడకుఁ దనరథంబు రయంబునం బఱపించి. 181

క. పడియును గద విడువని యక్కడిఁదిమగని గ్రుచ్చి యెత్తి గారవమున నం
దిడి తొలఁగం గొనిపోయెను, వడముడి దెప్పిఱియె నంత వసుధాధీశా. 182

వ. తెప్పఱి లేచి చూచి సేద దేఱి యమ్మద్రపతిం బేరుకొని యుద్దండగదాదండమండితం బైనకరంబునం బిలిచె నయ్యుద్ధతి సహింపఁ జాలక సింహనాదంబుతోడఁ

1. జ. ప్రదరవిభంగు లై. 2. క. దాఁక నప్పుడుం గరి. 3. గ. సమయంబున. 4. గ. ట్టినయెడఁ దగరులు పడిఁ దాఁ 5. సంధు లాడఁగ.

దూర్యస్వనంబులు సెలంగఁ గురుభూవరుముందరి సైనికులు రభసంబుగా నతఁ డునుఁ గూడికొని తఱుమఁ గవిసినఁ గౌంతేయాగ్రజునగ్రభాగంబున రథికులు చేకితానపురస్సరులై యార్పులు నింగి ముట్ట నయ్యనిలతనయుఁ దలకడచి వారిం దలఁపడి పెనంగి రప్పుడు. 183

శా. ఆ కౌరవ్యవిభుండు వజ్రకఠినంబై యొప్పుప్రాసంబు దీ
ప్తాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బనం గ్రాలఁ గే
ళీకల్పంబుగ మింట జంటమెఱుఁగుల్ నిండం బ్రదీప్తక్రమ
శ్రీకాంతుం డగుచేకితానుఁ బడ వైచెం జావ నగ్గింపఁగన్. 184

వ. ఇట్లు చేకితానుండు వీతాసుం డైనం గని కౌంతేయులు కోపాటోపంబున సైన్యోపేతులై కడంగి కౌరవసైన్యంబుపైఁ బటుబాణంబులు గురియుచు నడరిన శల్యుండు ధర్మపుత్త్రుని దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతి పనుప నశ్వత్థామ త్రిగర్తులు మూఁడువేలరథంబులవారు వివ్వచ్ఛుని మహోత్సాహంబున మార్కొనిరి తక్కటియోధులు సేనయు నవ్వీరోధివరూథినిఁ గలయఁ జెరయుటయు నక్కజం బయ్యె నప్పుడు పెంధూళి యెగసి చూడ్కులు నిగుడ కున్నను సైనికులు సింహనాదంబులు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకంబుగాఁ బోరిన బోరనఁ దొరఁగుశోణితంబు రేణువు నడంచినఁ బ్రియం బంది యిరువాగును వ్రేయుండు పొదువుఁ దను నెలుంగులు నింగి ముట్టఁ జెనంగు నట్టియెడ.

చ. బరవస మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నానృపాలుఁడు నకుంఠితుఁ డై పదునాల్గుతూపుల
న్నరపతిమేన గ్రుచ్చి యొలయనవ్వున నొప్పిన నమ్మహీశుపే
రురమున నాటె సారథికిఁ దోఁకసముజ్జ్వలబాణ మొత్తెలన్. 186

వ. నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుం డను తదీయచక్రరక్షకుం దునిమి నవనారాచంబులు సారథిమేన నిగిడించె. 187

ఆ. అపుడు శినివరుండు ననిలపుత్త్రుఁడుఁ జేది,బలము శల్యుఁ దీవ్రభంగిఁ బొదువ
నాతఁ డాధనంజయాగ్రణిఁ బటుతర,పంచమార్గణముల నొంచె నధిప. 188

క. విను మిరువదియేడమ్ముల, శినిమనుమనియు బ్బడంచెఁ జేదిరథికులం
దునిమెం దీవ్రశరోత్కర,మున నిరువదియేవురన్ సముద్భటభంగిన్. 189

క. కవలు దనమీఁద రయమునఁ, గవిసిన నిశితతరసాయకములను మూర్ఛా
రవము సెలంగఁగ వారల,యవయవముల నించె నతఁ డహంకృతి మెఱయన్.

చ. కనుఁగొని ధర్మసూతి భుజగర్వ మెలర్పఁగఁ బెట్టు గిట్టి శ
ల్యుని మెయిఁ దీవ్రమార్గణసముత్కరముం బరఁగించి కేతువుం
దునిమిన నాతఁ డావలిఁ దూఁపులవేఁడిమి సూపి వాయునూ
నునిఁ గవలన్ శినిప్రవరు నొంచె వడిం బదియేసి యమ్ములన్. 191

ఉ. నొంచి మదించి ఖేచరమనోహరుఁ డై వడి ధర్మపుత్త్రు సు
క్కించి మహోగ్రబాణపరికీలితదేహునిఁ జేసి దానఁ గో
పించి శితాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం గడంగ గు
ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడితదేహులఁ జేసి వారలన్. 192

వ. చేసి యయ్యుండొక భాసితధ్వజం బెత్తించి యొఱసిన. 193

సీ. భీముఁ డాతని మెయిఁ బెడిదంపునారసం, బడరించి వాఁడియు నట్టి వేసు
వఱపె సాత్యకి శరబాణంబు లతనిపై, బెట్టెసె మాద్రితొల్పట్టి యైదు
తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు, గమ్ములు సవ్యేరుసంగరములఁ
బరఁగించి రమ్మద్రపతి భీమసేనాద్యు, లైనయన్నలువుర నతిరయమున

తే. వరుస డెబ్బదిమూఁటను నిరువదేను, వాఁడితూఁపుల నేనింట మూఁడుమార్గ
ణములఁ బీడితులుగఁ జేసి నలిఁ గె భల్ల,నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య.

శా. ఆ మాద్రీసుతుఁ డన్యచాపధరుఁ డై యత్యుగ్రబాణంబులన్
(మామా యెక్కడఁ బోయె దంచు వెన నమ్మద్రేశు నేయంగ) ను
ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ
స్తోమంబుల్ గురియంగ ధర్మసుతుఁడుం దూఁపుల్ మొయిన్ గ్రువ్వఁగన్. 195

చ. కలయఁగ నెత్తురుల్ దొరఁగ గైరికనిర్ఝరజాలరంజితా
చలమును బోలి పాల్పడఁగ శల్యుఁడు వారల నస్త్రపంచకం
బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర ధర్మజుచాప మమ్మతో
బలమును శౌర్యమున్ సురలు ప్రస్తుతి సేయ మహోగ్రమూర్తియై. 196

ఉ. వేఱొకచాప మెత్తి పృథివీవర ధర్మతనూజుఁ డింతతోఁ
దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబుగ నంచు నూతుమైఁ
దూఱఁ దఱంగమాంగములు దూఁటులు వోవఁగ శల్యు నెమ్ములన్
గీఱ సిడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్. 197

వ. ఇవ్విధంబున విజృంభించిన. 198

క. కోపించి యతఁడు దర్పాటోప ముదగ్రముగ దళపటుప్రదరము లా
భూపాలు మేనఁ జొనిపిన, భూపాలక యాతఁ డొల్లఁబోవుటయు వెసన్. 199

—✤ ధర్మరాజు శల్యునిబాణంబులచేత మూర్ఛితుం డగుట. ✤—

క. కై నేయఁ దడరి యుజ్జ్వల,నానావిశిఖముల మద్రనరపతిఁ బొదువం
దా నలిగి విల్లు దునియలు, గా నొకభల్లమున నేసె గర్వోద్ధతుఁ డై. 200

క. ఆ రథికవరుని నకులుని, మారుతి సహదేవు మూఁడుమార్గణముల నే
పారఁగ బలుపారఁగ రయ, మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁ డధిపా. 201

వ. అంతం దెలిసి యక్కౌంతేయాగ్రజుండు మద్రపతి ముద్గరంబున నేయ నవ్విరో
ధిపై సాత్యకి తోమరంబును వృకోదరుండు భల్లంబును నకులుండు శక్తియు సహ

దేవుండు గదయును బ్రయోగించిన నయ్యోధవరుండు వాని నన్నింటిని మింట
మెఱుంగు లడరువాఁడిదయమ్ములు పఱంగించి త్రుంచి యార్చినం జేర్చినరోషంబున
నాకృష్ణానుజుండు సారథి మూఁడువాఁడితూఁపుల నవ్విరోధి రెండుబాణంబుల వి
ట్రేసినఁ గ్రోధదీప్తుం డై ప్రచండకాండంబుల నయ్యేవురను స్రుక్కించిన నీపుత్త్రుం
డతనిచేతఁ బాండుపుత్త్రులు వొలియుదు రని తలంచె నట్లు ధానమానుం డైన
సేనాపతిం గని భీమసేనుండు సహింపక తెంపున బెట్టు గిట్టిన. 202

క. శినిమనుమఁడుఁ గవలును ద్రో,డన యురవడి నడరి పొదువ్రటయు నగ్గలికం
జెనఁగి నరేం ద్రానలువుర,కనలుఁ గడంకయును నరకుగాఁ గొన కధిపా. 203

వ. ఇట్లు పెనంగు చుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చినచంద్రసేను
తోడివాని ద్రుమసేనుఁ దల ద్రెవ్వ నేసినఁ జక్రరక్షకహీనుం డయ్యును బోలి
పోనికనలున శల్యుండు నటలు వెఱికినం గోపించుసింగంబుచందం బై సమీరణ
సుతాదు లగుజోదులనలువురయుంగంబులఁ దురంగనికరశరీరసారథినికాయసహి
తంబుగా బహువిధవిశిఖంబులు పఱంగించి నెత్తురులు దొరఁగించినం గని యా
ధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున. 204

క. హరివచనంబు లసత్యతఁ, బొరయఁగ నేర్చునొకొ మద్రభూపతిబాహా
స్ఫురణము భీమాదిరథిక,వరు లోర్వనియట్లు గాఁగ వ్రాలెడిఁ దోడ్తోన. 205

వ. అని తలపోసి తనబలంబునకుఁ జేయి వీచినఁ దోయధివీచివిలాసవిలాసంబుచందం
బునఁ జతురంగంబులు శల్యుపైఁ గవిసిన నాధైర్యధౌరేయుండు మందరనగంబు
లీలఁ గైకొని వారలం గలంచి పాంచాలపుత్త్రప్రభృతియోధప్రకరంబులను బాండ
వాగ్రజునిం బరమసాంద్రతీవ్రశరాంధకారంబునఁ గప్పి సింహనాదంబు సేసిన. 206

క. దివిజగరుడఖచరాదులు, వివిధవచనరచన లెనఁగ వినుతించిరి శా
త్రవభీకరుఁ దగునమ్మ,ద్రవిభునిరణవిహరణములు ధరణీనాథా. 207

వ. ఆ సమయంబున. 208

తే. గురుసుతుండు పెనుఁబ్రాపుగా నరునిఁ బొదివి, యధిప సంశప్తకులు విక్రమాప్తతతులఁ
గప్పి రతఁ డందఱను జండకాండవిదళి,తాంగులుగఁ జేసె దోర్లీల నతిశయిల్ల

చ. తెరలక వారు పై పయి సుదీర్ణసముద్ధతి గ్రమ్మి వాజుల
హరిని సిడంబుపైఁ గదియ నాతఁడు సేద్పడ బాణవర్షముం
గురిసిరి కౌరవేంద్రుమొనకుం బ్రమదం బగుఘోరభంగి న
ప్పురుషవరాక్రమస్ఫురణ పార్థివసత్తమ కాన మెయ్యెడన్.

వ. ఇట్లు సవ్యసాచికిఁ జే యార్పరాకుండ దర్పంబుసూపిన నాభూవరకుమారవర్యుండు
వీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్రక్షురికాముఖ నారాచప్రముఖ
విశిఖ పరంపరలు పఱంగింపనవి యాసైనికులరథ్యంబులుగూల్చియుఁ గేతనంబులు

ద్రుంచియు బాణంబులు నఱకియు బాణాసనంబులు విఱిచియు సూతుల గీటడం చియు నరదంబులఁ జెక్కుఁయు హయంబులు పొల్లు సేసియుఁ జామరంబులు దునిమియు నాతపత్రంబులు రూపుమాపియు నెత్తురు లురలించియుఁ గండలు దొరఁగించియు నెమ్ములు వగిలించియుఁ గాళ్లు ద్రుంచియుఁ జేతులు దునిమియు వ్రయ్యలుగా వక్షంబులు సీఱియు మర్మంబులఁ జొచ్చియు మకుటంబులు డుల్చియుఁ దలలు రాల్చియుఁ బ్రాణంబులు పీల్చియు రౌద్రం బావహించినలయకాలరుద్రుని సంక్రీడనంబుచందంబు దోఁచె నప్పుడు రథికవరసహస్రద్వితయంబు దెగటారె నవ్వాఁడిమగండు పేరడవి (దహించుదావపావకునిచందంబున) వెలింగెఁ దదీయ తేజోమహిమ సహింపక యుద్దామగతి నశ్వత్థామ గదిసి యక్కవ్వడిం దొడరి దురం బొనర్చె నందు. 211

సీ. అతఁడు పండ్రెండువాఁడిలమ్ము లాబీభత్సు,మెయి గ్రుచ్చి కృష్ణునిన్ మేనియందుఁ
పదివాఁడితూఁపులున్ పఱపిన మదిలోన, నగ్గించి యవ్వీరున్ దలఁచినగవు
తోడ రథ్యముల సూతునిఁ గూల్చి యాతని,తనువున నెఱతెగన్ గొనక నాఱు
మూఁడుమార్గణములున్ ముసలంబు పరిఘంబు, నాతఁడు నిగిడింపన్ నదియునదియు

తే. నన్నరుఁడు దోడుతోడ నైన్ దాఱునిశిత
కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు
సొనిపె నవ్విప్రుమేన మూర్కొనియె నపుడు
గడఁగి యప్పార్థు సంశప్తకవ్రజంబు 212

వ. అట్టియెడ. 213

సురథుఁ డనుపాంచాలకుమారుం డశ్వత్థామచేఁ జచ్చుట.

క. సురథుఁడు గురుసుతుపైఁ దన,యరదము వఱపించి యేయ నప్పాంచాలో
త్తరు నొకనారసమునకును, నర సేసె నతండు గినుకన్ యొనరం జెనఁగన్. 214

వ. ఇత్తెఱంగున. 215

ఆ. సురథుఁ గూల్చి యతనియరదంబుపైకి న,ద్ధురత నరిగి గురుసుతుండు చండ
కాండసమితి నిగుడన్ గాండివిఁ దాఁకె సం,శప్తకులకు సంతసం బొనర్చి. 216

వ. అయ్యవసరంబున. 217

క. కురుపతి ధృష్టద్యుమ్నుని,యురవడి గద నిలువరించి యుద్ధతి మెఱయన్
శరపంచకమున నొంచెను, బరఁగించెను మఱియు నవతిబాణము లొడలన్. 218

తే. అతఁడు డెబ్బదియమ్ములన్ నతని నొంప, నన్నరేంద్రుండుఁ జేవ్వడన్ ననుజసమితి
బలయుతంబుగ నడరి యవ్వలియమీఁదఁ,గురిసిరస్త్రశస్త్రంబులున్ నరవరేణ్య.

క. ఆ పాంచాలోత్తముఁ డుద్దీపితకోపుఁ డయి వారిన్ దీవ్రతరశరా
టోపంబునఁ గలఁచె రయం, బేపారఁగ నాత్మసేనన్ కేడ్తెఱ డ్గుఱియున్. 220

చ. కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి శిఖండి ప్రభద్రకుల్ మహో
గ్రపువడి దోష్పటంగ భుజగర్వము సూపిన నాబలాఢ్యులుం
గుపితమనస్కులై బలువుగ్రోల్లలఁ బేర్చినలావు చేవక
య్యపువెర వేవు దాల్మి సరి నచ్చెరుపాటున ముంచెఁ జూపఱన్. 221

వ. అప్పుడు శల్యుండు యుధిష్ఠిర భీమసేన నకుల సహదేవసాత్యకిప్రముఖులపైఁ బటు
బాణంబులు గుప్పించి నొప్పించిన. 222

క. నకులుఁడు రథసంబున సాయకదశక మతనియురంబునంకుఁ జొనుపన
భ్రుకుటి యగుచు నయ్యుల్లునిఁ, ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా.

క. తక్కటినలువురు నొదివిన, నొక్కొకనిశరీరమున మహోగ్రాస్త్రంబుల్
పెక్కులు వెనఁ బఱపి మదం, బెక్క నకులుధనువు దునిమె నిషుసహితముగన్.

వ. ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి. 225

మ. నకులుం డొండొకచాప మెత్తి పటుబాణశ్రేణిఁ బర్వింపఁ గీ
చకవిధ్వంసి నిగిడ్చె షష్టిశరముల్ శైనేయుఁ డుద్దీప్తసా
యకముల్ దొమ్మిది యేయ ధర్మసుతుఁ డేకైదమ్ములమ్మద్రనా
యకుపై నన్నియుఁ బన్నతిమ్ముఁడును దోర్దండై నాట నాటం గడున్. 226

తే. అతఁడు వెస నవనప్తత్రిశిలీముఖముల సాత్యకి నొంచి మార్గణముతోడ,
ధనువు ద్రుంచి రథ్యమ్ముల ధరణిఁ గూల్చి, పదిపదుల్ బలుఁదూపులు పఱపె మేన.

క. ఇవ్విధమున శిసివిరుసం గ్రొవ్వు చెఱిచి పాండుపుత్త్రకులబాణంబుల్
నివ్వటిల నీక నలువుర, నవ్వీరుఁడు నొవ్వ నేసె నద్భుతభంగిన్. 228

ఉ. పాండవు లట్లు మద్రపతిబాణములం దరలంగఁ జూచి తా
నొండొక తేరికం జని సముద్ధతి సాత్యకి దాఁకె నాతనిం
జండతరప్రచారణవిశారదుఁ డై వెస వారు గూడి యు
ద్దండత నూపి రక్కజపుదర్ప మెలర్పఁ బెనంగె నాతఁడున్. 229

ఉ. ఏవురతోడ నట్లొకఁడ యేచి పెనంగుటఁ గౌరవేంద్రయో
ధావళి చూచి కూడకొని యారథకోత్తముగాఢవిక్రమ
శ్రీ విలసిల్ల నంపపెనుఁజీకటి యూతన మొల్లఁ గప్పఁ గాఁ
జేవయు లావుఁ జూపుటయుఁ జేద్పడి రాప్రతివిరు లంపఱన్. 230

వ. సేనయు నొక్కుమ్మడి నద్దిక్కు దఱిమినం గని కృష్టాస్త్రనులు నిజసైన్యంబు సమ
స్తంబు నేకముఖంబు సేసి మార్కొని రానముసంబునఁ గిరీటి కృపకృతవర్మ
లను సహదేవుండు సౌబలుని ద్రౌపదేయులు గొండఱు రాజులను శిఖండి యశ్వ

1. జ. పెంపం బై తఱిమినం

త్థామను భీమసేనుండు సుయోధనునిం దాఁకెఁ బాండవాగ్రజుండు దనకు సకులుండు బాసట గా శల్యు నిలువరించెఁ దక్కునుం గలయోధులుం దక్కటిసైనికులుం దలఁపడి క్రమంబున నెల్లబలంబును గలయఁగఁ బెరసె నిట్లు నూల్కొని యంతంతకు రణంబు సమ్మర్దదారుణం బయ్యె నత్తఱి నమ్మద్రపతి రౌద్రంబు రూపు దాల్చిన తెఱంగునం బొంగి పాంచాలయాదవాదిరథికవరులకును బాండుకుమారులకును వారింప, గొలఁది గాక రథచిత్రగతులు మెఱయ నెక్కడఁ జూచినం దాన యై నానావిధవిశిఖవితానంబుల నంబరభాగంబు సంపిహితంబు సేసిన మధ్యందినగతం బయ్యును మార్తాండబింబంబు దోఁపకయుండె నట్టియెడ.

సీ. కరులఁ ద్రుంచెడువేళ గిరులఁ దున్మాడునం
    క్రందను కైవడి గానవచ్చు
నరదముల్ దెరలించునప్పుడు పఱమొగుల్
    విరియించుబలుగాడ్పువిధము మెఱయు
హయములఁ జెండాడ నరుగుచోట్లను శేష
    గమిఁ గిట్టుకొల్పులికరణి యొలయు
భటులకు నరుగుచోఁ బన లేని పెనుఁగాన
    దరికొనుచిచ్చుచందంబు గలుగుఁ

తే. గసి మసంగినయంతకుకరణి యంత్య
కాలరుద్రునిదర్ప మగ్రాంశమృత్యు
ముఖము నుగ్రభావము దోఁచుకొనఁగ వీర
సమితిఁ దెగటార్చునప్పు డాశల్యునందు. 232

వ. ఇట్లు విజృంభించి యత్యద్భుతవిక్రమంబున నుల్లసిల్లునమ్మద్రమహీపతి నుభయసైన్యంబులజనంబులు ప్రశంసించి రంతకంతకు నగ్గలం బగునగ్గలికఁ బెనంగి యతండు భల్లాదికాండవర్షధరలు పటురయంబునఁ బరఁగించువరమాభీలభంగికి నోహటించి ధర్మజుమోహరంబు దెరలి మరలి పఱవం దొడంగిన నన్నరవరుం డదల్చి కరతలం బెత్తి నిలు నిలు మని నివారింప నిలువరయ్యె నయ్యుధిష్ఠిరుండు పౌరుషంబు పెంపునఁ దెంపు సేసి మామా యని పేరెలుం గెత్తి యాశల్యునిఁ దాఁకి దర్పంబు సూపినం జూచి మగుడ నిగిడి సేన పోరికిఁ బురికొనియె నప్పుడు పాండవాగ్రజుండు దమ్ములను దొరలను దనపాలికిఁ బిలువం బంచి వారలతో నిట్లనియె, 233

అమరనదీసుతాదు లగునక్కడివీరుల మీఱ లందఱుం
గ్రమమునఁ బిల్కుమార్చి భుజగర్వము సూపితి రేను శత్రుసై
న్యమథనకల్య శల్యుఁ దెగటార్చెద నా కిది కృత్యమిా సము
ద్యమ మనివార్య మై నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్. 234

వ. నాఁ డేరికి నకులుండును సాత్యకియుఁ బలపటను సహదేవుండును ధృష్టద్యుమ్నుం
డును డాపటను గావలి యై రావలయు వెనుకం గదిసి వివ్వచ్చుండును ముందటి
కెలన మొనసి పడముడియును నడచునది యింత యేమిటి కన వలదు నన్నొండె
నతం డతని నొండె నేను నమయించుట యవశ్యంబు[1]ను గలుగం జూచితి నిట్లు
తెంపు చేసి యమ్మద్రపతి మార్కొనునాకు దుర్గమప్రయత్నంబు కర్తవ్యంబు
కృపకృతవర్మాశ్వత్థామసాబలసుయోధను లయ్యోధముఖ్యు రక్షింపం జేయు
పరాక్రమంబునకు మీరు ప్రతివిక్రమం బాచరించుచుండ నుదీర్ణం బగుమదీయ
బాహుపాటవంబున నమ్మేటిమగని గీటడఁగించువాఁడ నని పలికిన నారథికవరు
లును దక్కనుగలవార లమ్మానవపతివ్రానికి నగ్గించి యతనిరథంబు నవిశేష
కల్పితంబు సేసి యతండు సెప్పినతెఱంగున సన్నద్ధులై సముద్ధతిం దేజరిల్లు
టయుఁ దత్సైన్యం బుత్సాహదీప్తం బై కడంగినఁ గరిఘంటారవంబులును రథ
నేమినిస్వనంబులును దురంగకింకిణీక్వాణనంబులును సుభటసింహనాదంబులును
నిస్సాణాదితూర్యనినదంబులును బెరసి యంబరంబుఁ బిక్కటిల్లఁ జేసె నివ్విధం
బున యుధిష్ఠిరుం డుద్భటుం డై యురవడించిన. 235

## శల్య ధర్మనందనుల ద్వంద్వయుద్ధము.

క. కురువిభుఁడు దనదు[2]మొనలకు, బరవస మొప్పంగ మద్రపతి యును శౌర్యో
ద్ధురుఁ డయి కడఁగ నడరి యవ్వరూథినిం దాఁకె ధరణి వడవడ వడఁకన్.

వ. అట్టియెడ. 237

క. పులులు దలఁపడినయబ్బున, బలువున ద్రోఁపంగ మద్రపతిధర్మసుతుల్
తలఁపడి యొండొరువులపై, నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్. 238

వ. వారి నాలోకించి యుభయసైన్యంబులు విజృంభించి సంరంభంబునం గలయఁ
బెరసినఁ గ్రందుకయ్యం బయ్యె నందు. 239

ఉ. నీ తనయుండు సింహకమనీయతరం బగుకేతనుల్లస
త్కేతన మర్ధచంద్రశరకృత్తిప్రహారికి మణికింకిణీనినా
దాతిశయంబులోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్
వాతిశరంబునం దునిమెఁ బారివరూథిని యే పడంగఁగన్. 240

చ. అతఁడు ప్రదీప్తకోపముఖుఁ డై పటుశక్తి నురంబు వైచినం
బతి యరదంబుపైఁ బడియెఁ బల్వగుమూర్ఛ మునింగి యప్పు డా
యతిరథు నెత్తి సూతుఁ డల యక్కురుఘస్మరుఁ డేసె డొల్ల వే
గ తొలఁగి నీడ్చెఁ దేరు దురగంబులు మూఁకఁ గలంగి సొంపఱన్. 241

క. కని యశ్వత్థామయుఁ గృపుఁ,డును గృతవర్మయును నెక్కొనుబరవసమునన్
మనసేనకుఁ దలమిగిలిన, మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మద మెలరారన్. 242

1. గ. విచారించితి. 2. జ. మెఱయుచు బరవసు మెసఁగంగ.

క. అమ్మఖమున సమరము రౌద్రమ్ము పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీ
కమ్ము బహులాస్త్రశస్త్రచయమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రము గన్.
వ. పొదివిన నయ్యుధిష్ఠిరుండు. 244
చ. అరదము చిత్రసంచరణ మక్కజమై విలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దన చేతఁ గూలఁగాఁ
బొరలఁగ మేదినిం దునియప్రోవులుగా రుధిరంపుఁగొంపి బ్రుం
గ రణవిహారముం జలిపెఁ గౌరవనాథ యనేకభంగులన్. 245
క. నరులు [1]మృదు వితఁ డనంగాఁ, బరఁగుయుధిష్ఠిరుఁడు శత్రుబలముల కఠిని
ష్ఠురుఁ [2]డయ్యె నపుడు సుర లచ్చెరు వందిరి చూచి ద్రోణుశిష్యుఁ బొగడుచున్.
క. మానము బయలైన నలిఁ జేర్చినయమ్మనుజేంద్రుమీఁద శితవిశిఖము లే
పున నిగిడించుచు శల్యుఁడు, దనరుభుజాబలముతోడఁ దఱిమెం బెలుచన్.
క. అవ్వీరునివాలంపఱ, క్రొవ్వు నడఁచి తనదునంపక్రోల లడరఁగా
నవ్వసుధాధిపుఁ [3]డల్లని, నవ్వోలయుఁగ మాఱుకొని ఘృణారహితుం డై.
వ. ఇవ్విధంబున మార్కొని ధర్మజమద్రపతులు నిజశంఖంబులు పూరించిరి భేరీ
ప్రముఖతూర్యస్వనంబులు నింగిఁ బొంగారఁ జెలంగె నయ్యిరువురు నొండొరుల
పైఁ జండకాండపరంపరలు పరఁగించి తనువుల నెత్తురు లురలించి పూచినబూరు
వుల పోలుపు దాల్చి రట్టియెడఁ గనుంగొనుజనంబులు. 249
చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ నొక్కరూప దు
స్తరభుజశక్తి ధర్మజుఁడు శల్యునిరూ పడఁగించి యివ్వసుం
ధరఁ గొను నొక్కొ నేఁ డితనిఁ దా నవయించి సమస్తమేదినీ
శ్వరుఁడు గఁ జేయ నోపు నొకొ శల్యుఁడు కౌరవరాజనందనున్. 250
వ. అని సందేహడోలాయమానమానసులై రప్పుడు. 251
తే. మద్రపతి ధర్మజునివిల్లు రౌద్ర మొనఁగఁ
ద్రుంచి మూఁడమ్ము లేసి యుద్ధురతఁ బేర్చి
నతఁడు వేఱొక్కధను వెత్తి యతనిధనువుఁ
దునిమి పెన నేసె మున్నూఱుతూఁపు లధిప. 252

విరథుఁ డయినశల్యుని నశ్వత్థామ తనరథముపై నిడికొని పోవుట.

ఉ. తోడన తేరివాహములఁ ద్రుంచి మదంబున సూతుప్రాణముల్
గ్రీడయపోలెఁ బుచ్చికొని కేతువుఁ గూల్చిన సేన విచ్చెఁ జే
యూడక యున్నశల్యుని రయంబున నాత్మరథస్థుఁ జేసి పె
న్నిడుమఁ బొంద కుండఁ దొలఁగించెను ద్రోణసుతుండు భూవరా. 253
వ. ఇట్లు శల్యుండు సమరవైకల్యంబు నొందుటయు ధర్మనందనుం డార్చి పేర్చి త

---
1. గన్మృదుండితఁ. 2. గ. చనిసురలచ్చెలువ్వుం, దిద్రోణునిశిష్యుసన్నుతించుచుమదిపొం. 3. క. డెల్లునవ్వో.

ద్బలంబుఁ దఱిమె నంతనమ్మద్రపతి యొండురథంబు గల్పించుకొని కడంగి యా కౌంతేయాగ్రజుపైఁ గంకపత్త్రంబులు నిగిడించుచు నిగిడినం గని యద్దేవుఁ డేయఁ గలసైనికోత్తములు సరభసంబున నయ్యోధవరు నెదుర్కొని రప్పుడతండు సాత్యకిఁ బదిసాయకంబులను భీమసేననకులసహదేవుల శరత్రయంబులను స్రుక్కించి యొక్కడుమదంబునం బొదలినయంగంబులతో నలరేఁగి మఱియు నప్పుడు పొగడం దగి యుండె నాకర్ణింపుము. 254

సీ. కమలాకరములీలఁ ‡ గలఁచి యాడెడుగంధ,దంతావళమున నుద్దండతయును
దరమిండి మృగసముత్కరము ఘోరంబు గా, వధియించుకంఠీరవంబునేపు
నీరసారణ్యంబు ‡ నిర్భరాటోపతఁ, గాల్చుదావాగ్నియుగ్రక్రమంబు
ప్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ,యించుఫాలాక్షునిర్దయోద్రేకమును

ఆ. [1]కొల్పఁ బట్టు లయ్యె ‡ భుజగర్వశౌర్యప్ర,తాపదుర్దమప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుసమునఁగి శాత్రవసైన్య,హననకేళి సలుపునవసరమున. 255

వ. ధర్మనందనుం దల మిగిలిన చతురంగంబుల నవ్విధంబున వినిహతంబులు సేసి యమ్మహీపతిపైఁ గవిసినం గని కవలును శైనేయుండును భీమసేనుండును దోడ నడువ నతం డమ్మేటిమగని మూర్కొని పటుమార్గణంబు లురంబున నించి నొంచె నప్పుడు కురువిభుండు పనుప మన సైనికులు దలమిగిలి శల్యునికిఁ బ్రాపయి యప్పవనతనయప్రభృతులతోడఁ బెనంగి రతం డాపాండవాగ్రజు మేనఁ జూడ కాండసప్తకంబు నినిచిన నజ్జననాథుండు నవనిశితనారాచంబు లవ్వీరునంగంబుల నాటించె నిట్లు దలఁపడి కొలువులులపోలికఁ బేరేనుంగులతెఱంగున బలుసింగంబులచందంబునం బోరి రొండొరుల నొప్పించి రప్పుడు. 256

సీ. శల్యుండు బలునారసము పాండవాగ్రజు, నురమున నాట నయ్యుగ్రదీప్త
ఘోరనారాచ మాక్షుంతీసుతుం డేయ, నతఁడు మూర్ఛిల్లిన ‡ నలరె [2]నధిపుఁ
డమ్మద్రపతి తేఱి ‡ యుబుకఁ గింపారనుఃకనుఁగవతోఁ బాపకాండ మొకట
నయ్యధిష్ఠిరు నొంప ‡ నాతండు పరఁడిమ్మై,మునుఱు వాఱుకూఁపుల ‡ నఱికి వైచి

తే. వాలురమ్ములు దొమ్మిది ‡ వక్షమున ని
గుడ్ప నయ్యోధవరుఁ డతిక్రూరభల్ల
యుగళఖండితచాపుఁ జేసెముఃకుడు నొంచు
ధనువుఁ గొని యవ్విభుండు దర్పత్తనువు సించె. 257

క. బానబుమై భీముఁడు వెల్లేసిన మద్రపతి నాకఁ ‡ డియుపురతోడఁ
జేసెం గొయ్యము గృపుడు, శ్వాశితవిక్రమ మున కొమ్మహాయి గలుఁగక. 258

వ. అట్టియెడఁ గంకటాంతరంబు ధరియించి కడంగి. 259

ఆ. మద్రవిభుఁడు ధర్మసమాజసుతులపై,ముఱువు లుఱక నఱికి ‡ మార్గణములు

---

1. గ. బొల్పఁ బట్టు గాఁగ. 2. చ. నధిప యమ్మద్ర.

దొబ్బిదింట రెంటఁ దూఁటులు సేసి దోర్దండములు ప్రదీప్తవర్పుఁడగుచు.
క. అలో ధర్మజుసారథిఁ, గూలఁగఁ గృపుఁ డేయ మద్రకుంజరుఁడు భుజా
లీల మెఱయంగ హయము, ల్నాలుగు నొక వ్రేల్మిడిని నిలం బడ వైచెన్. 261
వ. ఇవ్విధంబున విరథుం డై యమ్మహీకాంతుం డంతర్గతంబున. 262
క. గెలుపును శల్యుని నీ వని, పలికె ముకుందుండు నన్నుఁ బనిచినవాఁ డ
ప్పలుకులకు ననత్యత్వము, గలుగఁగ నేర్చునొకొ దైవఘటనబలమునన్. 263
వ. అని శంకించియుఁ గొంకువోవక యజ్జగన్నాథువచనంబునకు నన్యథాత్వం బేల గలుగు నని యద్దేవునిం దలంచి యామాట యమోఘంబు గావలయు నని ప్రార్థించి వెండియు. 264
చ. స్ఫురితమదర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణున్ గుణా
దరసముపాత్తమూర్తిఁ గలితప్రభవస్థితిసంహృతిక్రియా
నిరతి[1]వివర్తితత్రిభువనీమహనీయుని దైత్యమర్దన
ప్పురుషవరుం జతుర్భుజు నిశుత్వమహోన్నతు నాశ్రయించెదన్. 265
తే. ఖండనము సేయునరునగ్రభాగమునఁ బ్ర,చండశూలాగ్రహస్తుఁడై శతక్రతుకోటి
గీటడంచుచు నేఁ జూడఁ గెలి సలుపు, దేవు జయసిద్ధికై నన్ను దలఁతుభక్తి 266
వ. అనుచుఁ బురుషోత్తముని జిత్తమున నిలిపియున్నతం బైన పూర్వకాయంబుతో మందప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతి దెస నిగిడింప నలఁ డది వెంకువడుట గాఁ దలంచి తత్తిమి యతిముత్తి శరంబులు గురియుటయు నప్పుడు. 267
చ. పవనసుతుండు విల్ నతికి బాణయుగంబున మేను నొంచి శా
త్రవులు దలంక నారథికుశరథ్యములన్ ధరఁ గూల్చి సూతుకం
ఠవిదళనం బొనర్చి ప్రకటస్ఫురణంబునఁ గంకటంబు భ
ల్లవిరతి ఘోరసంహతి నిలం బడ సేసి రయం బెలర్పఁగన్. 268
వ. ఇవ్విధంబున. 269
క. విరథుండు నచాపుఁడు వర్మరహితగాత్రుండు నైనమద్రవిభుఁడు భా
సురఖడ్గచర్మశోభిత,కరుఁడై తేరు డిగి కన్నుఁగవఁ గెంపారన్. 270
మ. జముచందంబున నేచి ధర్మసుతుపై సంరంభదుర్దాంతద
ర్పమునన్ వేకవియంగఁ జండబలసౌర్యాయుండు భీముండు ద్రుం
చె మదం బారఁగ వాలునుం బలకయున్ శీఘ్రత్వసందీప్తుఁ డై
తమది క్కార్పులఁ దూర్యనాదములు నత్యంతంబు శోభిల్లఁగన్. 271
వ. అమ్మద్రపతి నేర్పును జేవయుం గలపరిజనంబులు చేర్పఁ గంకటగదావంశంబులు ధరియించి యుధిష్ఠిరుమీఁద సురపతి నపరి నవ్వ దవ్వాంశవాగ్జునకు బొనట యై సాత్యకిధృష్టద్యుమ్న శిఖండిద్రౌపదేయ మాద్రేయు లేయు

1. అ. వివర్తితత్రిభువని.

సాయకంబులు సరకుఁగొనక గదం జిత్రంబుగా బటియుచు వడముడివిక్రమంబున
దవులంబడక నిగిడి నశ్వసూతరహితం బగురథంబుపై నున్న యన్నరేంద్రుండు
తనదెసకు సింహచంక్రమణత్వసుందరుం డై వచ్చునవ్వీరు నాలోకించి సక్రోధం
బైనయవష్టంభంబున నుద్దీపితుం డై. 272

క. ఇతని నమయింప నయ్యుచ్యుతుఁడు ననుం బనిచె నాకు నొనరించినపా
లితుఁ డని తలంచి మొగ ముగ్రత నొందఁగ శక్తి యొదఁ బ్రగముఁ దోయులయన్.

వ. హృషీకేశు నుద్దేశించి. 274

ఉ. నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడుభక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె భక్తజనాభిమతప్రదానవి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు వ్రత ముల్లము నాపయి నిల్పు మిత్తఱిన్. 275

వ. అని హృదయంబునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు. 276

ఉ. అచ్చపుభక్తికిం మతిఁ బ్రియంబున నొందినఫాలలోచనుం
డిచ్చినఁ బ్రీతియోగమును నెక్కుడుభక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్ఠముఖుం బరిశోభితార్చనం
బిచ్చుచుఁ దాను గొల్చు నతి కెక్కినయుమ్మహనీయశక్తికిన్, 277

మ. ప్రణతుం డై రథసోదయాభినవదర్పస్ఫూర్తి శోభిల్లు న
[1]న్మణిదండద్యుతిమంజరీస్ఫురణము న్సంశోభితుం డావటు
క్వణనంబుం రిపుసైనికప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ
షణరేఖం [2]బటుదాసిఁ బుచ్చికొని చంద్రచక్షుష్టిదృష్ట్యుద్గతిన్. 278

వ. అభిరామభీమాకారుం డై. 279

తే. నెరయుఁ గినుకఁ బెన్పొడఁద యై నిప్పు లురలు
కన్నుఁగవ శల్యుఁ జూచిన నున్నయునికి
వలఁదు నీటు గాఁ గుంపట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ. 280

వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రయదాహదోహలి యగుశూలాయుధులీల దోఁప
దుర్నిరీక్ష్యుం డై. 281

ఉ. ఘోరతరప్రకార మగుశ్రకుంచితబాహువిలాస మొప్ప వి
స్తారము వింత యాసురము సారతరంబు గఁ జూచి వజ్రధా
రారుచిసన్నిభప్రచురరశ్మిలు పర్వఁగ బిట్టు వైచె న
ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్తసమిత్కృతికల్యు శల్యునిన్. 282

తే. అట్లు పాండుభూపాలకునగ్రసుతుఁడు, మద్రనాథునిపై వైచిన రౌద్రమునఁగ

1. క. ఫణిరత్నద్యుతిమంజరీస్ఫురణముల్. 2. క. గ; బహుపోఁడిం.

గంకటముమాఱి వక్షంబు గడచి వెన్ను, వెడలిచనియెమ్మద్రేశు శక్తి పుడమిఁ జొచ్చె.

—•• ధర్మరాజు శక్తి ప్రయోగించి శల్యుని జంపుట. ••—

వ. ఇట్లు శక్తి వెడిదంపుటురవడి నుచ్చిపోయిన. 284

చ. క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల నొల్కెడు రక్త మంగమా
ప్లుతము గఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెన్ ధరం గర
ద్వితయము సాఁచి ధర్మజునిదిక్కు శిరంబుగ వజ్రదారుణా
హతిఁ బహుభూరిభూధరమహోత్తరశృంగము భంగి భూవరా. 285

ఆ. భూమిమీఁద నిట్లు బోరగిలం బడి, మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
శేమయురమునందు లీలమై వ్రాలిన, ప్రాణనాథుఁ [1]బోల్పఁ బట్టు గాఁగ. 286

ఆ. ధర్మసంగరమున ధర్మజుచేఁ జచ్చి, పోలెఁ జూడ మద్రభూవిభుండు
విధియుతంబు గాఁగ వేలిచి విడిచిన, నాఁటి యున్నయగ్ని ననుకరించి. 287

మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ
కిన నాభూపతి చిత్రచాపధరుఁడై కేళీసమప్రక్రియన్
ధనువుం గేతువుఁ ద్రుంచి తోడన సముద్యద్దీప్తభల్లాహతిం
దునిమెం గుండలకాంతమైనశిరమున్ దుర్దాంతదర్పంబునన్. 288

వ. ఇట్లు శల్యుండు సోదరసహితంబు గా బడినఁ బాండవసైన్యంబుజనంబులు వృత్రవధం బొనరించుపాకశాసనుఁ బ్రశంసించుబృందారకులట్ల ధర్మనందను నగ్గించి రమ్మొగ్గరంబునం దూర్యనినదంబులు సింహనాదంబులుఁ జెలంగఁ గలంగి కురుసేన విఱిగి పఱచినం బోనీక పొదువుం డనుచు సాత్యకి వెనుకొనుటయుఁ గనుంగొని కృతవర్మయు మాఱొడ్డనియె నయ్యాదవసింహులరణంబు దారుణం బయ్యె నందు. 289

సీ. కృతవర్మ సాత్యకి నతిశితశరదళకమున నొంచి తురంగముముల[2]యుబ్బు
నుడిపి విల్లును ముట్టుటు నొంచువింట నబ్బలియుఁ డాతని మేనఁ బదిమెఱుంగు
టమ్ములు వఱపి రథ్యమ్ముల నరదంబు, సూతుని నఱికినఁ జూచి కృపుఁడు
దనతేరిపై బెట్టుకొని తొలఁగించె నవ్వీరుపోరికి మూఁక వెఱచి పఱచెఁ

తే. గడఁగి వెనుకొన్నపాండవోత్కరమునొకఁడ, నిలువరించె[3]నుద్దండుఁడై సినిసూనుఁ
డంత వేఱొక్కతేరెక్కి యురుగుడెంది, తాఁక హార్దిక్యుఁ డరిసేన తల్లడిల్ల.

వ. ఇట్లెదిర్చినఁ బేర్చినయలుకం బాండవాగ్రజుండు కృతవర్మనిఘోటకంబులను గీటడంగించినఁ గురునందనుం డాహార్దికనందనుని నిజస్యందనంబున నిడుకొని యవ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ముతెమ్ములం గీలింప నతండు పదాతితూఁపుల నాభూపాలునిఁ దదీయతురంగంబుల నేసె నాసమయంబున. 291

1. క. దలఁప. 2. గ. యుబ్బచిదిని వెసఁ ద్రుంచుట యు. 3. అ. సమద్ధతి.

తే. భద్రకరి నెక్కి చామరచ్ఛత్రకరవీజ
నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి
యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ
జాలి చనె నంతయు భవదీయపుత్త్రుఁ డధిప. 292

—•• శల్యుఁడుట్టంబు లొక్కపెట్ట ధర్మరాజుం జుట్టుముట్టుట. ••—

ఉ. అమ్మనుజేంద్రుముందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుఁ జు
ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు లు
గ్రమ్ముగ వీఁకఁ జేరులు పొగడ్తకు నెక్కఁగ దీప్తమైనకో
పమ్మున నేఁచి పాండవులపై నడరం గని పేరెలుంగునన్. 293

వ. అన్నరనాథుండు. 294

తే. మీర[1] లెవ్వరు వడిఁ దలపడి మిగిలి చనఁగ, వలదు నాప్రాలబలుపారి నిలువుఁడని యె
వారు నిలువక పాండవబలము చేవ, దఱుఁగఁ జొచ్చి యుధిష్ఠిరుఁ దాఁకి రధిప.

వ. ఇట్లు చలంబున నవ్విభుండు దలఁపడి వివిధాస్త్రంబుల నొప్పించినఁ గవ్వడియును వడముడియుఁ గవలును ద్రౌపదీకొడుకు లేవురును గోవిందుతమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున నుద్దండచతురంగసమేతు లై యారథికులఁ బొదువుటయును వారు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్నదమకరప్రకరంబులవిధంబున విహరించి రట్లు పాండవసేనాక్షోభసంపాదు లగునాజోదులయాటోపంబు విలోకించి గాంధారపతి గాంధారేయు నాలోకించి. 296

తే. మద్రవిభు వారి నమ్మెయిఁ సమార్తు రాఁగి, కొనఁగ మనకును పేడింపఁ జనునె యనుడు
నతఁడు నామాట వినక వా రరిగి రేమి, సేయువారము చెప్పు మౌచిత్య మనియె.

వ. అని నన్ను నాపరివారంబును రక్షింపను దగ వెలింగింపను నర్హుండ వీవ కావె యనుమాట లాడిన నతండు ప్రీతుండై బలపరిపాలనంబును గర్జంబు సెప్పుటయును దనపనిగా మనంబునం బూని యవి దోఁచునట్టి యుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం బాపాదించి. 298

చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమలీల నరాతిసేన సా
చ్చినఁ బతి గావ కున్న నుపజీవులు మెత్తురె యన్నఁ గాతఁ గా
కని బహుతూర్యనాదములు నార్పులునుం జెలఁగంగఁ ద్రోచి య
జ్జనపతి వీఁకమై నడరె సైన్యయుతంబుగ సత్వరంబుగన్. 299

క. అంత ధనంజయకిమ్మీరాంతకముఖయోధవరమహాస్త్రప్రకరం
బంతకు గడ కనిచెఁ బరిక్రాంతం బగు మద్రనాథురథికచయంబుల్. 300

వ. ఇవ్విధంబున. 301

1. క. లెవ్వడ వడిఁ దల_ గ. లెవ్వడ విడివడఁ

మ. అరులం గీటడగించి పాండుసుతసైన్యం బుబ్బి పైఁ గ్రమ్మినం
గురుభూనాయకసేన నొచ్చి కలయం గూలెన్ ధరన్ గొంపులై
తిరుగం బాఱఁగఁ జొచ్చు విచ్చి మరలన్ దిగ్భ్రాంతి వాటిల్ల స
త్త్వరతన్ వల్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లఁగన్. 302

క. మనవారి కవుడు భీష్ముని, చనుటయుఁ గోదండగురుని సమయుటయును గ
ర్ణుని పాలియుటయును గ్రొత్తై, మనమున [1]వెనుఁబాటు గదిరె మనుజాధీశా.

వ. అప్పు డద్దిక్కు జనంబులు. 304

చ. ధరణికి నింక నాయకుఁడు ధర్మతనూజుఁడు నేఁ డవశ్యమున్
గురుపతి గూలె నెవ్వగల గుందు రయోధను నాంబికేయుఁ డు
ద్ధురు లగుపాండునందనుల దుర్గమభంగి యెఱింగి, ధర్మత
త్పరులకు గెల్పు బ్రాఁతె హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్. 305

వ. అని రట్టొడ సేయుదురు నిజసారథిం జూచి మనబలం బాహవంబున కోహ
టించి పాఱెడు నిత్తఱి సేన బరవసంబు సేసినఁ గాని నిలువ దవ్విధంబునకు
రథం బనువై యుండఁ జేసి చేరఁ దెమ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు
డిగ్గి రథం బెక్కి యొక్కడుమగటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు
నని యెలుం గెత్తి. 306

ఉ. ఎక్కడఁ [2]బోవ వచ్చు గిరు లేనియుఁ గాననభూములైనఁ దో
నెక్కియుఁ జొచ్చియుం బగతు రేడ్తెఱఁ గిట్టి చలంబునం దలల్
ద్రొక్కక తక్కర ట్లయిన దుర్గతి వాటిలుఁ బోక నిల్చి పే
రుక్కునఁ బోరినన్ సుగతి [3]యొండెను సంపద యొండెఁ జొప్పడున్. 307

వ. అట్లుం గాక. 308

క. పాండవబల మల్పం బై, యుండం గృష్ణుఁడు ధనంజయుండును దప్పిం దాయఁ
బెండువడఁగఁ గని మనకును, గం డడఁగఁగ నేల గెలువుఁ గైకొనవచ్చున్.

వ. అని పలికి కరతలం బెత్తి నిలు నిలు మనిన నబ్బలం బతని నగ్గించుచు మరలె
నమ్మేటిమగండు మునుగలి యయి నిలిచి పొంగారం గవియు కౌంతేయసేనా
సముద్రంబునకుఁ జెలియలికట్ట యయ్యె నయ్యవసరంబునందు మునుకొని
వడిం దఱుముపడముడిం బొదివి మనపదాతిప్రకరంబు దర్పంబున నార్పులు
బొబ్బలుం జెలంగ బహువిధశస్త్రాస్త్రంబులు వఱఁగించినం బెరిఁగినమదాతిరేకం
బున గదాదండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ
గాల్చు వెనుగాలికైవడి నతం డేకవింశతిసహస్రసంఖ్యాసుభటుల నేపాలు సేసె
నప్పుడు. ౨౧ 310

క. కరిహయరథబృందం బుద్ధురత నడరెఁ బాండునృపసుతులమూఁకలపై

1. క. గ. వెనుఁబాటు. 2. క, పోవ. 3. అ. యొండె జయంబును నొండె.

నరుఁ డబ్బలంబునకు ని,ష్ఠురగాండీవముక్తశరపక్షతుల్యము సూపెన్. 311

క. నకులసహదేవులును సా,త్యకియును రథసమున శాలుశరమ్ములు నిగుడన్
శకునిపయిఁ గవిసి రతఁడును, బ్రకటస్ఫురణంబునం దిరం బై పోరెన్. 312

చ. సమదగజాధిరూఢుఁ డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో
టములఁ గలంచుచున్ గజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి
త్రముగ వధించుచున్ రథకదంబములన్ సమయించుచున్ మహో
గ్రముగఁ జరించువిస్ఫురణఁ గన్గొని కోపసముద్భటాకృతిన్. 313

ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాల్వుఁ డేనుంగుతోడఁ దునుంగై పడుట.

వ. ధృష్టద్యుమ్నుం డెదుర్కొనిన నతనిఁ ద్రొక్కించువాఁ డై యవ్వీరుండు వారణ
పతిఁ గొల్పిన నతండు. 314

మ. పటునారాచచయంబు కుంభయుగళీభాగంబునన్ బెట్టు నా
టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము సాటోపంబుగాఁ గ్రమ్మఱిం
చుటకున్ సాల్వుని మెచ్చఁ గన్గొనుజనస్తోమంబు కోపోద్గమో
ద్భటవేగంబున వచ్చి పట్టె నది యాపాంచాలు తే రుగ్రమై. 315

క. అతఁడు గద చేతం గొని, భీతి గదురుమనముతోడఁ బృథ్వికి దాఁటన్
సూతాశ్వసమేతంబుగ, నా తే రయ్యేనుఁ గిత్తె నాశనమునకున్. 316

ఆ. ఎత్తి త్రిప్పి యాడి యిలతోడ వేసి పాదములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర
తతులు నిగుడఁ బవనతనయశిఖండిసాత్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున.

క. అతఁ డందఱిబాణంబులు, వితథంబులు సేసి యస్త్రవిద్యాపారీ
ణత సూపె నవ్విధం బద్భుతము [1]వినిచె గగనచరతతులచిత్తములన్. 318

వ. అప్పుడు. 319

తే. [2]అజ్జపాటించి మదివెఱ యుజ్జగించి, రయము మెఱయఁ బాంచాలరాజసుతుఁడు
గదిసి యెగసి కుంభస్థలి గదఁ బగుల్పఁ, గొండ గూలిన ట్లక్కరి గూలె నధిప.

క. ఆలోన శినివరుఁడు వి,శాలాస్యప్రదరనిహతి సాల్వునిశిర మా
భీలముగఁ ద్రుంప నాతఁడు, గూలిన మనమూఁక విచ్చెఁ గురువంశనిధీ. 321

ఉ. వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
న్మీలితవిక్రముం డగుచు మెయి నాతనిఁ దాఁకె నస్త్రవి
ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత వారలు పోర వారిదో
ర్లీలలు సూచి రోటువడి రెండుబలంబుల యోధవీరులున్. 322

వ. ఇట్లు పెనంగు చుండి. 323

క. కృతవర్మ నొంచె నెనిమిది, శితశరముల శినివరుండు శినివరు నావం
బతఁడు దునిమె బలువిలుఁగొని, యతనిహయంబులను సూతు నాతఁడు గూల్చెన్.

1. గ. బఱచె. 2. క. గ. అజ...[illegible] బుజ్జగించి

గయ్యాళియ్యిరువుర కమ్యోద్రౌపదీపుత్త్రు), లేవురు వతిఁ గిట్టి యింద్రియములు
తే. వాలిశునిఁ జిక్కువఱిచినవగిదిఁ దలర, జేయ నతఁ డీడఁబోవక సాయకములు
పెక్కురయమున నిగిడించి యక్కుమార, వితతిఁ గలఁపఁ దత్సంగరమతిశయిల్లె.

వ. మఱియు ననేకు లనేకులం బొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చినయుగ్గలిక నుగ్గ
రంబులు రెండును గలయఁ బెరసినం బేర్చినపెంధూళి భానుబింబంబు గప్పి యప్పుడు
దొరుఁగు నరతురంగమాతంగరుధిరధారల నడంగిన నధికం బైన సంగరంబు
నకుం గడంగిన కౌంతేయులయురవడికి నోపాటించి మనమోహారంబు దొరలు
మరలిన మరలనీక నీకొడుకు పురికొలుపుకొని తఱిమినం గవలి ధర్మసుతుండు.

తే. మూఁడునారాచములఁ గృపుఁ గ్రేఁడి చెఱిచి
వాలి కృతవర్మహయముల నాలుగింటఁ
గూల్పఁ దన తేరిపై నిడి గురుసుతుండు
దొలఁగఁ గొంపోయె నవ్వీరరథుని నృపాల. 384

చ. కురుపతి చూచి చిత్తమునఁ గోపము పెంపెనలార నేడునూ
ఱరదము లాతనిం బొదువుఁ డట్లుగఁ బంచిన నొక్కపెట్ట బం
ధురతరవారివాహములు తోయజబాంధవుఁ గప్పుచాడ్పు దోఁ
ప రయముమైఁ గడంగి యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్. 385

క. కనుఁగొని శిఖండిముఖయోధనికాయం బదరి యా రథప్రకరంబున్
సునిశితశరప్రకరములఁ, దునుమాడెన్ శాత్రవదరనము దొల వాడంగన్. 386

వ. ఆ సమయంబున మనదెస సుల్కాపాతశర్కరావర్షాదు లగునుత్పాతంబులు గలిగె
వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీరు కొల్లల సేయుం డేను
[1]వెడమట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద నంచు సముద్ధతిం గదిసె
నప్పుడు మద్రేశబలపురస్సరం బైనయమ్మోహారంబు రభసంబునం దఱిమి
పాండవసేనాసంరంభంబున కోర్వక తిరిగిన నాసుబలసూనుండు ప్రబలతురంగ
దశసహస్రంబులతో వేగంబు మెఱయ వైరిసేనవెనుకఁ గిట్టి యేను గలుగ
మీకు భయం బేల యని యక్కౌరవసైనికులం బేరుకొని యదల్చి యార్చిన
నా కౌంతేయవాహిని కలంగిన ధర్మనందనుండు సహదేవు నాలోకించి. 387

→ శకునిసహదేవు లాశ్విక సహాయులై ఘోరంబుగాఁ బోరుట. ←

ఆ. వేగ తాఁకు మైదుకవేలగుఱ్ఱంబులు, ద్రౌపదీతనూజతతియు నీవు
శకుని ననుడు నతఁడు సంరంభజృంభియై, యట్ల చేయ ఘోర సమయ్యెఁ బోరు

వ. అట్టియెడ. 389

సీ. లీలఁ గట్టియతోడఁ గూలంగ వైచియు, డొంకెనపోటులఁ బొంక మడఁచి
పడఁద్రోచి [2]యీను వాల్గదిశండములుగ గ్రేసియుఁ గఱారంబులఁ జీఱి చెఱచి.

---

1. గ. జ. వెడమట్టున. 2. అ. జ. వాలుఁ గదిశండలుగను గ్రేసియుఁ.

గిటడంగించియుఁ గిట్టి రొండారఁ బట్టి, కొని త్రుల్లుచండంబు సనికిఁ జొచ్చి
సేలకు వంచియుఁ గేలిమై [1]గళముపై, సెక్కియుఁ జెక్కిండ్లు సొక్క మొగిన
ఆ. మొక్కటయు సహించి యుక్కునఁ బెనఁగియు, మఱియు వివిధగతుల నుబ్బి చెలఁగి
బొమ్మలాడినట్లు [2]పోరి యారావుతు, లధిప చెలియ మొఱసి రందు నిందు. 340
వ. మఱియు ననేకప్రకారంబుల ఖండనంబు సేసిరి వదంపడి యమ్మాద్రీకుమారుని
వీరోద్రేకంబునకు సోహటించి గాంధారసోదరుం డాఱువేలతురంగంబులతోడం
దిరిగి సతండును ద్విసహస్రహయశేషసేనాసమేతుం డై యున్నకడ కరిగె నా
సౌబలుండును జుట్టి వచ్చి ధృష్టద్యుమ్నుని మొనపైఁ బడిన నతండు సైన్యస
ముద్దండసంరంభం బెసంగ విక్రమాటోపంబు సూపినయపుడు పంచసహస్రత్రిశత
హయంబులు వడిన రౌద్రంబు రూపు దాల్చిన ట్లాయుధఖండనాస్థిభంజనశబ్ద
శ్రవణంబునను రక్తమాంసమేదోస్థిమస్తిష్కమజ్జాసమ్మిశ్రితదారుణరణతలదర్శ
నంబునను దదీయవిస్రగంధాఘ్రాణంబునను యోధులు భీతచేతస్కు లైరి తెగిన
తల యొకచేతను నెత్తుట జొత్తిల్లినకరవాలం బొకకరంబునను బట్టుకొని యట్ట
లాడినట్లు పెనంగి యాశకుని హతావశిష్టంబు లైనశతాశ్వంబులతోడఁ దొలంగి
యచ్చటిజనంబులతోఁ గురుపతి యెచ్చట నున్నవాఁ డనిన వార లి ట్లనిరి. 341
ఉ. అల్లదె కంటె పూర్ణశశియట్లు కడుం జెలువొందెఁ జూడఁ బె
ల్లి రథప్రతాన మదె యేపున సంగరకేళిఁ జాల శో
భిల్లెడు సయ్యెడన్ రిపువిభీషణవిక్రమణప్రకారగా
ఢోల్లసనుండు భూపతి మహోన్నతి నొప్పెడుఁ బొమ్ము చెచ్చెరన్. 342
వ. అనిన విని తల యెత్తి చూచి తత్ప్రదేశంబున కరిగి యద్ధరణీశుం గని యతని
కిట్లనియె. 343
క. పాలించితి నే గుల్మంబులఁ దేరుల కుఱికి యింక భూరిరయమునన్
బొలియింప వలయుఁ బ్రాణంబులు దాఁచిన వశమె పాండుపుత్త్రుల గెలువన్.
వ. రథంబులు గజంబులు డిగినం గాని కాలుబలంబుల నడయించుట పని గాదనిన
నమ్మాటకు సైనికులు సంతసం బంది బరవసంబు సేయ నమ్మహీనాయకుండు
సముత్సాహదోహలి యై తఱిమిన మూఁకలు కడంక మొలర్ప దర్పస్ఫురితంబు
లగుచు నురవణించినం గని గాండీవి గోవిందున కి ట్లనియె. 345
క. మొనసి చనుదెంచు దుర్యోధనసేనాసముదయంబుఁ దఱియ నుఱవడిం
జననిమ్ము మనరథము నా, సునిశితబాణముల సమయఁ జూచెద దీనిన్. 346

దుర్యోధనుమాత్సర్యం బుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట.

వ. అనుచు నమ్మొన యాలోకించి నిరూపించి. 347
క. పెనఁకువ యొదవ త్రైవ్యాక పదు, నెనిమిదిదివసములు సెల్లెఁ గ నేఁ బెనఁగంగా

1. క. గ. దళముపై; 2. గ. పొరియ

వనధిం బోలెడుకురుబల, మనఘా కనుఁగొనఁగ గోష్పదాకృతి యయ్యెన్.

అ. దైవ మిట్లు గలఁచునే వీరి మదిమది, నుండిఘోర మైనయుద్ధమునకుఁ
దొడఁగ వలయునట్టితొడరువు కావించి, కొనిరి చీకురాజ్యకొడుకు లేచి. 349

చ. అమరనదీసుతుండు పడినప్పుడు వీరలబుద్ధి నంధికా
ర్యమునకుఁ జొచ్చు నింక నని యాత్మఁ దలంచితి నమ్మహాత్ముఁడు
న్సముచితవాక్యవృత్తిఁ గురునాయకుఁ దేర్పఁగఁ జూచెఁ జిత్తదో
షమహిమ నద్దురాత్ముఁడు ప్రశాంతత నొందఁడు యెన్నిభంగులన్. 350

క. గంగాతనయుఁడు దెగినను, సంగరమున కుత్సహింపఁ జనునే తమకున్
వెంగలు లని యప్పుడు దెలి,యంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా. 351

ఉ. దంతియుఁ దాను నాజి భగదత్తుఁడు గూలఁగఁ జూచి సింధుభూ
కాంతునిచావు దెల్లముగఁ గన్గొని యాతనిఁ గావఁ బూని య
ట్లంతలు రాజు లెల్ల సమయం గని ద్రోణునిపాటుఁ గాంచి యా
వంతయు నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ డెంతమూర్ఖుఁడో. 352

క. తనయనుజు లకట దుశ్శా,సనుఁడును లోనైనవారు సమసినచందం
బును బంధుసహితముగఁ గర్ణుని గీటడఁచిన విధంబును జూడఁ డోకో. 353

క. అది యెల్ల నేల చెప్పఁగఁ, దుది శల్యునిపాటుఁ గనియుఁ దోఁప దితఁడు బ
ల్లిదుఁ డని ధర్మజు దెసఁ దలఁ, పిది కురుపతి బుద్ధికొలఁది యేటికి భగవన్. 354

క. క్షోణీరాజ్యార్థము దన, ప్రాణము గలుగంగ నీఁడు రారాజు జగ
త్త్రాణపరాయణకరణధు,రీణుం డగుపాండుసుతగరిష్ఠున కెట్లున్. 355

వ. కావునఁ గొఱంతయును దీర్పవలసి యున్న దనిన విష్ణుండు జిష్ణున కిట్లనియె. 356

ఉ. అక్కడ సంధికిం జనినయప్పుడు నవ్విదురుండు కృష్ణ నీ
విక్కడ కేల వచ్చితి విహీనవివేకుఁడు [1]దుర్మదాంధ్యముం
దక్కడు సంగరంబ యుచితం బగుకృత్యము గాక యిమ్మెయి
న్మక్కున నూర్పు గల్గఁ గుజనుండు సుయోధనుఁ డుర్వి యిచ్చునే. 357

వ. అని బోధించె నదియునుం గాక దుర్యోధనుండు జనియించినప్పుడు మును
లిప్పాపాత్ముండు నిఖిలక్షత్త్రియక్షయహేతు వగు నని యాదేశించిరి గాదే
యనిన నర్జునుం డతని కిట్లనియె. 358

తే. అమ్మహాత్ములు సెప్పినయట్ల యయ్యె, నన్నవారలఁ బొలియించి తన్నువిడిచి
కాని విడువండు ధృతరాష్ట్రసూనుఁ డుర్వి, ధర్మసూనున కిది నిశ్చితంబు కృష్ణ.

క. దుర్బల మగునయ్యెఁకను, దోర్బల మొనఁగంగ నిపుడ తుంచెద [2]నాదు
ర్నిర్బంధపరుఁడు దన దగు,దౌర్బల్యము గనుచు మదము దక్కఁ గనుఁగొనన్.

వ. రయంబున రథంబు గడవు మనుడు నుత్తుంగమాతంగమహీరుహశోభితంబును

---

1. అ. దుర్మదాంధతన్. 2. అ. శే నాదిర్బంధ.

సాంద్రస్యందనగుల్మగహనంబును బహుళహయకదంబకీర్ణంబును సముద్భటసుభట లతాలసితంబును నైనసుయోధనుసేనాకాననంబునందు యూధపమహావాయువు ధనంజయదారుణానలంబు దరికొల్పిన. 361

క. ఆ కృష్ణవర్త్ముఁ డుజ్జ్వల,భీకరశరజిహ్వ లడరఁ బేర్చిన నధిక
వ్యాకులత నొందె రోదసి, నాకౌకస్సమితి మెచ్చు నం బొదలంగన్. 362

వ. ఇట్లు దారుణరణవిహారణంబు సలిపి సవ్యసాచి యా సైన్యంబు నిపతితవిఘటిత భ్రాంతపలాయితంబు సేసినఁ దెరలక నిలిచి కురుపతి కరతలం బెత్తి నిలు నిలు మని యెలుంగునూపిన నది మగుడఁ బురికొని నిగిడినేమినినదఘంటాక్వాణకింకిణీ నిక్వాణంబులు సెలంగఁ బాండవబలంబుఁ దాఁకిన ధృష్టద్యుమ్నశిఖండిశతానీకు లయ్యనీకంబు ననేకవిధసాయకనికాయంబులం గప్పి రప్పుడు ధృష్టద్యుమ్ను నర దంబుచక్కటికి సంరంభంబున. 363

ఉ. భూపతి మించి యాద్రుపదభూపతనూజునురంబు నిర్భరా
టోపత యుల్లసిల్లఁగఁ బటు ప్రదరంబుల నొంప నాతఁ డు
ద్దీపితకోపుఁడై హరులు ద్రెళ్ళఁగ సారథి ద్రొల్ల నేయఁగా
నే పతి తేరు డిగ్గి యతఁ డెక్కె హయోత్తముఁ గౌరవేశ్వరా. 364

వ. ఎక్కి కొండొక తొలంగి మాతంగఘటలం బురికొల్పిన నవి పురందరనందను నరదంబుఁ బొదివిన నవ్వీరుండు ఘోరనారాచధారల నవ్వారణంబులపైఁ గురి యం గని గదాహస్తుండై యరదంబు డిగ్గి యనిలపుత్త్రుండు గవిసినఁ దుండంబు లవిసియు దంతంబులు దునిసియుఁ గుంభంబులు వగిలియుఁ బ్రక్కలు చదిసియు వెన్నులు విఱిగియు నగ్గజంబు లొఱలుచు నెత్తురులు గ్రక్కుచుఁ దెరలుచు నుడివడుచుండ వెండియుం బైపై నురవణించుకరులం గనుంగొని ధర్మజనకుల సహదేవులును ధృష్టద్యుమ్నాదియోధులు నద్దిక్కుతఱిమి రట్టియెడ నశ్వత్థామ కృతవర్మకృపాచార్యులు దుర్యోధనుఁ దేరిగములలోనం గానక కలనం బడియెనో యని యనుమానించుచు నచ్చటిమానవపతులం గురుపతి యెచ్చట నున్నవాఁడని యడిగినఁ గొందఱు శకునిదెసఁ [1]దొలంగె ననఁ దక్కటివా రతని వెదక నేల బ్రదికియుండెనేనియుఁ గనికొందము పాండవులమీఁద నుఱికి [2]పొడుతము గాక యనిన విని యట్ల చేయ నారథిత్రయంబును [3]దదనీకంబును వెడలి సౌబలుఁ డున్నచక్కటికిం జనిరి యిట్లు దిక్కుమాలినయ ప్పొమ్మనచుట్టును ముట్టి. 365

దుర్విషహప్రభృతికురుకుమారులు భీముని చేఁ జచ్చుట.

క. పాంచాలకుమారాదు లుదంచితభుజబలము మెఱయ నమ్ములవెల్లిఁ
ముంచిరి నిజకరిహరిరథ,సంచయసంరంభ మెసఁగ జగతీనాథా. 366

1. అ. గలంగె. 2. చ. పోట్లాడుదము. 3. జ. రథానీకంబును.

వ. అప్పు డేను ధృష్టద్యుమ్నునిబారి కోర్వక భంగిఁ దొలంగి తప్పియున్నద్దెస సుద్దామగతి చతుశ్శతస్యందనములతో నడరు సాత్యకిచేతఁ బట్టువడితి నట్టియెడ వడముచే కుంజర ప్రకరభంజనవిహరణపారీణతం బేర్చి యార్చినం జూచి నీకొడుకులు దుర్విషహ దుష్ప్రదర్శన ప్రముఖులు శితవిశిఖంబులు గురియుచుం గవిసి యబ్బలుమగనిం బొదివిన నతండు రథం బెక్కి యెక్కుడుమదంబున భల్లనారాచాదిబాణంబులఁ బ్రాణంబులు గొనినం గనుఁగొని హతశేషం బైన భవదీయబలంబు క్రోధశోకావేశంబున నవ్వీరుఁ జుట్టుముట్టిన నాజెట్టిజోదు పంచశతరథంబులును దంతిశతసప్తకంబును దురంగాష్టశతంబును బదాతి దశసహస్రంబును దనసాయక సముదయంబుల వేగంబున సమయునట్లుగా సంక్రీడనంబు నూపినం దక్కటివారు దేఱిచూడనుం జాలకంతంత నిలువ భవత్కుమారమారణం బప్రతిహతంబై చెల్లుటకు నుల్లంబు వికసిల్ల శిష్టైకసోదరుం డైనసుయోధనునిఁ దెగినవానిఁగాఁ గొని తన్ను నప్పుడు కృతార్థునిఁగాఁ దలంచుచు మల్లచఱచినం గించిదవశిష్టం బైనయా కౌరవసైన్యంబు వెగడందిఱిచ్చవడియున్నయవ్వసరంబున గుఱ్ఱపుఁదండంబులతో సుదర్శనుఁడు దాను నున్నసుయోధను నాలోకించి గోపాలదేవుండు దేవేంద్రపుత్త్రున కిట్లనియె. 367

సీ. అరు లడంగిరి యుధిష్ఠిరుఁ డాది యగుభవ,ద్భ్రాతలు నీపరిపాలనమున
నుల్లసిల్లిరి సంజయుని బొడుదల వట్టి, కొని వచ్చి సాత్యకి వినుతి కెక్కె
నెలమి ధృష్టద్యుమ్నుఁ డెంతయు నొప్పె ని,ప్పుడ కూడి తెఱుమురియుప్పొంగ నట్టి
నిలిచినహయములం బొలియింపవలయునిం, దున్నాఁడు చూచి తెఱయొడ్డు చక్కఁ
తే. గానమర్చుచుఁ జూక్కులు గలయుదెసలఁ, బొరసి గుప్పుచు ధృతరాష్ట్రపుత్త్రుఁడల్ల
వాఁడె తెల్లనిగొడుగుతో వాఁడి దక్కి, నిప్పుఱు గప్పిన నొప్పుచు నిప్పువోలె.

క. ఇతనిని భవదీయోజ్జ్వల, శితనారాచప్రసారశిఖాభిఖో
ద్ధతి గతజీవితుఁ జేయుము, కృతకృత్యుఁడ వగుదు జగము గీర్తింపంగన్. 369

క. వినుము ధృతరాష్ట్రనందను, లనిలతనయుచేతఁ బొలిసి రందఱు నిం కొ
క్కనుజుండు నితండును ని,ల్చినవా రయ్యుభయు రిపుకు చెల్లెన రిట్లున్. 370

వ. అనిన విని సవ్యసాది సవినయంబుగా నయ్యంబుజాక్షు వీక్షించి. 371

చ. అమరనదీతనూభవుని నస్త్రకళాగురుఁ గర్ణుని మహా
సమరమునం దనేకబలసంఘములన్ బలవన్నృపాలవ
ర్గములను మద్రరాజు దుదిఁగాఁ దెగటార్చె భవత్ప్రసాదవి
వ్యమహిమ యింక నల్పతరవైరినమూహము దాని కడ్డమే. 372

వ. ఇమ్మాఱుకథంబును సూతసుతుం రెండువేలు కాలు హయంబును సౌబలునితోడి యేనూఱుగుఱ్ఱంబులు నింతియు కాదె యానీన యిది కృపాశ్వత్థామకృతవర్మలు గలిసి నిల్చువ నిలిచినయది యేను దఱిమి యఱుముట కలిగెనే నింతవట్టును బరి

మార్చెద నిమ్మాఁక వడియును జాతియుం దనచుట్టు బయలైన సుయోధనుం డెట్లయ్యెడినో యటునూహము మూర్ఖుఁడయెనేని మదీయమార్గణాగ్నికినాహుతి సేసి కపటద్యూతంబున నపహృతంబులైన సకలధనంబులు నల్లుఁగు మొనమరల్చిన వాఁడనై పాండవాగ్రజునిచింతవంత యంతయుఁ బుచ్చివైచెద నేఁడెల్లవనులు సక్కనయ్యెడుఁ గరిపురపురంధ్రీజనులు తమ పతులఁ బుత్త్రులం బోలియుట విని పాండవు లుద్దండబాహువీర్యశౌర్యసమగ్రు లని యెఱింగెదరు గాక యనుటయు నన్నరుమాటకు మెచ్చుచు నతండు. 373

చ. అరదము కౌరవేంద్రుదెస కై నడపంగఁ గెలంకులం గడం
గిరి నకులానుజన్ముఁడును గీచకవైరియుఁ గౌరవేశ్వరుం
బోరఁగొన నుత్సహించి వడి భూవర వారి కదిర్చె సౌబలుం
డరిబలముం దదీయరథికావలియున్ వినుతింప నుగ్రుఁడై. 374

వ. తక్కటివారు నుక్కుమిక్కుఁ గురికొని రాశకునియు సుశర్ముండును సవ్యసాచినిసుదర్శనుండు సమీరనందనుని నీయుగ్రనందనుండు సహదేవునిం దలఁపడి రట్టియెడ.

క. వడముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁడత్యుదగ్రత మెఱయుం
దొడరి భవత్పుత్త్రు మూర్ఖుని, నిమ్మడ వడఁదతూఁపు లేసి నెఱిఁ దూలించెన్. 376

ఉ. కట్టియవైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రితేఁ
బట్టి నతండు సోలియును బాహిరపోవక తేజి యా విభుం
గిట్టి నిశాతబాణచయకలితదేహునిఁ జేసె రావుతుల్
కట్టుపకాసులై నరునిఁ గప్పిరి శక్తుల దోమరంబులన్. 377

వ. గాంధారదేశీయు లగునాశ్వికు లట్లు హావివిన నొదవినకేమకఁ గ్రూరభల్లంబుల శిరంబులు ధరం దొరఁగించినఁ ద్రిగర్తన్యంవనసందోహంబశరి గోవిందపురందర పుత్త్రులపైఁ బటుప్రదరపరంపరలా పరఁగించి విజృంభించిన నవ్విజయుండును.378

సీ. సత్యకర్మునితల చారుకుండలవరి, స్ఫురితత్వ మొందుచు ధరణి డొల్ల
నేసి మృగంబుపై కరఁగుసింగము పోలెఁ, గిట్టి సత్యేషుని గీటడంచి
బహువినసంచితప్రకటకోపానల, జ్వాలలు సాకారలీలఁ బర్వ
తెఱఁగున నరుణవృష్టిప్తిజాలంబు సు, శర్మపై నిగిడించి సాయకత్ర

తే. యం బొడలనాటుటయుఁ దద్రథంబులోనఁ, బెట్టఁగవిసిననన్నిఁటీఁ బితుమూర్ఛి
రత్యములఁ గూల్చియుతనియుఁకరంబు ఘోర, భల్లమున ద్రచ్చి నిర్గతప్రాణుఁ జేసె.

వ. ఇవ్విధంబునఁ ద్రిగర్తపతిం బ్రేతపతిపాలికనిచి మనదెసజనంబులు ఖేదంబునొంద నవ్వారు మోదంబు నొంద నతనినందనుల నేక్కుర నెనమండ్ర ముప్పదుండ్రు మూఁడుమూఁడుగోలలం దలలు నఱికెఁ దత్సైన్యశేషంబు బారిసమర భీతినేమఁ బారిం బవినసుదర్శనుండు దదీయశరజాలంబుల నదర్శనగతుండై పడంవశితప్పరవి

ఖండితకంఠుం డైనఁ గోపంబు దీపింప వగ మిగుల నక్కుమారుమామఁ గయ్యమ్మా
రుతసుతుఁ జుట్టుముట్టిన నతండు బెట్టిదంబు లగుతూఁపుల నది రూపడంగ న
ల్లేపున విహరింపఁ గనుంగొని సహింపక మహీపతియుం దటిబలంబు బరఁసంబునం
గవిసిన నక్కౌంతేయసైన్యంబును నరభసంబున నెదిర్చి పేర్చిన సమయంబున
సౌబలుండును సహదేవుం దాఁకినం దత్సుతుం డులూకుండు బాసట యై యదరి
పడముడియుఁ బిన్నతమ్మునికి బాసట యయ్యె నాశకుని మాద్రీతనయునిఁ బ్రదీప్త
భల్లత్రయంబున నొప్పించి పదినారాచంబు లతనిమేన గుప్పించినం గోపించుచు
నయ్యిరువురు సాయకనికాయంబు నిగిడించిన నాగాంధారరాజు మొగ్గరంబునఁ
గత్తళంబులు గరవాలంబులు పల్యాణంబులు మోరలు గంఠంబులు చరణంబులు
గరంబులు శిరంబులు దునియలై తొరఁగిన ధాత్రి చిత్రాకారం బై యుండె నిట్లు
దనతురగసముదయంబు సమయుటయుఁ జలం బెడపక నీమటంది యన్నకులా
నుజుం గిట్టి. 380

క. పెనుగడఁత దొడ్డయత్తళ,మున వైచిన నతఁడు మూర్ఛమునిఁగి రథముమీఁ
దన పడినఁ గనలి యప్పా,వని పొదివెను గౌరవేంద్రవాహినిఁ గడఁకన్. 381

వ. పొదివినయవ్వీరునారాచంబులతాఁకున. 382

క. అది గొంత పుడమిఁ బడ ను,న్నది పాఱినఁ గని యదల్చి యవనీశుఁడు బె
ట్టిదముగ నెలుంగు నూపెను, మద మూరఁగ నబ్బలంబు మగుడువిధమునన్.

వ. ఇవ్విధంబున దొర [4]యుఱిమి తఱిమి యమ్మెయిన యుత్సాహంబుగాఁ బటులవాహం
బగురథం బెక్కి శకునిఁ గూడుకొని కవిసిన. 384

తే. పాండవులసైన్యమును సముద్దండలీల,మూఁకుకొని నంతలో మూర్ఛదేఱి నకులు
తమ్ముఁ డమ్మామపైఁ బదియమ్ములొక్క,పెట్టగ్రుచ్చి మాఱనివిల్లు ద్రెంచె.

— ఉలూకుఁడు సహదేవుచేత మృతుం డగుట. —

సీ. ఆ సౌబలుండు శరాసనాంతరదీప్తుఁ, డగుటయు నకులుండు ననిలసుతుఁడుఁ
దాఁకిన వారి నతండు పెక్కమ్ముల, నొప్పింప నతనితమ్ముఁ డనిల
సుతసహదేవుల సునిశితశరవర్ష,మునఁ గప్పె నయ్యులూకుని ననేక
సాయకంబుల నొంచి శకునిపై నఱువది,యమ్ములు నాటించి యనుచరులను

తే. బెగడువఱిచె నాభీముండు బెట్టులూకుఁ
డదరి యన్నకులానుజు నంపవెల్లి
ముంప నతఁ డేచి పటుభల్లమున శిరంబు
ద్రుంచె నన్నులమొనలు సంతోష మొంద. 386

క. తనయుఁడు పడ శకుని కనుం,గొని శోకం బాత్మ నారఁ గూరఁగ నస్రల్
కనుఁగొనలఁ దుండు నినిచె, న్మనుజేశ్వర విమతుభాషణంబులుఁ దలఁచెన్. 387

1. క. యొఱది మగిడి తఱిమి యమ్మెయిన.

వ. అట్లు దలంచుచు నిట్టూర్పు నిగుడ సహదేవుపై నదరి మూఁడునారాచంబులు నిగిడించిన. 388

చ. అవి వెసఁ ద్రుంచి యాతనిశరాసనముం దునుమాడె నక్కుమా
రవరుఁ డతం డనిందితపరాక్రముఁ డై పటుఖడ్గయష్టిదీ
ప్తవిపులముద్గరంబున విశ్వభాసితశక్తిని వైవఁ దోడుతో
నవియు ననేకబాణముల నాన్నృపసూనుఁడు నుగ్గు సేసినన్. 389

క. కనుఁగొని పార్శ్వచరులు వి,చ్చిన శకునియుఁ బాఱె నుల్లసిల్లిరి కుంతీ
తనయులు తదీయసేనా,జను లార్చిరి కురువిభుఁడు విషాదము నొందెన్. 390

వ. ఇట్లు పాఱిన. 391

చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ బర్వఁ బాండవా
వరజుఁడు పోవ నీక పొదువన్ వడిఁ బింగలివారు పోరికిం
బురికొని త్రోచినన్ సుబలపుత్త్రుఁడు దత్తురగవ్రజంబుతో
బరవస మొప్పఁగా నతనిపైఁ గవిసెం గృతనిశ్చయాత్ముఁ డై. 392

వ. కవిసినం గని గుణంబు సారించి శరాసారం బడరించి యాసహదేవుం డి ట్లనియె.

చ. తలఁకుట యొప్పునే నృపతిధర్మము నూఁది యెదిర్చి మేమొయిన్
నిలుచుట యొప్పుఁగాక మహనీయుల ధర్మతనూభవాదులం
బలికితి వీవు జూదపుసభంబునఁ దత్ఫల మందె దిప్డు మా
చలము బలంబు నేర్పడియెఁ జచ్చిరి మీయవివేకు లందఱున్. 394

వ. మఱియు నపహసించినవారిలోఁ గురుకులదాహకుం డొక్కరుండ తక్క నద్దురాత్ముండు సూచుచుండ భవదీయశిరంబుఁ దాలఫలంబు లగుడంబునం బడవైచువగిదిఁ బటుభల్లంబున డొల్ల నేసెద మామా పాఱక నిలువుమీ యని యట్లు బహుభంగులం బలికి యతం డేయుసాయకంబులు వారించి దశమార్గణంబులు మేనఁ జొనిపి. 395

క. తురగములు సిడము గొడుగును, శరాసనముఁ దునిమి యార్చి సాహసమున ని
ష్ఠురశక్తిఁ బూన్చి నాతని,యురఃస్థలము వైవ శకుని యుర్వీనాథా. 396

మ. సహదేవుం డది శాతభల్లమున నుత్సాహోగ్రుఁ డై త్రుంచి దు
స్సహభల్లద్వితయంబునం గరయుగస్వైరచ్ఛిదాకేలి న
ల్పి హసద్వక్త్రవిలాస మొప్పనఁగ నాశీలద్యుతిస్ఫారభ
ల్లహతిం గంఠము ద్రుంప మస్తకము డొల్లన్ డొల్లె మేదురా మహిన్. 397

వ. ఇట్లు కౌరవులదుర్నయంబునకు మూలం బగుశకునిఁ దెగటార్చి పేర్చి యార్చిన యనుజన్ము నాలోకించి ధర్మతనయప్రముఖు లపరమప్రమోదభరితాంతఃకరణు లై నిజశంఖంబులు పూరింప శౌరియుఁ బాంచజన్యారావంబున రోదసి నింప సుయోధనుసేన చెదర బెదరక నిలిచి యాసౌబలుసైన్యంబు సహదేవునిపై నసే

శాత్రుశస్త్రంబులు గురియుచుఁ గవిసినం గవ్వడియు వడముడియు నవియన్నియు మోఘంబు లగునట్లు చేసి యమ్మూఁక బడలువడ నేసి యుల్లానభాసితులై వంగని జనపతి శోకాక్రాంతమతి యై హతశేషు లైననిజసైనికులం బురికొల్పిన వారలు రథికరహితు లయ్యును దెంపుపెంపున శంకింపక యానవ్యసాచిం బొదివి తదస్త్రశిఖాసందోహంబున మ్రందిపోయి రక్కురురాజు దనచుట్టును బయ లగుటఁ గలయం జూచి కట్టెదురఁ జెలంగునాకాంతేయులం గనుంగొని తొలంగిపోవందలంచె ననుటయు నాంబికేయుండు సంజయుదిక్కు మొగం బై. 398

తే. అట్లు మనసైన్యములు దెగఁబాఱినపుడు, కుంతికొడుకులలో బలంబెంత గలిగె
నకటనాకొడుకెట్టివాఁడయ్యెఁ జెపుము, యనుడు నతఁడిట్లులనియె నమ్మనుజపతికి.

వ. అట్టియెడ రెండువేలు రథంబు లేడునూఱుగజంబు లైదువేలు గుఱ్ఱంబులు పదివేలుకాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండు సంగరాంగణంబున మెఱసి యుండె. 400

క. పలువలనిమూఁకలోఁ గాల్, నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుం డై యొక్కఁడుఁ, దొలఁగి చనియె నేమి చెప్పఁ దుం గురునాథా.

వ. అని ధృతరాష్ట్రునకు సంజయుండు దుర్యోధనుపలాయనం బెఱింగించె నని చెప్పిన విని యటమీఁదివృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయును. 402

ఉ. [1]సంగవిదూరితాకలితసాంతరసస్ఫుట[2]రోహదిద్ధబో
ధాంగనమాశ్రితావదుదయజ్వలనప్రశమప్రవర్తకా
పాంగమరీచిరూపవితతామృతవీచివిహార వాసవో
[3]త్సంగతలోపలాల్యపద [4]సంసృతివారణ దైత్యదారణా. 403

క. ఆశ్చర్యకరణకరుణా, నిశ్చలశుచిహృదయభావనీయవిహారణా
పశ్చిమ[5]నాడీసరణ పురశ్చరణధ్యేయ భక్తరమణవిధేయా. 404

మాలిని. ప్రణవమయగరిష్ఠోపాయసంవేద్యభూమా
భణనమననదూరస్ఫారవిస్తారసీమా
[6]గుణవిభవనిరాసాకుంఠితోల్లాసధామా
గణనరహితలీలా కల్పనిత్యాభిరామా. 405

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజితిక్కన సోమయాజిప్రణీతం బైన శ్రీమహాంధ్రమహాభారతంబున శల్యపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 406

---

1. గ. సంగవిదూరశా...రసస్ఫుట. 2. క. రోపయుద్ధ. గ. లోమయుగ్ధబోధాంగ. 3. గ. త్సంగతలోపలాల్య; జ. త్సంగ తలోపవాస్య. 4. క. సంక్షీణతారణ. 5. జ. నాళీసరణ. 6. గ. గుణభవనిరా.



హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## శల్యపర్వము, ద్వితీయాశ్వాసము.



కరణనిపుణపదప
ద్మా కేవలసత్త్వసద్మ మాయావ్యవధా
త్మాకాయనగమ్యా మధు
రాకృతి [1]సర్వత్రరమ్య హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నిజపుత్త్రుండు పరాజయంబు నొందుట యాకర్ణించి యాంబికేయుండు. 2

క. మద మడఁగి యొక్కరుండును, గద చేకొని రాజరాజు కాల్నడ నెట వో
మదిఁ దలఁచి శోలఁగెనొకొ యా, పద లిట్టివి కలవె మనుజపతులకు నెందున్. 3

వ. అనంతరవర్తనంబు లెఱుంగ నెఱింగింపు మనుటయు నజ్జననాథునకు సంజయుఁ డిట్లనియె. 4

సీ. ఏకాదశాక్షౌహిణీశుఁడై పెంపునఁ, బొంపిరివోవునప్పుడమిఱేఁడు
వెనుక నొక్కరుఁడును జన లేక యేకాకి, యై పోయె నచటికి ననతిదూర
మై యుత్తరము ముట్టికనట్టితూర్పున నొక్క, మడువున్న దానిలోన డఁగియుండు
వాఁడుగా నట్టు లశ్వ్యాలనికిఁ జని చని, విదురునిమాటలు మదిఁ దలంచి

ఆ. యధికమతి నృపాలు కనుజుఁడు [2]సెప్పిన, ట్లకట దానిఁ గొనన యనుచు శోక
తప్తచిత్తుఁ డయ్యె దైవ మెవ్వారి నెట్లు, చేయఁ జాల దేమి సెప్పఁ గలదు. 5

వ. అట్టియెడ సుడిసి చిక్కినమూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషంబుగా నమయించి కృష్ణసారథికంబును ధవళహయంబును గపికేతనంబును నగునుజ్జ్వల స్యందనంబును నప్పురందరనందనుండు బంధుమిత్త్రాభినందితుండై యొప్పినప్పుడు పాలికలన నీబలం బఖిలంబును వెనుగాలిం బడినపేరడవి పగిదిం గానఙ్గబడు చుండ నంతఁ గృపాశ్వత్థామకృతవర్మలు మువ్వురు బ్రతికిపోయి రానమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుంగొని నగుచు సాత్యకి నుద్దేశించి. 6

1. అ. సర్వత్రరమ్య. 2. క. చెప్పిన ట్లకట.

తే. వీని నేటికిఁ బట్టితి ✕ వీఁడు బ్రదికి, [1]యిచట వర్తించి మనకు నె ✕ గ్గేమి సేయు
నప్రయోజన మిది విడు ✕ మనిన నేల, విడుతు నీదోఃప్రహారదలదెగ్గనడుతు ననుచు.

వ. అశ్శైనేయుండు వాలు వెఱికి [2]వ్రేయం జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధి చేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు ముందల విడువు మని యానతిచ్చిన నతండు వినతుండై యట్ల కాక యని పలికి నన్ను విడిచెఁ గృష్ణద్వైపాయనుండు మదీయాననం బాలోకించి బ్రదికిపోయి యెక్కడ కైనం బొమ్మనుటయు నమ్మునీంద్రు వీడ్కొంటి నంత నతఁ డంతర్ధానంబు సేసె నేను దత్ప్రదేశంబు వాసి నీసుతుండు సనిన చక్కటికిఁ గ్రోశమాత్రంబు వోయి ద్వైపాయనం బనం బ్రసిద్ధం బైన యమ్మడుఁగుసమీపంబున. 8

తే. అతనిఁ గాంచితి నతఁ డశ్రు ✕ లడర నడలు
చూడ్కి నామోము చక్కఁగాఁ ✕ జూడ కోర
వోవఁ జూచుచు దీనతఁ ✕ బొంది యునికి
గని మనంబున శోకంబు ✕ గదుర నేను. 9

వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి యెట్టకేల కలుంగు దెచ్చుకొని పారాశర్య ప్రసాదంబున బ్రదికిన తెఱంగు సెప్పిన నమ్మహీకాంతుండును గొంతప్రొద్దు నిశ్చేష్టితుండై యుండి పదంపడి నాదెసఁ జూచి మనదెస బ్రదికిన వారు గలరే యనినఁ గృపాచార్యాదిరథికత్రయంబును బేరుకొని వారలు బ్రదికిపోయిరి తక్కొరుండును బ్రదుకుట లేదని యెఱింగించిన నిట్టూర్పు నిగిడించుచు నామూఁపుపైఁ జేయిడి యన్నరనాథుండు నన్ను నీకడ కనుపం దలంచి నాతో ని ట్లనియె. 10

తే. మామ మానిసి లేకుండ ✕ మడిసి రెల్ల, వారు నీదెసఁ బాండుభూ ✕ వరతనూజు
లాప్తులుండ్రాము నున్నవా ✕ రాహవమునఁ, బడక తొలఁగితిఁ బోటులఁ ✕ బడియు నేను.

వ. అని. 12

క. కౌంతేయులబారిం బడ, నింతియ సిరి చాలు రాజ్య ✕ మెల్లను దారై
పొంత ననుఁ బెట్టుకొని యొక, కొంత యెఱుఁగిరేని నట్టికూ డేమిటికిన్. 13

క. అనుజులఁ దనుజుల మత్సరి, జనులను సమయించి వారు ✕ సమరోల్లాసం
బున మెఱయఁ జూడ నేర్తునె, జననాథున కింతవట్టు ✕ సంజయ చెప్పుమా. 14

దుర్యోధనుఁడు ద్వైపాయనంబను మడుఁగున డాఁగి యుండుట.

క. ఇమ్మడుఁగులోన డాఁగెద, నిమ్ముల నెచ్చటికి నైన ✕ నేఁగెదఁ దగువృ
త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి, యెమ్మెయి నైనియును దీర్తు ✕ నే నిఁక యనుమా

1. ఘ. యెచట వర్తించు. 2. ఘ. తెగ వ్రేయం బూనినఁ గృష్ణ.

వ. అని చెప్పి యమ్మడువు సొచ్చి మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁక కుండ సంస్తంభనంబు సేసికొని యుండె నంత రథ్యంబులు పరిశ్రాంతి నొంది తూఁగాడ శస్త్రాస్త్రాదిక్షతంబు లగునవయవంబులతోడ రాజదర్శనవిషణ్ణు లగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ లచ్చట మెలంగి దబ్బాటుగా నన్నుం గని సంజయా బ్రదికితే యని పలికి కురుపతి ప్రాణంబులం గలఁడే యని యడిగిన నజ్జననాథుఁ డొక్కండును బాఱుతెంచి నీరిలోఁ డాఁగియున్న తెఱం గెఱింగించి యాహ్రదంబు సూపి యే మిరువురము నొండొరులతో నాడినమాటలు దేటపడం జెప్పిన వార లత్యంతవిషాదంబు నొంది. 16

చ. నరవరుఁ డేము సంగరమునం బడ కున్కి యెఱుంగఁ డక్కటా
పరవశ మేది వచ్చెఁ బిదపన్ వినియున్ మముఁ గూర్చికోలు దు
స్తర మనుబుద్ధి నిప్పటికి శత్రులక న్మొఱఁగం దలంచి యీ
వెరవున డాఁగె సర్వపృథివీపతి దుర్దశ నిట్లు వొందునే. 17

వ. అవ్విభుండు పెనుఁబ్రాపై నిలిచిన నేము పగతురతోడం బెనంగం జాలుదుము సమయంబున విజయవిజృంభితు లగుపాండవులు సబలంబుగా నచ్చేరువ నడతెంచిన నారథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి సనుఁగృపాచార్యరథంబుమీఁద నిడికొని మనశిబిరంబున కరిగి రందు. 18

చ. కలగొనఁ బాఱుచున్ సతులు కన్నుల నశ్రుజలంబు లొల్కవీఁ
వులవయి పెన్నెఱుల్ విరియఁ బొడ్మఁగ లాలలు రోదనధ్వనుల్
సెలఁగఁగ మోములుం దలలుఁ జేతులుఁ గెంపుగ మోఁదికొంచు భ
ర్తల సహజన్ములన్ సుతులఁ దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్. 19

వ. హతశేషులైనపతాకాతపత్త్రచామరభృదాదిజనంబులవలన సకలజనసంక్షయంబు వినుచు నేలం బడి పొరలుచు లేచు చునికి యత్యంతకరుణం బై యుండె నప్పుడు మాన్యవనితాజనంబులకావలివారునుం గడంగి వారలం దగినవాహనంబులపై నిడికొని యిక్కడకు వచ్చిరి తక్కినభీతజనంబులు పలుదెసలం బాఱి రట్టియెడ నీకొడుకు యుయుత్సుండు శోకసంతప్తచిత్తుం డై. 20

శా. గంగానందనుఁ డాది గాఁగ గురుసంఘముం బెల్ల సంగ్రామధా
త్రిం గూలెం బతి యొక్కరుండుఁ బటుకాంక్షతోయప్రతాపంబుపే
ర్మిం గీడ్పాటున గోర్పి పాటె విధి న్యాయమేఁ బ్రాణముల్ నిల్పె నా
కుం గాంతాజనులం దగంగఁ బురికిం గొం చేఁగు టర్హం బగున్. 21

వ. ఏకాదశాక్షౌహిణీభర్త మన్నించుమానవతులు గాసి యగుదురే యని మనంబునం దలపోసి రథంబు డిగి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు నెఱింగించిన నప్పాండవాగ్రజుండు పరమకృపాపరుండు గావునఁ బ్రీతుండై శౌరియాననం బాలోకించి యది మేల కాదె యని పలికె నతం డనుమతి సేయ, నవ్వైశ్యాపుత్త్రు

పరిరంభణంబు సేసి తెన్నుతలంపు తలంచి తని సంభావించి వీడుకొలిపిన నతండు
రథారూఢుం డై రథ్యంబులఁ ద్వరితగతి నడపి భూపతిప్రేయసీజనంబుల కధ్యక్షు
లగువృద్ధకంచుకులం గలసి వారును దానును వారల ముదితప్రకారంబులఁ దేర్చి
పురంబు ప్రవేశించునప్పు డెదుర విదురుం గాంచి. 22

చ. అతఁ డడుగంగ శల్యసుబలాత్మజులుం బల మంతయుం రణ
క్షితిఁ బడు టేర్పడం బలికి చెప్పెఁ దురంగము డిగ్గి మేదినీ
పతి యొకరుండుఁ బాఱుటయుఁ బాండవముఖ్యులు ప్రీతిఁ బంపఁగా
నతివల నిల్లు సేర్చుటకు నై యిట రాకయు మానవేశ్వరా. 23

వ. అనిన విని యతండు శోకవ్యాకులుం డగుచు నవ్వైశ్యాపుత్త్రుం బొగడి కాలో
చితకృత్యం బాచరించి తెన్ను చేసి తని పలికి మఱియు ని ట్లనియె. 24

తే. ఎప్పుడును సంజయుండు వచ్చి యెఱుఁగఁ జెప్పఁ
బలికి సమరవిశేషంబు లతఁడు నేఁటి
తెఱఁగు చెప్పెడిఁ గాక యేతెంచి మున్న
మనము వినిపింపఁగాఁ దగ దనఘ దీని. 25

వ. ఒండుముఖంబున నివ్వార్త నగరు సొరకుండునట్లుగా సంవిధానంబు సేయ
వలయు నీవు దుర్యోధనుప్రియాజనంబులను దద్రక్షకులను దోడ్కొని భవదీయ
మందిరంబునకుం జనుము తక్కటివారి నంతంత నెడఁగోవట్ల నిలువ నియమింప
వలయు నని పలికి తానును యుయుత్సుండును సావధానప్రయత్నంబున నవ్విధా
నంబు సంఘటించి నిరతమ్ముండు పెద్దమొగసాలం, జాలుమానుసులం గావలిపెట్టి
యభ్యంతరంబు ప్రవేశించియుండె నక్కడఁ గౌరవసేనాసన్నివేశం బత్యంతవిరళ
జనం బయ్యె మున్ను మాతంగతురంగసుభటబృంహితహేషితభాషణంబుల
వలన శబ్దాంతరంబు గర్ణగోచరంబు గాని యట్టియాశిబిరంబు నిశ్శబ్దం బయి
యుండె ననిన విని యాంబికేయుం డ ట్లనియె. 26

క. సూతసుత యిట్లు పగతుర, చేత మనబలంబు రాజసింహుఁడు బాసు
ప్రాతమ్మును సమసినఁ దుది, నే తెఱఁగున నడచితిరి నక్రేంద్రుఁడు మీరున్. 27

వ. అనుటయు నమ్మహీకాంతునకు సంజయుం డిట్లనియె నంత నయ్యెడఁ గౌంతే
యులు సైన్యంబును దారును సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగు
దెంచు కలకలంబు వీతెంచిన. 28

క. కృతవర్మయుఁ గృపుఁడును గురు,సుతుఁడును గనుఁగొని మకొండుక వోటికిఁ జని ర
ట్లతిరభసంబునఁ గుంతీ,సుతు లచటికి వచ్చి నిను గనుకొం బలుగడలన్. 29

వ. అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చనిరి చనునప్పు డజాతశ
త్రుండు నీపుత్త్రునగరిలోనిజనంబులఁ గ్రుచ్చితోడం గదుంకొని వెలువడుండం దని

పలికి చనియె నట్లు వారు నిజశిబిరంబునకుం జనుటయు మనయోధవరులు నేను మనంబున నడలు గదుర నమ్మడుఁగుకడకుం బోయితిమి కృపాదు లగుమువ్వురు దమరాక యెఱింగించి యమ్మనుజపతి కి ట్లనిరి. 80

కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట.

క. లెమ్ము కురునాథ కడఁగుము, మమ్మెం గొని పాండుపుత్త్రప్రమథనమునకు సై
న్యమ్మదియును నీచేతఁ గృ,శ మ్మయ్యెడుఁ జుమ్ము వలదు శంకింపంగన్. 81

వ. అట్లు గాక గెలిచి భూమి యేలుట యొండెఁ జచ్చి నాకలోకసుఖం బనుభవించుట యొండెం గాని నీయట్టివాని కిట్టిచెఱంగు కర్తవ్యంబు గాదని పలికిన విని యవ్విభుండు వారల కి ట్లనియె. 82

చ. తనువు ఘనాస్త్రశస్త్రములతాఁకున నొప్పిని దప్పి పుట్టె నా
మనము వశంబు గా దకట మాటలచందము సూడ మీరు డ
స్సినయటు లున్నవార లనుజీవులు లేరు తొలంగి నేఁటిమా
త్ర నిలువుఁ డల్లి పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్. 83

వ. అనవుడు నగ్గురునందనుండు. 84

ఉ. ఏ లనుమాన మేను సమయించెద వైరము నేఁటితోడఁ బాం
చాలుర నెల్లఁ దీవ్రశరజాలములం బొలియించి కాని భూ
పాలక వుచ్చుఁ గత్తళము పాటిగఁ బట్టును నామమాట లి
య్యాలితనంబు వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్. 85

వ. అనియె నప్పు డనిలసుతునివేఁటకాఱులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతులై జలపానార్థం బమ్మడువునకు వచ్చి రంతకుమున్న ధర్మనందనుం డొక్కబోయం బోఁడఁగని దుర్యోధనుం డెం దొలఁగెం జెట్టుచేముల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ వలయు ననిన వాఁడును వృకోదరునిమృగయులలోనివాఁ డగుటఁ దమవారికి నెఱుక వోయి యమ్మాట తెఱం గెఱింగించుటం జేసి యప్పని మనంబులం దున్నట్టియాబోయ లట్లు కలన నేమఱి నల్లాపంబులు సేయుచున్న యన్నరనాథునియారథికవరులవచనంబులు విని పూర్వాఖ్యానంబువలన నయ్యుక్తిప్రత్యుక్తులపరిపాటి దేటపడిన నన్నీటిలో నీకొడుకు డాఁగి యుంట నిశ్చయించి తమలో నెల్లన ని ట్లనిరి. 86

క. ఈరథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం
గౌరవపతి డాఁగినగతి, బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్. 87

తే. అతఁడు పనద్రన మొసఁగు మారుతతనయుని
మున్న గని మెచ్చు వడయుద మన్నరేంద్రు
నతఁడ కాన్పించు మనల రక్షయునఁ బోవ
వలయు మాంసభారంబులు వలదు తెంపు. 88

వ. అని మోవులు డిగవిడిచి వెనం బాఱి రయ్యవసరంబునఁ బాండునందనులు నీ నందను వెదక ననేకచారులం బాలికలనికలంకులనుం బుచ్చి యాతండు తమ కగపడమికిఁ జింతాక్రాంతు లై యుండ నాఖేటకులు భీమునివనిహారులఁ ద్రోచి కొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాంచి యమ్మరుత్సుతున నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. 39

క. తమవిన్నమాట లన్నియుఁ, గ్రమమునఁ జెప్పిన నతండు గడుఁ బ్రియమున న
ర్థము లొసఁగె వారికి ననే,కములు వహింపంగఁ గొలఁది గా కుండంగన్. 40

వ. ఒసంగి యాలుబ్ధకుల నగ్రజుఁ గానిపించి దేవా దుర్యోధనుండు ద్వైపాయన హ్రదంబున నొక్కఁ డుద్రవిద్యం జేసి జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లు గాఁ జేసికొని డాఁగియున్నవాఁడు వీ రెఱింగి వచ్చి రని యతనికి విన్నవించి యాసుయోధనగురునందనాదులసల్లాపంబు లెఱింగించిన నతండు పరమహర్షంబున నాఖేటకులకు బహువిధంబు లగువసనధనంబు లిచ్చి తక్కటతమ్ములకును గృష్ణునకుఁ జెప్పికొని వారును సకలబంధుమిత్రపరిజనంబులునుం దోడన చను దేర నుద్దామగమనంబున. 41

తే. తురగఖురపుటరథనేమికరిపదాతి,ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ
పణవనిస్సాణకాహళరణన మెల్ల,దెసలఁ బరఁగంగ వచ్చె నద్దనకు నధిప. 42

వ. అట్లు ధర్మనందనుం డేతెంచుకలకలం బాలకించి యంతకమున్న రణోత్సాహంబున కై రాజు నిర్బంధించుచున్న యగ్గురుపుత్త్ర కృప కృతవర్మలతనితోని ట్లనిరి. 43

మ. ధరణీనాయక పాండుపుత్త్రులు సముద్ధామోద్ధతిన్ వీర వ
చ్చిరి వీరిన్ వడిఁ గిట్టి తాఁకుదము నీచిత్తంబు పోరాటకుం
జొరదే నిప్పటికిం దొలంగి చని యెచ్చో నైన నే ముండి వ
చ్చెద మాపించిన వేళఁ జెప్పినపనుం జేయంగ నేతెంతుమా. 44

ఆ. అనుడు నానృపాలుఁ డయ్యోధవరులతో, నిప్పు డనికి నుత్సహింప కచటి
కేనిఁ దొలఁగిపోయి యిచటికి మఱుసంగ,రంపు పగలు సనినరాత్రి యనుడు.

వ. వారు వారణపురంబున కనివారణంబోయినయది పోకుడు గాక యుద్వేగమునఁ బోయి రేనియు నిమ్మడువున నాయునికి యెఱుంగలే రట్లు గాక యెఱింగిరేనియు నన్నుఁ జేరరాదు మదీయవిద్యావిశేషసంస్తంభితాంభోమధ్యంబు నిర్భయస్థానం బైయుండెడుఁ బొండు మనిన నా గాఢమంత్రంబులతోడ నాకథగడనంబును బోవ బలిజలంబులు శిలాసదృశంబులు గా బిగిస్తంభించె నేను బాండునూనులచూపు లెల్ల కడల మెఱుంగుఁ జేసి రాజు నప్పుడు వెలువడిమడుగు కర్ణంబు గాదయ్యు నతని తోడ స్తంభనవైదగ్ధ్యం బెఱుంగుట నొలసినయాపటుమ ముందటియట్ల వారల తోడం జని ఘని చిత్తంబు గలంగి వంజనంబు జాలక యాకరంబు డిగ్గి యచ్చట

నొక్కయెడ నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడుఁగునకుఁ గొంత నొక్క
వలవుగలపొదయొఱిమిం దూఱి పొంచియుండిరి వారలు దూరంబు గాని యొక్క
విపులవటంబుపొంత విశ్రాంతి నొంది నీనందనువలనికిం జనినహృదయంబులతోఁ
దదీయకార్యచింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధసంభాషణంబులు సేయు
చుండి రక్కడ. 46

క. కలకల నవ్వుచుఁ జెలుచం, బలుకుచుఁ దమకౌతుకులందుఁ బాంచాలకుమా
రులు ననుదేరఁగ బాంధుసు,తులు వచ్చిరి సంతసంబుతో మడువునకున్. 47

వ. ఇట్లు వచ్చి ధర్మతనయుండు [1]భవత్తనయమాయాస్తంభితం బైనయాజలాశ
యంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన యి ట్లనియె.

క. చొర రాదు మనుజులకు నె,వ్వరికిని నిజ్జలము కౌరవపతితివతి ని
ర్భరమాయాసంరక్షా,[2]భరితం బై కాన వీక్షభయఁ డాతండున్. 49

—ధర్మరాజు మడుఁగున డాఁగియున్నదుర్యోధనుని మాఱునాడుట.—

క. అని వెండియు నాపతి గురు,జననాథు గుఱించి పలుకు శక్రుఁడు దో డై
చను దెంచెనేనిఁ బో వ,చ్చునె నాచేఁ దప్పి యిందుఁ జొచ్చినఁ దనకున్. 50

వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున ని ట్లనియె. 51

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయవుభంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడుపరాక్రమలీలలు గొల్చునెట్లు దై
తేయులు దొల్లి మాయల నతిప్రబలాత్ములు లైనఁ దద్విధో
పాయములన్ జయింపరె నృపాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 52

వ. హిరణ్యకశిపువృత్రవధప్రకారంబులు వినవె రావణుండు హోమాదిమాయా
క్రియావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపఁబడె నరకాసురు నేను బరిమా
ర్చిన తెఱం గెఱుంగవె వీఁ డగుపడునట్టివిధంబు సూచికొమ్మనిన విని యప్పాండ
వాగ్రజుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యి ట్లనియె. 53

చ. ఇటు లగునే సుయోధన మహీవలయంబున నిట్టిదైన్యమె
చ్చట విన జూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోర నట్లు త్రుం
గుటయును జూచి తేమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పునే. 54

ఉ. శూరుఁడ వందు రిన్ మడువు సొచ్చుట శౌర్యముచొప్పె మాన మే
యూరికిఁ బోయె నాజి నృపు లోడుదురే నృపుఁ డన్నమాత్రనే
కౌరవవంశజాతుఁడవు కష్టపు[3]జచ్చుట దెచ్చుకొంటి నీ
పేరును బెంపు మాలి యరిబృందము నవ్వఁగ నిట్లు సేయుదే. 55

1. అ. భవత్తనయమాయాస్తంభి. 2. క. పరిగత మై — గ. వరీత మై — అ. భరితాత్మకుం.
3. అ. జావున.

తే. ఈ త్రిధర్మంబు విడిచినఁ గలదె యిహముఁ
బరముఁ బేర్కొలదంబునఁ బలుకువలుకు
లెల్ల మఱచితె విను మవి ప్రొల్లు లైనఁ
గష్టపాటు గా కుసుతేల గావ వచ్చు. 56

చ. కొడుకులుఁ దమ్ములుం గలన ఘోరవుఁజావులు సావఁ జూచి యొ
ట్లాడఁబడె నీదుబుద్ధి రొయిడ లోముట కైనను రాజరాజ యి
ప్పుడువున కీర్తి తెచ్చు విధి మానము ప్రాణముకంటెఁ జాల న
ర్కుఁ డగుట సెప్పఁగా వినవొకో కమనీచతఁ బొంది తక్కటా. 57

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుతబాహాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగి యుండె నటె రాజా జిస్సిరో చచ్చుచో
గాంభీర్యంబును ధైర్యముం విడిచి దోర్గర్వంబు సెం దప్పెనే
సంభన్మానము దూలెఁ గా కని జనస్తోమంబు నిందింపదే. 58

తే. కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులుగాఁగఁ దలఁచి వారలఁగొనియమ్ముగలుచువాఁడ
వై మనంబున శంకింప కట్లు కీడు, చేసి తావ్రాఁవు దప్పిన గాసి యైతి. 59

వ. నీకొలంది గంటి మగవడితి వింక నెందుఁ బోవచ్చు నని మఱియు ని ట్లనియె. 60

మ. భయముం బాయఁగ ద్రోచి వీరగుణముం బాటించి సంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషమునైఁ జా వొండెఁ గెల్పొండెఁ గా
క యధీనత్వము నాకు [1]నీడె యని వీఁకం బేర్చి వే తాఁకు పొం
తయుఁ జే రమ్మాడు రమ్ము తె మ్మిదిఁగినం దైన్యమ్ము వచ్చుం జుమీ. 61

చ. అని మము నోర్చినం బృథివి యంతయు నేలఁగ వచ్చు లేక చ
చ్చిన సురసద్మసౌఖ్యములు చేకుఱు రెండుదెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగ నగుఁబాటును బ్రాణముచేటుఁ దెచ్చుకోల్
విను మము నీ వెదుర్పఁ దగు వేయువిధంబులఁ జాటి చెప్పెదన్. 62

వ. తెంపు చేసి మామీఁద నడుకుట నీకు ధాత నిర్మించినపరమధర్మంబు పురుషుండ
వై తేని దీని ననుష్ఠింపు మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుం డి ట్లనియె.

దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట.

సీ. నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరుదయ్యె
విసుము తెల్లంబుగా మనుజనాథ
రథవాహసారథిరహితుండ నగుటను
బాణాదిహేతుసంపదలు లేమిఁ
బరివారశూన్యత వాటిల్లుటను బంధు

1. క. నింక. గ. నెది.

మిత్రసహాయు[1]లుసమిడి యడంగఁ
జచ్చుటం జోటుల నొచ్చి మేనును దప్పి
గూరి చిత్తంబున గోరి కలయ
తే. కుమతిఁ జేసియుఁ దొలఁగితి నొదిఁగి పేద, దేర్చుకొని రణమునకు నుగ్రదీర్ఘవృత్తి
వచ్చువాఁడనునీవు మీరు వారు విశ్రమింపుఁ డంతకు మఱి రండు సొంపునూప.
వ. అని పలికినఁ బాండవాగ్రజుండు. 65
క. ఇంకాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి మిప్పుడు చట నీ
కుం జేటు దప్పి కురుపతినందన రమ్మింక రణమునకు నాయితమై. 66
వ. అనుటయు. 67
తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు నెల్ల భోగములును గోరుదు చక్కమారులును నాదు
తమ్ములును లేరు తురగరథద్విపప్రహీన యయ్యె నీ క్షోణియు నేల పెనఁగ. 68
చ. ద్రుపదతనూజులన్ గెలిచి దోర్బలసంపద నుల్లసిల్లి మీ
మ్మపజితదర్పహీను లగునట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటినేనియు [2]వృథారథసం బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్ము లేమిని గురుండు మృతుం డగుటన్ ధరాధిపా. 69
క. తనవారుఁ దానుఁ గూడఁగ, ననుభవసుఖ మందఁ జేని నది రాజ్యము రా
జునకు భవత్పరిజనములు, ననుజన్ములు బ్రదికి రేలు మఖిలధరిత్రిన్. 70
క. ఏ నింక సమర ముల్లమ, హీనాయక నీక యుర్వి నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలపరిధానుఁడనై తప మొనర్చెదను మునులకడన్. 71
ఆ. ఓడి వచ్చినాఁడ నుద్ధతి నాకేల, యుడుగు మాని నీవ యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు నీ, తలను కట్టికొనుము ధర్మతనయ. 72
చ. అన విని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనిన్ గుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృదాప్తసహాయులు నన్నుఁ గాదె శ
ల్యునిఁ గొని మమ్ము గెల్చి సకలోర్వియు నేలుట కుత్సహించి తీ
పనవుట లేల మాను మిది పాటిగఁబట్టుము తెమ్ముపోరికిన్. 73
సీ. నీయీగి నేను భూనాయకుఁ డగుటొల్ల, రాజకోటికిఁ బ్రతిగ్రహము ననున
నిను ననిం దెగటార్చి నేలఁ బాలించెద, ననునోర్చితేనిఁ బెంపున సుఖంపు
మేమిటివాఁడవై యిచ్చితి పుడమి నీ, కనిమెదుమాట యిట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీనేర్చినఁ గురుకులంబునకు నిట్లాతఁడేఁ బొంద నేల
తే. శాంతి నొందుటకై ధర్మ[3]సంవిభాగకరణ మొనరింప వచ్చినకమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక వాఁడి నూఁది, మాపినంతైన నుర్వి యీనోవ నంటి. 74
క. ఏమివిధంబునఁ బోరలియు, భూమి కురునృపాల నీకుఁ బుచ్చుకొనఁగ రా

1. గ. లుమిడియడంగి అ. అప్పలయి నడంగి. 2. అ. వృథాశ్రయసంయుత మబ్బు లేదు. 3. అ. సంవిభాగ

కేమియు దైన్యపడితి నా, కేమార్గము పట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా. 75
క. అరులకు సిరి యిచ్చెద నను, వెరవిఁడియుం గలఁడె దీని విడువుము నాకున్
ధర యిచ్చి తేనియును నిను, బొరిగొనకే విడువ నతిమి పోరుట యొప్పన్.
క. నాచే నీప్రాణంబులు, నీచే నాజీవితంబు నిజ మున్నవి యి
న్నీచచరిత యపకార్యము రా,జోచితకర్మకృతనిశ్చయుఁడ వగుము నృపా. 77
వ. అని వెండియు ని ట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు పెట్టించితి పెక్కుకపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే యింక నట్లు యిమ్మాయలం బ్రయోజనంబు లేదు.
క. లే లెమ్ము బిరుదవై ర,ణమ్ములమునకు నీవు గెలుఁగు దద్విధము కదన్
[1]మే లొండు తెరువు లే దిం, కేల యొదిఁగి కష్టపడ నరేశ్వర చెపుమా. 79
వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవారు నట్లు పలికి రనిన విని ధృతరాష్ట్రుండు. 80
తే. ఇట్లు బంకింపఁబడి మఱి యేమిసేసె, నాతనూజుండు [2]మున్ను నెన్నఁడును బంక
బడినవాఁడుగాఁ డక్కటపుడమినాళ్లు, చెఱఁగులును వెఱఁ దనవంపు సేయ బ్రదికె.
క. పరిజనహీనత దీనతఁ, బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల నమ్మెయిఁ, బరితాపము సేయ నేమిభంగి నిలిచెనో. 82
వ. అనుటయు సంజయుండు మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుండును దమ్ములుం గొడుకులును ద్రుపదపుత్త్రులును బొదువుకొని పలుకుపలుకులకుఁ జిత్తం బుత్తలపడ నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం బొనర్చువాఁడై యప్పాండవాగ్రజున కిట్లనియె. 83
సీ. మీ రేవురును బరివారబాంధవమిత్ర,సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిస్యందనతురగసమేతుల, రే నొక రుండ విహీనసహాయ
రత్వంబు విగతాయుధత్వంబు వాహ[3]న,హీనత నొందితి నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు నది గాక పోటుల, డస్సితిఁ గడు మీకు దప్పి లేదు
తే. వరుసఁ దగ నొక్కఁడొక్కఁడ వచ్చిపోరుఁ,డిపుడ పెనఁగి మిమ్మందఱ నెల్ల చెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ జుట్టుముట్టి, పలువు[4]రొక్కనితోఁ బోరఁ బాడియగునె.
వ. అట్లు మీరు సాలరేని. 85
ఉ. తమ్ముల నిన్నుఁ గేశవుని తమ్ముని ద్రౌపదియన్నదమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొకండన యే నిదె వచ్చి బాహువ
ర్పమ్ముల నిర్గవారమును భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మతే
జమ్మున రూపుమాపు క్రియ సజ్జత నిల్వుము సుస్థిరుండవై. 86
తే. వినుము నీకుఁ గృష్ణునకును వెఱచి కాదు, ముందరే నట్టులాడుట యెందుఁ జెల్లు

1. గ. మేలొండవు తెరువు. 2. క. ముందఱ నెన్నఁడును. 3. క. వాహనంబు లేం. 4. క. రొక్కనితోఁ బెనఁగంగఁ బాడి.

సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల, వారలకుఁ దెల్పుటకుఁగాని ♦ వసుమతీశ.

వ. నేఁడు మీ రమ్మందఱ సమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయద్రథశకుని శల్యాదు లగుబంధుమిత్రసహాయులఋణంబు దీర్చెద నని పలికినం బాండవాగ్రజుం డిట్లనియె. 88

చ. సమరముపాడి నీ వెఱిఁగి ♦ శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడును ♦ బూని మహోద్ధతబాహుసంపద
మ్మున వడిఁ దాఁకెదం బిలుకు♦మార్చెద నంట యుదాత్తమైన ధై
ర్యమహిమ గాదె యిట్లనిన♦యంతన యే నటు లేల చేసెదన్. 89

చ. వలసినయస్త్రశస్త్రములు ♦ వాహనముం గొను మొక్కరుండ నీ
గలన జయించువాఁ డతని♦గర్వము నీ వడఁగించితేని నీ
యిల సకలంబు గైకొని వ♦హింపుము రాజ్యవిభూతి వాఁడు నీ
దలపడి పోరుఁ జుట్టలును ♦ దక్కటివారలు నిల్చి చూడఁగన్. 90

వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కిట్లనియె. 91

చ. అరదము లెక్కి ఘోరవివి♦ధాస్త్రచయంబుల మున్ను పోరమే
నరవర క్రొత్తచందమురణంబు కరంబు ప్రియంబు సేయు ని
ష్ఠురగదలం బదాతు లయి ♦ శూరతయుం మహనీయధీరతా
స్ఫురణమునుం బొగడ్త వడఁ ♦ బోరుట మే లని నిశ్చయించితిన్. 92

తే. వింతకూరలు గూడ వున ♦ వేడ్క సేయు
భంగి సంగ్రామమున నూత్న♦భంగు లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున ♦ గద ధరించి
నిను సహోదరులను యోధు♦లను జయింతు. 93

చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ ♦ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదుప్రాణము ల♦కుంఠితబాహువిలాసభాసి వై
యనవుడుఁ బుట్టలోపలిమ♦హాభుజగేంద్రుఁడు రోఁజునట్లు రోఁ
జె నధిప యవ్విభుండు దన♦చిత్తము నప్పలుకుల్ గలంచినన్. 94

→ దుర్యోధనుఁడు గదామండితుం డై హ్రదంబు వెడలి వచ్చుట. ←

వ. ఇట్లు నిశ్శ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలుశూకలాశ్వంబుచందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు నంక్షోభింప నవహాసిత శిలాసారోదారంబును కనకపట్టికామండితంబును నైనగదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని వెడలె నట్లు సంరంభవిజృంభితుం డై. 95

తే. గదయుఁ దానును రుచిరశృంగమునఁ బొల్చు
పర్వతము శ్రేణి సేయునీపట్టిఁ జూచి
కాలదండంబు చేకొని ♦ లీలఁ బొల్చు
జముని గా మదిఁ దలఁచిరి ♦ జనము లెల్ల. 96

వ. అతనిఁ గనుంగొని పాంచాలురును బాండవులును. 97

తే. చిఱుతనగవుతో నొండొరుల్ చేతు లప్ప
ళించి నిర్భరసంతోషకేలి నొప్పి
రమ్మహీనాథుఁ డయ్యవస్థ నెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁగవఁ బొడమఁ గెంపు. 98

వ. కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల నెల్ల నాలోకించి. 99

క. ఈగెలి వేలార్చెద బాహాగర్వము మెఱయ మిమ్ము సంగరమున మహీ
భాగమునఁ గూల్చి నెఱపెద, నాగదబలు [1]పెట్టు లైనఁ గనుఁ డంతకన్. 100

తే. అనుచుఁ బోటులఁ దొఱఁగురక్తాంబుధార
లంగ మెల్లను గప్పిన నప్పు డొప్పెఁ
గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ
బొలుచుకులపర్వతంబుచాడ్పున నతండు. 101

వ. అట్లు ఘోరాకారుం డై నిలిచి నీకొడుకు పాండురాజకొడుకులు బంధుమిత్రపరివారసమేతంబుగా నడరి యొక్కపెట్ట తన్నుం బొదువుదు రని శంకించి పాండవాగ్రజు దెసఁ గనుంగొని. 102

ఉ. రం డిట యొక్కఁ డొక్కఁడ దుర్ధరం బొనరింపఁగ మీరు పల్వు రొ
క్కండను నేను హేతిహతిశ్రాంతుఁ డస్సినవాఁడ నన్ను నా
తం డభిమన్యుబాలుని సధర్మతఁ బోధు లనేకయోధు లొ
క్కండ దన కట్లు చంపి రటు గాఁ గొను మిబ్బవరంబు నాపుడున్. 103

వ. నిరుత్తరుం డై యున్న భవత్తనయున కాధర్మతనయుం డిట్లనియె. 104

క. ఏ నట్లు నూపి చెప్పితిఁ, గాని యది రణంబుపాడి గాదు మెఱుఁగుదుగా
రా నీవు నీదువయి మృత్త్రైనికులను వెఱవ కాయుధము గమ్ము నృపా. 105

క. తల చక్క ముడిచికొని ద్రిం, డలవడ బాధించి పోరి కమరి నిలువు నీ
వలచినయట్టివ యిచ్చెద, నలఘుశిరస్త్రాణకంకటాదులు నెమ్మిన్. 106

వ. మఱియు నొక్క తెఱంగు నీమనంబున మెచ్చును నచ్చునువు నెలకొనం బలికెద నాకర్ణింపుము. 107

తే. ఏఱికొనుమీవు నొకని మాయేవురందు, వాఁడు నీతోడఁ దగఁబోరువాఁడు వానిఁ
జంపి మహి యేలు వానిచేఁ జచ్చి త్రిదివసౌఖ్యమొందుము చేసితిఁ సమయ మేను.

వ. అని పలికి యుజ్జ్వలవివిధవర్మంబు లాతనిఁ దొడఁగం బెట్టించి. 109

క. విను జీవముతో నిన్నుం, జననిచ్చుట యొండు దక్క సమరంబునఁ గో
రినయది నీ కొనఁగెద నిం, తన చెడదుమె యకట యన్నదమ్ములకూర్మిల్. 110

1. గ. పెట్టు లౌనొ—అ. పట్టు లైన.

